# మాతంగిని

(నవల)



బంకింబాబు

జయంతి పబ్లికేషన్సు
గోపాలరెడ్డి రోడ్ :: విజయవాడ - 2.

3

# మాతంగిని

మధుమతి నది ఒడ్డున ఉన్న రాధాగంజ్ అను గ్రామము చిన్నదే అయినా అక్కడ అనేకమంది వర్ధమాన జమిందార్లు ఉంటున్నందు వలన దానికొక ప్రత్యేకత, అందము చేకూరాయి.

అది చైత్రమాసము. ఒకనాడు సూర్యుడు అస్తమించటానికి రెండు గంటల ముందు ముప్పది సంవత్సరముల వయస్సు గల ఒక స్త్రీ పగటి నిద్రనుంచి మేల్కొని తల దువ్వుకో సాగింది. ఆమె నివసించేది అత్యంత హీనమగు ఒక పాకలో. అలంకరణ మొదలగు విషయాలలో స్త్రీలు గంటల తరబడి గడిపేస్తూ ఉంటారు; కానీ ఆ స్త్రీ ఏమీ ఆలస్యం చేయలేదు. రేకు బిగించిన నాలుగు అంగుళాల చిన్న అద్దమును ముందు పెట్టుకొని నీళ్ళురాసి తల దువ్వుకుంది. పాపట్లో కుంకుమ దిద్దుకొని, తాంబూలపు ఉమ్మితో పెదవులను ఎర్రగా చేసుకొని చంకన బిందెతో బజారులోకి వచ్చింది.

ఆమె సరాసరి నదీ తీరానికి వెళ్ళలేదు. ప్రక్క ఇంట

వాసాల గేటు తెరుచుకొని లోనికి వెళ్ళింది. చుట్టూ మట్టి గోడ కంచెవేసిన ఆవరణ మధ్య విశాలమైన నాలుగు గదుల ఇల్లు అది. ఆవరణ పరిశుభ్రంగా ఉంది. ఇంటిని చూస్తే దాని యజమానికి ఏలోటూ లేదనే అర్థమవుతుంది. మూడు గదులకు వెనుక దొడ్డివైపుకు ద్వారాలు, ముందు ఒక గదికి వీధివైపున ద్వారము ఉన్నాయి. మూడు గదులు అంతఃపుర ముగా ఉపయోగ పడుతున్నాయి. యజమానిని కలుసు కొనుటకు వచ్చినవారు, తదితరులు కూర్చోటానికి ముందుగది ఉపయోగ పడుతుంది. దొడ్లో కొంతమేర వంగమొక్కలు ఆకుకూరలు మొదలగునవి పెంచుతున్నారు.

వాసాలగేటు తెరుచుకొని లోనికి ప్రవేశించిన స్త్రీ లోపలి గదులవైపు వెళ్ళింది. అక్కడ ఇద్దరు ప్రాణులు తప్ప మరెవరూ కన్పించటం లేదు. మధ్యాహ్నపు నిద్రనుంచి లేచి మిగిలిన అంతఃపుర స్త్రీలు అటునిటు వెళ్ళి ఉంటారు. అక్కడ ఉన్న ఇద్దరు ప్రాణులు—పదునెనిమిదేండ్ల యువతి ఒకామె, నాలుగేండ్ల బాలుడు, యువతి ఒక గుడ్డమీద పూలు కుట్టుతూ ఉంది, బాలుడు తన ఆటలో లీనమై ఉన్నాడు. అతని ఆట చూడ ముచ్చటగా ఉంది. దగ్గరే ఉన్న సిరాబుడ్డిలోని సిరానంతా ముఖానికి పూసుకొని అతడు అమితానందాన్ని పొందుతున్నాడు. అతని అన్న స్కూలుకు వెళుతూ సిరాబుడ్డిని అక్కడ మరచిపోయి వెళ్ళి ఉంటాడు. ఈ అల్లరి పిల్లవాడు తన అన్న మతిమరుపుకు తగిన శిక్షనే విధిస్తున్నాడు.

వచ్చినస్త్రీ యువతి ప్రక్కనే నేలమీద కూర్చుంటూ "ఏం చేస్తున్నావు?" అని అడిగింది.

ఆనందంతో ఆ యువతి ముఖంలో నవ్వు కన్పించింది—"ఆహా, ఎంత అదృష్టము! అక్కగారు ఇవాళ ఇంత దయతలచారేమిటి! ఇవాళ నిద్రలేవగానే ఎవరి ముఖం చూచానోగదా?" అని అంది.

వచ్చినస్త్రీ నవ్వుతూ "ఇంకెవరి ముఖము చూస్తావు? రోజూ ఎవరిముఖం చూస్తావో వారి ముఖమే చూచి ఉంటావు" అని అంది.

కానీ ఈ మాటతో యువతి ముఖంలోని కాంతి అకస్మాత్తుగా తగ్గిపోయింది. అది చూచి వచ్చినస్త్రీ నివ్వెరపోయింది. ఆమె ముఖంలోని నవ్వుకూడా మాయమయింది.

ఆగంతకురాలి వయస్సు ముప్పదేండ్లని ఇంతకుముందే తెలుసుకున్నాము. ఆమె అంత నలుపూకాదు అంత ఎరుపూకాదు. ముఖము మరీ అందముగానూ ఉండదు, ఆకర్షించగల అవయవ సౌందర్యమూలేదు. కాని ఆమె ముఖంలో ఉన్న చంచలమైన మాధుర్యాన్ని కన్నులలోని దరహాస కాంతి మరింత మధురంగా చేసింది. ఆమె ధరించిన ఆభరణాలు లెక్కకు మిక్కుటంగా లేకపోయినప్పటికీ తక్కువగా మాత్రము లేవు. బ్రహ్మదేవుని అతి వృద్ధుడను ముని మనుమడెవరో ఆమెధరించిన * శంఖుగాజులను తయారు

* బెంగాలులో శంఖుతో గాజులు తయారుచేస్తారు. బెంగాలులోని ప్రతి వివాహిత స్త్రీ వాటిని ధరిస్తారు.

చేసి ఉంటాడనటంలో ఏమీ సందేహం లేదు. ఆభరణ భరితమగు ఆమె స్థూల శరీరంమీద ఒక ముతక చీర శోభిల్లుతూ ఉంది. చాకలి అంటే ఆ చీరకు చాలా కోపమో ఏమో కొన్ని మాసాలుగా అతని చేతికి వెళ్ళినట్లులేదు.

పధ్ధెనిమిదేండ్ల యువతికి ఇలాంటి అలంకారాలేమీ లేవు. ఆమె మాటలలో తూర్పుబెంగాలీల ఉచ్చారణ దోషము కానీ,యాసకానీ కన్పించదు. దీనిని బట్టి సర్వాంగ సుందరియగు ఈ కుసుమకోమలి మధుమతి తీరప్రాంతములో జన్మించినది కాదనీ, గంగానదీ తీరాన రాజధాని సమీప ప్రాంతములో ఎచ్చటనో పుట్టిపెరిగి ఉంటుందని అర్థమవు తుంది. ఎర్రని పసిమి వర్ణముగల ఆ యువతి దేహ సౌందర్యము మనసులోని విచార దుఃఖముల వలన కొద్దిగా మలినమయినట్లుంది. అయినప్పటికీ మధ్యాహ్నసమయపు సూర్యుని వేడికి గులాబి పుష్పము సగము కాంతి తగ్గి సగము వాడినప్పటివలె ఆ యువతి సౌందర్యకాంతికూడా కమనీయంగానే ఉంది.

పొడవుగా పెరిగిన జుట్టును భుజాలమీద జారుముడి వేసుకుంది, కురచగా ఉన్న కేశములు బంధనంలో ఉండు టకు ఇష్టపడక ఆమె లలాటము మీద, కపోలముల మీద పడుతున్నాయి. విశాలమగు ఫాలభాగము క్రింద వంపు తిరిగి అందమగు కనుబొమ్మలు సిగ్గుతో కంపిస్తున్నాయి. చిగురు టాకుల వంటి రెప్పల ఆవరణలోని రెండు నేత్రములను తరచు సగము అంశముగు మాత్రమే మనము ఎప్పుడూ

చూడగలుగుతాము. కానీ అర్థనిమీలిత నేత్రాల చిగురు టాకుల రెప్పలు పైకి విచ్చుకున్నప్పుడు ఆమె చూపులు వేసవి మబ్బులలోని మెరుపు వలె తోచేవి. కానీ యవ్వనానంద ముతో మత్తెక్కిన ఆ తీక్ష్ణ దృష్టిలో ఏదో తీరని ఆవేదన వ్యక్తమవుతూ ఉండేది. ఆ చిన్న చిన్న పెదవులను చూస్తేనే హృదయములో నిండి ఉన్న సుఖదుఃఖము ఎంతో అర్థమవుతుంది. ఆమె అవయవ సౌష్ఠవము, అందము శారీరక మానసిక క్లేశము వలన చాలా భాగము క్షీణించాయి. ఇలాంటి స్థితిలో కూడా ఆమె అత్యంత సౌందర్యవతిగానే కన్పిస్తుంది. ఇంతవరకు అలాంటి సౌందర్యాన్ని ఏ శిల్పి చిత్ర ములలోగానీ, శిల్పములలోగానీ చిత్రించలేదని చెప్పవచ్చును. ఆమె సహజ సౌందర్యవతి; చేతులకు గాజులు, దండకడియాల వంటి అందమైన తాయెత్తులు తప్ప ఆమె ఆభరణాలు ఇతర అలంకారాలేమీ ధరించలేదు.

తాను చేస్తున్న పనిని ఆపి ఆ యువతి ఆగంతకురా లితో సంభాషణ ప్రారంభించింది. ఆ స్త్రీ తన సంసారము లోని కష్టాలను గురించి వ్యక్తంచేస్తూ చెపుతున్న ఆ విష యాలకు యదార్థమైన ఆధారము ఏమీ లేకపోయినప్పటికీ కంట తడిపెట్టుకుంది. మురికి పేరుకు పోయిన కొంగుతో కన్నీటిని తుడుచుకున్నకొద్దీ అవి మరింత పొంగి పొర్లుతు న్నాయి. చివరికి ఆమె మాటలు మాని పూర్తిగా ఏడ్చే ప్రయత్నంలో ఉన్నప్పుడు అదృష్టవశాత్తు ఆటలాడుతున్న బాలునివైపు చూచింది సిరా పులుముకున్న బాలునిముఖాన్ని చూచి ఏడ్పుకు బదులు ఆ స్త్రీ నవ్వసాగింది.

ఇంతలో సాయంత్రంకూడా కావచ్చింది. అదిచూచి ఆగంతకురాలు యువతిని నీళ్ళకు వెళదామని అడిగింది. యువతి అందుకు అంగీకరించలేదు. కానీ ఆగంతకురాలు మాటలతో వదిలే మనిషికాదు. చివరికి యువతి గంభీరంగా ముఖంపెట్టి "కనక్ దీదీ, నేనెప్పుడూ నీళ్ళు తెచ్చుటకు వెళ్ళనని నీకు తెలుసుగదా ?" అని అంది.

"అందుకే నేను రమ్మని అంటున్నాను. రాత్రిపగలు ఈ పంజరంలోనే కూర్చుంటావెందుకు ? ఊరిలోని కోడళ్లు, ఆడబడుచులు అందరూ నీళ్ళు తీసుకురావటం లేదా !"

అప్పటికీ యువతి అంగీకరించలేదు—"దీనికి తగాదా ఎందుకు కనక్ దీదీ ?నాభర్తసంగతి నీకుతెలుసు, నేను నీళ్ళ రేవుకు వెళ్ళటం వారికి ఇష్టము లేదనికూడా నీకు తెలుసు" అని అంది యువతి.

కనక్ ఏమీ మాట్లాడకుండా ఒకసారి గబగబ చుట్టూ చూచింది. తరువాత ఏదో చెప్పదలచినట్లుగా కొద్ది కొద్దిక్షణాల వరకు తలవంచుకొని కూర్చుంది.

"కనక్ దీదీ, ఆలోచిస్తున్నావేమిటి ?"

"నీకు చూడటానికి కష్టంటే—"

యువతి తరువాత ఏమీ మాట్లాడవద్దని సైగచేస్తూ "మాట్లాడకు, అర్థమయింది" అని అంది.

కాస్సేపటివరకు వ్యాకుల చిత్తముతో ఆమె అలాగే కూర్చుంది—"సరే, వెళదాం పద. పాపము కాదుగదా?"

కనక్ నవ్వింది. నవ్వుతూనే ఇలా అంది—"పాప పుణ్యాలనుగురించి చెప్పటానికి నేను భట్టాచార్య పండితుడ ననుకున్నావా? కానీ నాకు వందమంది భర్తలున్నప్పటికీ నేను భయపడను."

"నువ్వు చాలా ధైర్యము కలదానివి!" అంటూ ఆ యువతి బిందెకోసము లేచినిలబడింది.

"వందమంది! అంతమంది భర్తలు కావాలని నీకు కోర్కెగా ఉన్నదా?" అని అడిగింది యువతి.

కనక్ విషాదంగా నవ్వి ఇలా అంది—"నోటితో అనటం పాపము. కానీ బ్రహ్మదేవుడు ఒకభర్తను ఇచ్చాడు, వందమంది అలాంటివాళ్ళే అయినప్పుడు కోటిమంది ఉంటే మాత్రం నష్టమేముంది? పరాయి వాళ్ళనెపుడు కలుసుకోకుండా ఉంటే కోటిమంది భర్తలకు భార్యనైనా నేను మహా పతివ్రతనే."

యువతి ఏదో గొణుగుతూ గబగబ వంటఇంటిలోనికి వెళ్ళి బిందె తీసుకొని వచ్చింది. ఇద్దరు స్త్రీలు నదివైపు బయలుదేరారు. కనక్ నవ్వుతూ "రావే మా అందాల గ్రామపు సుందరీ! నోళ్ళు తెరుచుకొని చూస్తున్న వారికి ఒకసారి నీ రూప లావణ్యాన్ని చూపించి వస్తాను" అని అంది.

"ఛీ, కోతి!" అంటూ యువతి సిగ్గుపడుతూ ముఖము కన్పించకుండా ముసుగు వేసుకుంది.

## 2

కొబ్బరి మొదలగు వృక్షముల తలలమీద పడుతున్న సూర్య కిరణాలు క్రమంగా అదృశ్యమైపోయాయి. కానీ భూమిమీద ఇంకా చీకటి ఆవరించ లేదు. ఆ సమయములోనే కనక్ యువతి ఇద్దరూ నీళ్ళ బిందెలు చంకన పెట్టుకొని ఇంటికి తిరిగివస్తున్నారు. దారిలో ఒక చిన్న తోట ఉంది- తూర్పు బెంగాలులో ఇలాంటి తోటలు చాలా తక్కువగా కన్పిస్తాయి. అందమైన ఇనప కటకటాల ఆవరణలో లెక్కకు మించిన గులాబీలు, గుండు మల్లెలు వచ్చే పోయేవారికి నేత్రానందము కలిగించేవి. పూర్వపు పద్ధతిలో నలుచదరంగానూ వలయాకారంలోనూ చిన్న చిన్న పూదోటలుగా విభజించి వాటిమధ్య ఎర్రని అందమైన కాలిబాటలు నిర్మించారు. ఉద్యానము మధ్య ఒక చిన్న కొలను ఉంది. దాని ఒడ్డున మెత్తని పాన్పువలె పచ్చనిగడ్డి పెరిగింది. ఒకవైపున కొలనులోనికి దిగుటకు మెట్లున్నాయి. వాటికి ఎదురుగానే కచేరీ గదిఉంది. ఆ కచేరీగది వసారాలో నిలబడి ఇద్దరు వ్యక్తులు ఏదో మాట్లాడుతున్నారు.

వారిద్దరిలో పెద్దవాని వయస్సు ముప్పది సంవత్సరాలుంటుంది. దీర్ఘకాయుడు, స్థూల శరీరము, చాలా లావుగా

ఉన్నందువల్ల అతని ఆకారము అందముగా ఉందని చెప్ప లేము. శ్యామవర్ణ శరీరము, సత్పురుషుడని చెప్పదగిన లక్షణాలేవీ అతనిలో లేవు; ముఖములో క్రూరత్వము లేదా కాఠిన్యత ప్రతిబింబిస్తూ ఉంటుంది; నిజం చెప్పాలంటే సాధారణ ముఖాలవలె ఉండదు అతని ముఖము. కానీ అతనిలోని ప్రత్యేకత ఏమిటో కూడా మనము త్వరగా పోల్చుకోలేము. అతడు ప్రశస్తమగు ఖద్దరు మల్లుపంచె ధరించాడు. అందమైన తలసాగా, సన్నని ఖద్దరు-మల్లు లాల్చీ ధరించాడు. లాల్చీ లోపలనుంచి నల్లని దేహము స్పష్టంగా కన్పిస్తూనే ఉంది. దానితోపాటు బంగారు తాయెత్తు కూడా బయటకు తొంగిచూస్తూఉంది. మందర పర్వతము మీది వాసుకి నాగు పామువలె ఉన్న మెడలోని లావుగాఉన్న బంగారుగొలుసు లాల్చీపైకి వచ్చేసింది. లాల్చీకి సన్నని గొలుసుతో ఉన్న బంగారు గుండీలు మెరుస్తున్నాయి. ఇంచుమించు అన్ని వ్రేళ్ళకు ఉంగరాలు ఉన్నాయి. చేతిలో యమదండము లాంటి సన్నని ఇనప బెత్తము ఉంది; వామనుని పాదముల వంటి విశాల పాదములకు ఇంగ్లీషువారి బూట్లు ధరించాడు.

ఆతనితోపాటు నిలబడి మాట్లాడుతున్న రెండో మనిషి ఒక అందమైన యువకుడు, అతని వయస్సు షుమారు ఇరవై రెండేళ్లుంటుంది. మంచి వన్నెగల శరీరము, శారీరక వ్యాయామము లేనందువల్లనో లేక ఐహిక భోగముల వల్లనోగాని అతనిశరీర సహజ లావణ్యము తగ్గినట్లుంది. సామాన్యమైన ధోవతి, కేంబ్రిజ్ చొక్కా ధరించాడు.

కాళ్ళకు ఇంగ్లీషు చెప్పులున్నాయి, ఒకేఒక వ్రేలికి ఉంగరం ఉంది, మెడలో గొలుసులు మొదలగునవేమీ లేవు.

"మాధవ్, మళ్ళీ నీకు కలకత్తా పిచ్చి పట్టిందా? ఇది ఒకజబ్బు, తెలిసిందా?" అన్నాడు మొదటివ్యక్తి యువకునితో.

"మధురాదాదా, ఇందులో జబ్బేముంది? కలకత్తా వెళ్ళాలనుకోవటం నాకు జబ్బు అయినప్పుడు ఈ రాధా గంజ్ మీద మీకున్న మమకారము కూడా జబ్బే అవుతుంది."

"ఎందుకని?"

"ఎందుకని ఏముంది? రాధాగంజ్‌లోని మామిడి చెట్ల నీడలో మీరు జీవితం గడిపారు, అందుకని మీరు ఈ రాధాగంజ్ పేరునే వల్లిస్తూ ఉంటారు. నేను కలకత్తాలోని నుర్గంధములో ఎంతోకాలంగా ఉంటున్నాను గనుక నా మనస్సు అక్కడే ఉంటుంది. అదీగాక కలకత్తాలో నాకు పని కూడా ఉంది"

"నీపని ఏమిటో అంతా నాకు తెలుసు. ఏం పని, కొత్త గుర్రము కొత్తబండి—పనీపాటా లేకుండా జల్సాగా బజార్లవెంట తిరగటం—డబ్బు ఖర్చుచేయటం—చమురు వదిలించుకోవటం—ఆంగ్ల ఉద్యోగులతోనూ తదితర మిత్రులతోనూ కలిసి మద్యపానము చేయటం—ఇంకా ఆనంద తరంగాలలో తేలియాడటం—ఇంతేగా!— కళ్ళప్పగించి

అటుచూస్తున్నావేమిటి! నువ్వెప్పుడూ కనకాన్ని చూడ లేదా!—ఆమే, కానీ ప్రక్కనే మరొకరున్నారెవరు?"

మాధవుడు సిగ్గుపడ్డాడు; కానీ తాను సిగ్గుపడినట్లు తెలియకుండా మాట మార్చివేస్తూ "నిజంగా బ్రహ్మదేవుడు కనకం జీవితంలో దుఃఖమే వ్రాసిపెట్టాడు, అయినా ఆమె నవ్వుతూనే ఉంటుంది" అని అన్నాడు.

కానీ మధురబాబు ఊరుకోలేదు. కనకం ప్రక్కనే ఉన్న యువతి ఎవరో తెలుసుకోవాలని అతనికోర్కె. ఆమె ఎవరైనదీ మాధవునికి కూడా తెలియదు. ఆ యువతి ముఖం మీద ముసుగు ధరించినందువల్ల ఇద్దరిలో ఎవరూ ఆమెను గుర్తించలేక పోయారు. ఆ యువతి దేహలావణ్యము, ఆ నడకలోని అందమూ చూచి మధురబాబుకు మరింత కుతూహలము కలిగింది. సరిగ్గా ఆదే సమయానికి వీచిన గాలి విసురుకు ముఖంమీది ముసుగు పైకిలేచింది. ఆమెను చూచి మాధవుడు త్రుళ్ళి పడ్డాడు.

"ఆమె నీకు తెలిసినట్లుంది, ఎవరు?" అని అడిగాడు మధురబాబు.

"మా వదిన"

"అంటే రాజమోహనుని భార్యయా?"

"అవును, ఆమే."

"రాజమోహనుని భార్యయా? ఇంతవరకు నే

నెప్పుడూ చూడనేలేదు" అని అన్నాడు మథురబాబు సందేహంగా.

"ఎలా చూడగలుగుతారు! ఆమె ఇంటిలోనుంచి ఎప్పుడూ బయటకే రాదు."

"మరి యివాళ ఎలా వచ్చింది?"

"ఏమో, ఎవరికి తెలుసు."

ఆమాటా ఈమాటా మాట్లాడుతూ మథురబాబు రాజమోహనుని భార్య నడవడి ఎలాంటిదో తెలుసుకోవాలని ప్రయత్నించాడు; అంతేగాక ఆమెనుద్దేశించి అశ్లీలమైన సైగ కూడా చేశాడు. అందుకు మాధవుడు కోపగించుకుంటూ "ఒక పెద్దమనిషి భార్య బజారున వెళుతూఉంటే ఆమెనుగురించి ఇవన్నీ తెలుసుకోవలసిన అవసరం ఏమిటి?" అన్నాడు.

"చెప్పనే చెప్పారు, రెండు ఇంగ్లీషు ముక్కలు చదివి కుర్రాళ్ళందరూ ధర్మావతారులై పోతున్నారు. తమ్ముడూ, మరదలు విషయం మాట్లాడకపోతే మరెవరి విషయం మాట్లాడతామో చెప్పు. అమ్మమ్మ యవ్వనాన్ని గురించి మాట్లాడమంటావా? ఛా! ముందు నీ చూపులు మరల్చుకో, లేకపోతే లోకులు కాకులవలె వెంటబడతారు. ఆహా, రాజమోహన గోవర్ధనుడు ఇలాంటి కమలములోని మకరందమును గ్రోలుతున్నాడా?"

"వివాహాన్ని లాటరీఅని చెప్పవచ్చు" అని అన్నాడు మాధవుడు.

తరువాత ఇద్దరూ చెరొకవైపుకూ వెళ్ళిపోయారు.

## 3

కనకమయి తన స్నేహితురాలితో కలసి ఇంటివైపు బయలుదేరింది. కనకమయి వెంటఉన్న యువతి సహజము గానే సిగ్గుపడు స్వభావము గలది. దారిలో మధురబాబు మాధవుడు తననుచూచారని ఆలోచించి ఆమె మరింత సిగ్గు పడింది. కొద్దిదూరం మెదలకుండా నడచిన తరువాత "దీదీ, వెధవ గాలివిసురు వచ్చి చాలా హైరానా పర్చింది" అని అన్నది యువతి.

కనకమయి నవ్వుతూ "ఎందుకని, నీ మరదిగారు నీ ముఖం ఎప్పుడూ చూడలేదా ?" అని అడిగింది.

"వారి సంగతికాదు; వారితోపాటు మరొకరు కూడా ఉన్నారుగదా !"

"అయ్యో, వారు మధురబాబుగారే !"

"మా మరదిగారి పినతండ్రి కుమారులా ?"

"అవునవును, వారే,"

"ఎంత సిగ్గుచేటు చూడుదీదీ, ఈ సంగతి ఎవరి తోనూ చెప్పకు."

"భలే, నాకు ఇదేపని అనుకున్నావా ఏమిటి ! ఒక రితో చెప్పవలసిన అవసరం నాకేమిటి ?"

కనకమయి నవ్వసాగింది; యువతికి చాలా కోపం

వచ్చింది—"ఇలా అని తెలిస్తే నీ వెంట వచ్చేదానినే కాదు" అని అంది యువతి. కనకమయి మరింత నవ్వసాగింది.

ఇంతలో యిద్దరూ యువతి యింటి సమీపానికి చేరుకున్నారు. ద్వారంవైపు చూడగానే యువతి భయంతో కంపించ సాగింది. యువతి భర్త రాజమోహనుడు కళ్ళెర్ర చేసి చూస్తూ ద్వారములో నిలబడి ఉన్నాడు.

"యివాళ ఏదో అనర్థము జరుగునట్లే కన్పిస్తుంది. నన్ను కూడా నీ వెంట రమ్మంటావా ?" అని అడిగింది కనకమయి నెమ్మదిగా.

"వద్దు వద్దు, నువ్వు ఉంటే మంచికి బదులు మరింత అపకారమే జరుగుతుంది. నువ్వు యింటికి వెళ్ళు" అని చెప్పింది యువతి.

కనకమయి ముందుకు సాగిపోయింది. యువతి లోనికి వచ్చేవరకు రాజమోహనుడు ఏమీ మాట్లాడలేదు. యువతి మెదలకుండా వెళ్ళి నీళ్ళబిందెను వంటయింటి అరుగుమీద పెట్టింది. రాజమోహనుడు ఆమె వెనుక వంటఇంటివరకు వచ్చి "ఆగు" అని అన్నాడు. బిందెలోని నీళ్ళను దొడ్లో పారబోశాడు. 'ఆఁ ఆఁ' అంటూ రాజమోహనుని ముసలి మేనత్త అక్కడికివచ్చి అతనిని చీవాట్లు వేసింది.

"ఛీ, నోరుమూసుకో !" అని గద్దించి రాజమోహనుడు కాళీ బిందెను దూరంగా విసరివేశాడు. తరువాత అతడు తన భార్యవైపు తిరిగి ఎంతో నెమ్మదిగా "సరేకాని మహారాణిగారు ఎక్కడకు వెళ్లారు ?" అని ప్రశ్నించాడు.

అతడు ఎంత నెమ్మదిగా అడిగినప్పటికీ ప్రశ్నించిన పద్ధతి హృదయంలో శూలమువలె నాటుతుంది.

యువతి చాలా నెమ్మదిగా "నీళ్ళకోసము వెళ్లాను" అని అన్నది. ఆమె కంఠస్వరము ఎంతో దృఢనుచకంగా ఉంది.

తన భర్త ఆజ్ఞాపించిన చోటనే ఆ యువతి శిల్పి చెక్కిన విగ్రహము వలె కదలకుండా మెదలకుండా నిలబడింది.

రాజమోహనుడు "నీళ్ళు తెచ్చుటకు వెళ్ళావా, ఎవరిని అడిగి వెళ్లావు, మహారాణీ ?" అని వ్యంగ్యంగా ప్రశ్నించాడు.

"ఎవరినీ అడిగి వెళ్ళలేదు."

ఆ జవాబుతో రాజమోహనుడు కోపాన్ని నిగ్రహించుకోలేకపోయాడు. గొంతెత్తి బిగ్గరగా అరుస్తూ "ఎవరినీ అడిగి వెళ్ళలేదు— నేను నీకు లక్షసార్లు వద్దని చెప్పానా లేదా ?" అన్నాడు.

యువతి మొదటివలెనే నెమ్మదిగా "వద్దని చెప్పారు" అని అంది.

"అయితే ఎందుకు వెళ్లావు దుర్మార్గురాలా ?"

యువతి ఎంతో సగర్వంగా "నేను మీ భార్యను – వెళ్ళటంలో తప్పేమీ లేదు గనుక వెళ్లాను" అని జవాబు చెప్పింది. ఆమె ముఖం జేవురించింది – కంఠము బొంగురుపోయింది.

ఆమె ఇంత ధైర్యంగా జవాబు చెప్పటం విని రాజమోహనుడు క్రోధోన్మత్తుడై పిడుగుపడిన చందాన గర్జిస్తూ "నేను నీకు లక్షసార్లు వద్దని చెప్పానా లేదా ?" అని రెట్టించాడు.

ఇలా అంటూనే అతడు పులివలె ముందుకు దూకి శిలా విగ్రహము వలె కదలకుండా నిలబడి ఉన్న ఆ పతివ్రత చేతిని రాక్షసి పట్టుతో గట్టిగా పట్టుకొని ఆమెను కొట్టటానికి రెండో చేతిని పైకెత్తాడు.

ఆ యువతికి ఏమీ అర్థం కాలేదు. దెబ్బను తప్పించుకోటానికి కూడా ఆమె ప్రయత్నించలేదు. భీతి గొన్న లేడివలె ఆమె అతనివైపు చూడసాగింది. మంత్రముతో కట్టివేసిన సర్పమువలె పైకి లేచిన అతనిచెయ్యి అలాగే నిలచిపోయింది. క్షణకాలము మౌనముగా ఉండి రాజమోహనుడు భార్య చేతిని వదిలివేశాడు. కానీ తిరిగి వెంటనే గర్జిస్తూ "నిన్ను నిలువునా చీరేస్తాను, చంపేస్తాను" అని అన్నాడు.

అయినా యువతి ఏమీ మాట్లాడలేదు. ఆమె నేత్రాలు అశ్రుపూరితాలయ్యాయి. అది చూచి రాజమోహనుడు కొంచెం మెత్తబడ్డాడు. చేయి చేసుకోలేదు కానీ కటువచనములతో నొప్పించసాగాడు. అప్పటికీ యువతి ఏమీ మాట్లాడకపోయేసరికి రాజమోహనుడు నెమ్మదిగా శాంతించాడు.

రాజమోహనుడు శాంతించటం చూచి మేనత్తకు ధైర్యం కలిగింది. ఆమె ముందుకు వచ్చి యువతి చేతిని పట్టు

కొని లోనికి తీసుకువెళ్ళింది. వెళుతూ వెళుతూ ఆమె నూచి నూచి రాజమోహనుని మీద రెండు మూడు వాక్యబాణాలు వదలి వెళ్ళటం మరచిపోలేదు. రాజమోహనుని కోపము పూర్తిగా శాంతించిందని నిశ్చయమైన తరువాత ఆమె అతడు మాట్లాడిన కటువచనములకు సమాధానము చెప్పింది. రాజమోహనుడు తన కోపానికి తానే ఏదో గొణుగుకుంటూ మేనత్త అన్న మాటలను విన్పించుకోలేదు. తరువాత మేనత్త లోనికి వెళ్ళి యువతిని ఓదార్చసాగింది; రాజమోహనుడు అక్కడి నుండి బయటకు వెళ్ళి ఎవరికి నష్టము కలిగించాలా అని ఆలోచించసాగాడు.

# 4

బెంగాలులోని అనేక ప్రసిద్ధ జమీందారీ కుటుంబాలు ఏదో ఒక తక్కువ కులమునుంచే ఉత్పత్తిచెందాయనే నిందా ప్రచారము ఉంది కాని అది యదార్థమే.

వంశీవదనఘోష్ తూర్పు బెంగాలులోని ఒక వృద్ధ జమిందారు వద్ద వంటవాడుగా ఉండేవాడు. ఆ జమిందారు పేరు, వంశము రెండూ ఇప్పుడు లేవు. మొదటి వివాహానికి సంతానము లేనందువల్ల జమిందారు వృద్ధాప్యంలో రెండో వివాహము చేసుకున్నాడు. కాని సంతానమును చూచుకొని జీవించే అదృష్టం గానీ, మరణించే అదృష్టం గానీ ముసలి వానికి లేకపోయింది. సంతానము తరువాత అతడి వృద్ధాప్యంలో అన్నిటికంటే అత్యంత ప్రియమైన వస్తువుగా

భావించే దానిని పొందే అదృష్టం కలిగింది — యౌవ్వన ములో ఉన్న అందమైన భార్య లభించింది. ఇద్దరు భార్యలు కీచులాడుకుంటూ ఉన్నందువల్ల సంసార జీవితములో శాంతి లేకుండా పోయిందనేది యదార్థమే. మొదట వచ్చినది తాను గనుక ముందు తనకే అధికారము ఉండాలని పెద్ద భార్య గొంతెత్తి ప్రకటిస్తూ ఉండేది. ఈ విధంగా ఆమె తనహక్కును కాపాడుకుంటూ ఉండేది. దీనితో వృద్ధ జమిందారుకు మరింత స్థిమితం లేకుండా పోయింది. పరిస్థితులు పూర్తిగా విషమించిన సమయంలో ఒక మధ్యవర్తి వచ్చి ఎవరూ ఏమీ అనుకోవల సిన అవసరం కలుగకుండా వ్యవహారాన్ని పరిష్కరించి వేశాడు. పెద్ద భార్య హక్కును యథాతథంగా అంగీకరిస్తూ ఆమెను ఈ లోకం నుంచి సాగనంపారు. వృద్ధుడు అతని పడుచు పెళ్ళాము నిశ్చింతగా ఉండసాగారు. కాని ఈ ఘటన వృద్ధునికి మరొక హెచ్చరికగా కూడా పని చేసింది. తాను కూడా ఇక ఎంతో కాలము జీవించననే అతడు ఆలోచించ సాగాడు. పుత్రుని ముఖము చూడగలననే ఆశ కూడా లేదు. తనకు తెలియని వాళ్ళు, తనతో ఎలాంటి సంబంధము లేని వాళ్ళు ఎవరెవరో తన భోగభాగ్యాల నన్నింటినీ అనుభవిస్తా రని ఆలోచించి వృద్ధ జమిందారుకు విరక్తి కలిగింది. తన భార్య జీవించి ఉన్నంత కాలమైనా ఆస్థి ఆమె చేతుల్లో ఉం టుందనే నమ్మకం లేదు. కానీ చట్ట ప్రకారము ఆమెకు తిండి గుడ్డలకు లోటు లేకుండా మాత్రము జరుగవచ్చును; ఇంతకు మించి అధికంగా ఆమెకు ఏమీ లభించదు. తన అనంతరము తన సమస్త సంపదకు తన భార్యయే అధికారిణి కావాలని

అతడు ఆలోచించసాగాడు. ఈ విషయంలో అతడు తన పడుచు పెళ్లాము సలహా ప్రకారము నడుచుకోసాగాడు. ఈ విషయంలో తన అందమైన భవిష్యత్తును గురించి ఆ నవ జవ్వనికి నిర్దిష్టమైన అభిప్రాయము ఉన్నందువల్ల ఆమె తన భర్తద్వారా తన భవిష్యత్తు మార్గాన్ని నిష్కంటకము చేసుకోసాగింది. భవనములు, పొలములు, తోటలు మొదలగు స్థిరాస్తులను చరాస్తులుగా మార్చుటకువృద్ధుడు ప్రయత్నించాడు. తన జమిందారీ నంతా అతడు సాధ్యమయినంతవరకు డబ్బుగానూ, విలువైన వజ్రాభరణముల రూపంలోనూ మార్చివేయ సాగాడు. డబ్బుగా మార్చటం ప్రారంభించిన తరువాత అతనికి డబ్బు వ్యామోహం పెరిగింది; అతడు మరణించే నాటికి భూములు వగైరా స్థిరాస్తి నామ మాత్రంగా మిగిలింది. అతడు సమకూర్చిన అపార ధన సంపద నవ జవ్వనియగు భార్యకే లభించింది.

ఆ వృద్ధ జమిందారు పడుచు పెళ్ళాము పేరు కరుణామయి. ఆమె తెలివితేటలు అపారము, ఈ విషయంలో మా పాఠకులు సందేహించవలసిన అవసరమేమీ లేదు. ఆమె ఇప్పుడు అపార ధన సంపదకే గాక అత్యంత సౌందర్యానికి కూడా అధికారిణి కావటం వల్ల ఈ రెండు దుర్లభ పదార్థాలను ఏ విధంగా సద్వినియోగం చేసుకోవాలా అని ఆమె తన తెలివితేటల్ని ఉపయోగించి ఆలోచించి ఒక నిశ్చయానికి వచ్చింది. పూర్వము అవతార పురుషుడగు శ్రీరామచంద్రుడు సీతాదేవిని ఎడబాసి దుఃఖితులై తన ప్రియమగు భార్య యందుండే ప్రేమకు నిదర్శనముగా బంగారు సీతను

తయారుచేయించి మనస్సును సమాధానపర్చుకొని గోరారు. అదే విధముగా తనకు తన భర్తయందున్న అనంత ప్రేమకు నిదర్శనముగా అలాంటి పద్ధతినే అవలంబించి తన జీవితాన్ని ఎందుకు సార్థకపర్చుకోగూడదు? అనే కరుణామయి ఆలోచించింది. తన ప్రియమైన భర్త మరణించాడు, శాశ్వతంగా కలిగిన ఈ యెడబాటును ఆమె హృదయం దుఃఖభారముతో కుంగిపోతూ ఉంది; సామాన్యమగు బంగారు విగ్రహముతో ఊరట పొందుటను బదులు రక్తమాంసమయమగు ఒక సజీవ వ్యక్తినే ఆ స్థానములో నిలువుకోవటం మరింత ఉత్తమమైన పద్ధతి గదా అని ఆమె ఆలోచించింది; సృష్టిలో మానవ జన్మయే ఉత్తమమైనదని గదా చెప్తున్నారు, ఒక జడ పదార్థమును ఆరాధించుటకంటే మనిషి ఆధించటమే సృష్టి ధర్మము ను అనుసరించినట్లు కాగలుగుతుంది.

ఈ విధమైన తర్కముతో మనస్సును దృఢపర్చుకొని కరుణామయి మరణించిన తన భర్తయందున్న శ్రద్ధాభక్తుల వల్ల దివ్యపురుషుల పవిత్ర ఆదర్శమును చూచి ప్రేరణపొంది అనతికాలములోనే మరణించిన తన భర్తకు స్మృతి చిహ్నముగా ఒక సజీవ ప్రతినిధిని ఎన్నుకుంది. వృద్ధ జమిందారు గారి వంటవాడగు వంశీవదనుడు అదృష్టవంతుడని తేలింది. ఈ పట్టాభిషేకము అతనికే జరిగింది. మోసకాడగు వంశీవదనుడు కూడా ఇలాంటి అవకాశమూ, అదృష్టమూ కలసి వచ్చినప్పుడు జారవిడుచుకునే వ్యక్తి కాదు. యజమాని భార్య దేహ సామ్రాజ్యానికి అధిపతి అయిన తరువాత ఆమెకు సంబంధించిన అపార సంపదకు అధికారి కాకపోవటం అతనికి

నచ్చలేదు. ఆమె యవ్వన సామ్రాజ్యాన్ని, అపార సంపదనూ రెండింటినీ అతడు తన హస్తగతం చేసుకున్నాడు. అందుకు అతడు పెద్దగా శ్రమపడవలసిన అవసరం గానీ తీవ్ర ప్రయత్నం చేయవలసిన అవసరం గానీ కలుగలేదు. కొద్ది కాలములోనే ఆ వంటవాడు సర్వాధికారియై కూర్చున్నాడు.

ఇటు అదే సమయంలో కరుణామయికి నిత్యము లోజ్వరముఉంటూఉండేది ఆ జ్వరము అజ్ఞాత కారణంవల్లనో లేక స్పష్టమైన కారణం వల్లనో అకస్మాత్తుగా హెచ్చిపోయినది. క్రమంగా అది విషమరూపం ధరించింది. నవజవ్వనియగు ఆ వితంతువు మనసులోని కోర్కెలేవీ తీరకముందే అకస్మాత్తుగా తనువు చాలించింది. ఇది జరిగిన తరువాత వృద్ధ జమీందారు దూరపు బంధువులు ఆస్తి పొందవచ్చుననే ఆశతో ఈగలు ముసిరినట్లు అక్కడికి చేరారు. పెద్దగా ఆదాయము రాని ఒకటి రెండు గ్రామాలు తప్ప వారికి మిగిలినదేమీ కన్పించలేదు చరాస్తి కూడా కొద్దిగా డబ్బు,కొంత సామాగ్రి మిగిలితే జమిందారుగారి నౌకర్లకు ఇచ్చివేసినట్లు తెలిసిబంధుజనులు వచ్చినదారినే తిరిగి వెళ్లారు.

వంశీవదనుడు విలువైన వజ్రాభరణములు, అపారధనము తీసుకొని తమ పూర్వీకుల నివాసమగు రాధాగంజ్ గ్రామానికి చేరుకున్నాడు. అతడు చాలా తెలివైనవాడు కావటం వల్ల తానొక గొప్ప ధనికుడననే విషయం ఎవరికీ తెలియనివ్వలేదు. ఒడుదుడుకులు లేకుండా సుఖ జీవితానికి కావలసినంతవరకు మాత్రమే అతడు ఖర్చుచేసేవాడు,అంతకు మించి అతడు ఎన్నడూ పైసా కూడా ఖర్చు చేయలేదు.

అతడు చనిపోయిన తరువాత అతని ముగ్గురు కుమారులు తండ్రి సంపాదించిన ఆ ధన సంపదనంతా పంచుకున్నారు. జమిందారుగారు చనిపోయి చాలాకాలం గడచిపోయింది. గనుక దావాలు గానీ ఇతర చిక్కులు గానీ ఎదురవుతాయనే భయం కూడా తీరిపోయింది. తండ్రివలె పొదుపుగా సామాన్య జీవితాన్ని గడపవలసిన అవసరం లేదని ఆలోచించారు కుమారులు. భూములు కొనసాగారు, భవనాలు కట్టించారు. తమ ఐశ్వర్యానికి తగినట్లు ఆడంబరంగా జీవించసాగారు.

పెద్దవాడగు రమాకాంతుడు నియమ బద్ధముగ జీవితాన్ని గడుపుతూ ప్రతిదీ లెక్క ప్రకారము చేస్తూ తనభాగానికి వచ్చిన సంపదను అనేకరెట్లు వృద్ధిచేశాడు. వృద్ధాప్యం వచ్చువరకు జీవించి తన సంపదనంతా సమర్థుడగు ఏకైక పుత్రుడు మధురబాబు చేతుల్లో ఉంచి కన్నుమూశాడు. మధురబాబును గురించి పాఠకులకు ఇంతకుముందే తెలుసు. పాశ్చాత్య నాగరికత వ్యామోహంవల్ల మన దేశములోని ప్రాచీన ఆచార వ్యవహారములలో వచ్చిన మార్పు రమాకాంతునికు నచ్చేదికాదు. అందుకనే అతడు తన కుమారునికి ఇంగ్లీషు చదువు చెప్పించటానికి వ్యతిరేకించాడు. ఇంగ్లీషు చదువు అనవసరమేగాక అది దేశానికి హానికరమని కూడా రమాకాంతుని అభిప్రాయము. మధురబాబు చిన్నతనం నుంచీ జమీందారీ వ్యవహారాలలో తండ్రికి సహాయపడుతూ ఉండేవాడు. అందువల్ల అతడు మోసము లోనూ, కుట్రల లోనూ, జూదములోనూ ప్రజలను శాసించటంలోనూ అణచటంలోనూ బాగా ఆరితేరాడు.

వంశీవదనుని రెండో కుమారుడు రామకన్నాయి అదృష్టము అందుకు భిన్నంగా ఉంది. స్వభావ సిద్ధముగానే అతడు సోమరి, బాగా ఖర్చుమనిషి—అతడు చేసే ఖర్చులన్నీ వ్యర్థమైనవే. అందువల్ల కొద్దికాలంలోనే ఆ స్త్రీకి సంబంధించిన రకరకాల చిక్కులు ఏర్పడ్డాయి. అతని భవనము తోటతో సరిసమానమగు సొబగుగలవి ఆ గ్రామములోనే లేవు. కానీ తన సోదరులకు ఉన్నట్లు ఆదాయము వచ్చే స్థిరాస్తి అనేది అతనికి ఏమీ లేదనే చెప్పాలి. ఉన్నదానికి కూడా ఒక ఆలనా పాలనా అనేది లేదు. కొందరు ధూర్తులు కొంతమంది సలహాదారులు అతనిచుట్టూ చేరి అతని విశ్వాసమును పొందటానికి ప్రయత్నించారు. వారి కోర్కె త్వరలోనే నెరవేరింది. రామకన్నాయికి రకరకాల చిక్కు పరిస్థితులు ఎదురయినప్పుడు మరొక వ్యాపారము దేనిలోనైనా పెట్టుబడిపెట్టి ఈ పరిస్థితులను చక్కదిద్దుకోవచ్చునని అతని చుట్టూ చేరినవారు నచ్చచెప్పారు. ఏదో పనికిరాలిన వ్యాపారాన్ని గురించి కల్పించి చెప్పారు. బాగా డబ్బు సంపాదించి ఈ పరిస్థితినుంచి బయట పడవచ్చుననే ఆశతో రామకన్నాయి వారు చెప్పినవాటికి అంగీకరించాడు. తరువాత అతడు పూర్తిగా వారి మాటలకు లోబడిపోయి గ్రామము నుండి కలకత్తాకు చేరి అక్కడే నివసించ సాగాడు. అతని సలహాదారులు వ్యాపారము పేరుతో రామకన్నాయి వద్ద నుంచి క్రమంగా డబ్బునంతా కాజేశారు—ఉన్నది కరిగిపోవటమే గాక బాకీలు పెరిగాయి. చివరికిఅతడు ఇంతకాలము

నిర్లక్ష్యము చేస్తూ వచ్చిన స్థిరాస్తికూడా బాకీదారులు కోర్టుద్వారా ఆక్రమించుకున్నారు.

పట్టణ నివాసమువల్ల రామకన్హాయికి ఒక మేలు మాత్రం జరిగింది. పట్టణ ప్రజలను చూచి అతడుకూడా కలకత్తాలో ఉన్నంతవరకు కుమారులకు చదువుచెప్పించాడు. ప్రతి హిందూ తండ్రికి ఒక పెద్ద కోర్కెఉంటుంది. అతడు ఆ కోర్కెను కూడా తీర్చుకున్నాడు–అత్యంత సౌందర్యవతి యగు బాలికను చూచి కుమారుని వివాహం చేశాడు.

కలకత్తా సమీప గ్రామంలో ఒక పేద కాయస్థుడు భగవంతుడు తనకు రూపగుణ లావణ్యములుగల యిద్దరు కుమార్తెల నిచ్చాడనీ, వాళ్ళిద్దరూ వినయగుణ సంపన్నలనీ వాళ్ళిద్దరూ భగవంతుడు తనకు ప్రసాదించిన అమూల్య సంపద అని అతడు గొప్పలు చెప్పుకుంటూ ఉండేవాడు. అదృష్టదేవత సహజంగా యిలాంటి కోమల హృదయము, అతి సున్నితమైన మనస్సుల అత్యంత సౌందర్య వతులగు హిందూ బాలికలకు చెడ్డభర్తలనే సమకూరుస్తూ ఉంటుంది. ఆ కాయస్థుని పెద్దకుమార్తె మాతంగిని చాలా సహృదయురాలు అత్యంత లావణ్యవతి, ఈ అదృష్టదేవత అనాగరికుడగు రాజమోహానునికి ఆమెను భార్యగా చేసింది. వివాహము జరిగిన తరువాత కూడా మాతంగిని తండ్రికి తనకుమార్తెకు తగిన భర్త లభించాడనే విశ్వాసం ఉండేది. వివాహం జరిగినప్పుడు రాజమోహానుడు పూర్ణ యవ్వనంలో ఉన్నాడు. అతనికి ఒకబాలిక భార్యగా లభించింది. వయస్సు తేడాకూడా వారి వివాహానికి అడ్డు

రాలేదు. మాతంగిని తండ్రి ఈ విషయమే ఆలోచించలేదు. రాజమోహానుడు చూడటానికి అంత అందమైన వాడేమీ కాదు; ఆ కాలములో వరుడు మరీ బాలుడై ఉంటేనే అతని అందచందాలను గురించి ఆలోచించేవారు. యవ్వనంలో ఉన్న వరుని విషయంలో యిలాంటి పట్టింపులేమీ ఉండేవి కావు. వివాహమైన తరువాత కుమార్తె తనకు దూరంగా వెళ్ళదని తల్లిదండ్రులు ఆశించటం కూడా ఈ వివాహం జరగటానికి ఒకకారణమే పరిచయం ఉన్నవారు రాజమోహానుని బలిష్ఠ శరీరమును, అతనిలో ఉన్న అపరిమితమగు బలమును చూచి ఈర్ష్య పడేవారు; ఈ విషయంలో అందరూ అతనిని ప్రసంశా దృష్టితోనే చూచేవారు. అతడు కష్టపడి పనిచేసే శ్రమజీవి, ఎలాంటి పనిలోనైనా సరే ముందు వెనక లాడటంగానీ వెనకడుగు వేయటంగానీ చేసే స్వభావం కాదతనిది. తండ్రి సంపాదించి యిచ్చినదేమీ లేక పోయినప్పటికీ, చదివించ నప్పటికి కూడా శ్రమజీవికావటం వల్లనే జీవితంలో అతనికి ఏలోటూ లేకుండా జరిగిపోయేది. రాజమోహానునిలో ఉన్న ఈ గుణముచు చూచే మాతంగిని తండ్రి కుమార్తెకు ఎలాంటి లోటూ జరుగదని ఆశించాడు. యివన్నీ ఆలోచించే అతడు కుమార్తెను రాజమోహానునికి యిచ్చి వివాహం చేశాడు. పెద్దకుమార్తెకంటె రెండో కుమార్తె హేమమాలిని అదృష్టవంతురాలు, ఆమెను మాధవున కిచ్చి వివాహం చేశారు.

మాధవుని తండ్రి రామకస్వామి మాధవుని కాలేజీ

చదువు పూర్తికాకముందే చనిపోయాడు. తండ్రి మరణంతో మాధవుని చేతిలో చిల్లిగవ్వ కూడా లేకుండా పోయేదేకానీ అకస్మాత్తుగా ఎవరికీ తెలియని సంఘటన ఒకటి జరిగి అతనిని ఆ దుస్థితినుంచి కాపాడింది.

వంశీవదనుని మూడవ కుమారుడు రామగోపాలుడు పెద్దనాన్నగారివలె గొప్ప ధనవంతుడూ కాలేదు, రెండో అన్నగారివలె దరిద్రుడూ కాలేదు. అతడు సంతానము లేకుండానే చిన్న వయస్సులోనే చనిపోయాడు. తనభార్య జీవించి ఉన్నంతవరకు ఆమెకు ఏలోపమూ లేకుండా చూచే షరతుమీద తన ఆస్తి నంతటినీ అతడు మాధవుని పేర విల్లు వ్రాశాడు.

తన చదువు పూర్తయే వరకు అతడు కలకత్తాలోనే ఉన్నాడు. అతడులేని కాలంలోనూ, మైనారిటీ తీరేవరకు గుమాస్తాలే జమీందారీ వ్యవహారాలన్నీ చూచేవారు. సంవత్సరాంతాన అతడు పట్టణము వదలి తన అందమైన భార్యవెంట గ్రామానికి వెళ్ళే ప్రయాణ సన్నాహంలో ఉన్నాడు. వెళ్ళటానికి ముందుగా అతడు తన భార్యను అత్తమామలకు చూపించి వచ్చుటకు పుట్టింటికి వెంట బెట్టుకొని వెళ్ళాడు. మాతంగినికి చెల్లెలు హేమాంగిని అంటే చాల ప్రేమ. అదృష్టమనండి లేదా మరొక కారణమేదైనా అనండి. ఆ సమయంలో రాజమోహనుని భార్య మాతంగిని కూడా పుట్టింటిలోనే ఉంది.

ఎక్కువరోజులు అత్తవారింటి వద్ద ఉండాలని మాధవునికి లేదు. తల్లిదండ్రులను వదలిచాలా దూర దేశము వెళ్లి

పోతున్నందుకు, మళ్ళీ ఎంతకాలానికి కలుసుకుంటామో అనే దిగులుతో హేమాంగిని ఏడుస్తూ ఉండేది. తాను చాలా దూరము వెళ్ళిపోతున్నాననీ, ప్రేమతో తనను పెంచి పెద్ద చేసిన తల్లి దండ్రులను ఇక చూడలేననీ ఆమె ఆలోచించ సాగింది. తల్లిదండ్రులు ఎప్పుడైనా ఆమెను చూచుటకు వస్తారా? తాను వస్తూ ఉంటానని తండ్రి చెప్పాడు. మరి తల్లి? అక్క? తల్లి అక్క ఏమీ జవాబు చెప్పలేదు—వాళ్ళు కూడా మెదలకుండా ఏడుస్తూ ఆశీర్వదించారు.

మాతంగిని ఒకనాడు చెల్లెలి చేతిని పట్టుకొని ఏకాం తములోనికి తీసుకువెళ్ళి "హేమా, నేనొక విషయం చెపు తాను, చేస్తావా?" అని అడిగింది.

హేమాంగిని ఏమీ జవాబు చెప్పకుండా విప్పారిన తన విశాల నేత్రాలతో అక్కవైపు చూచింది.

"హేమా, రేపు మనం విడిపోతాము—కదూ?" అని తిరిగి మాతంగిని అంది.

హేమాంగినికి దుఃఖం ఆగలేదు, జలజల కన్నీరు కారసాగింది. మాతంగిని అతికష్టంతో ఆమెను ఓదార్చి ఇలా అంది—"ఏడ్వకు చెల్లీ, ఏడ్వకు, భగవంతుడు నీకు మేలు చేస్తాడు. నీకు మాధవుని వంటి చదువుకున్న గుణ వంతుడగు భర్త లభించాడు. వారు నీకే కష్టమూ కలుగ నివ్వరు."

ఈమాట అంటూ మాతంగిని కూడా ఏడ్వసాగింది. ఆమె కన్నీరు చెక్కిళ్ళ మీదుగా జారి హేమాంగిని చేతుల మీద పడుతున్నాయి.

హేమాంగిని అక్క కన్నీరు తుడుస్తూ "నాతో ఏదో చెపుతానన్నావు, ఏమిటది దీదీ ?" అని అడిగింది.

"హేమా, నేను చాలా పేద దానను, ఎంత పేద దాననైనప్పటికీ నా కోసమే అయితే నీతో ఏమీ చెప్పే దానిని కాదు. కానీ నా భర్త—వారు ఎలాంటి వారైనా వారిని భగవంతుడు అలా సృష్టించాడు. వారి స్వభావము వేరు - అయినా నాకు సర్వమూ వారే. వారిని గురించే నేను ఆలోచించవలసి వస్తుంది. ప్రస్తుతం వారు ఏమీ పని లేనందువల్ల ఖాళీగా ఉన్నారు; ఆర్థిక పరిస్థితి చూడబోతే చాలా హీనంగాఉంది. మాధవునితో చెప్పమని వారొక విషయం చెప్పారు. నువ్వు నీ భర్తతో చెప్పగలవా ?"

"ఎందుకు చెప్పలేను దీదీ. ఏమిచెప్పాలో చెప్పు."

"కుటుంబాన్ని పోషించుకోదగిన ఉద్యోగమేదైనా మీ బావగారికి ఇప్పించమని చెప్పు."

"తప్పకుండా చెపుతాను దీదీ."

హేమాంగిని వాగ్దానం చేసింది. తరువాత అక్క చెల్లెండ్రిద్దరూ ఏవేవో విషయాలు మాట్లాడుకో సాగారు. అక్కయ్యందుండే ప్రేమానురాగాల వల్ల హేమాంగిని ఒక బాధ్యతను స్వీకరించింది. దానిని ఏవిధంగా నెరవేర్చాలా

అనే ఆమె ఆలోచించసాగింది. కానీ ఆమెకు ఏమీ ఉపాయం తోచటంలేదు. వయస్సులో ఆమె చాలా చిన్నది. అనుభవమనేది శూన్యము. మనదేశములోని శాలికలు ఈ వయస్సులో భర్త ఎదుటకు వెళ్ళి మాట్లాడలేరు — ఇలాంటి విషయాలలో అసలే మాట్లాడలేరు. అయినప్పటికీ ఆమె మనస్సును దృఢపర్చుకొని తన అక్కగారితో జరిగిన సంభాషణను గురించి భర్తతో చెప్పింది. తప్పక ప్రయత్నం చేస్తానని మాధవుడు మాట ఇచ్చాడు.

గ్రామీణులలో ఉండే స్వభావ సిద్ధమగు సంకోచ భావం వలన రాజమోహనుడు తన ఉద్యోగమును గురించి షడ్డకునితో ముఖాముఖి మాట్లాడ లేకపోయాడు. సాధారణంగా పేద బంధువులు అనుసరించే మార్గమునే అతను అనుసరించాడు. స్త్రీ ప్రతినిధిని ఆశ్రయించటమే మంచిదని ఆలోచించాడు. కాని ఆ విషయాన్ని గురించి తాను రాజమోహనునితోనే మాట్లాడాలని మాధవుడు నిశ్చయించుకున్నాడు. అతడు మర్నాటి ఉదయమే రాజమోహనునితో దీనిని గురించి సంభాషణ ప్రారంభించాడు. సాధ్యమయినంత వరకు ఎంతో నమ్రతతో అతడు రాజమోహనుని ప్రస్తుతఆర్థికస్థితిని గురించి,పని పాటల గురించి అడిగాడు. రాజమోహనుడు పనికిమాలిన గర్వంవల్లకానివ్వండి,సిగ్గువల్లకానివ్వండి తన ఇబ్బందుల గురించి ఏమీ అంగీకరించకుండా ప్రస్తుతము తాను ఖాళీగా ఉన్నానని మాత్రమే చెప్పాడు. తన జమిందారీ వ్యవహారాలు కొన్ని చూడటానికి కష్టపడి పనిచేసే నమ్మకమైన మనిషి ఒకరు కావాలని మాధవుడు అతనితో

చెప్పాడు. రాజమోహనుడు రాధాగంజ్‌కు రావటానికి అంగీకరించేమెడల జమీందారీ వ్యవహారాలలో తనకు సహాయంగా ఉండవలసిందని మాధవుడు కోరాడు.

"అది కుదరదు తమ్ముడూ! వీళ్ళను (భార్యను) ఎక్కడ ఉంచిరావాలి ?" అని అన్నాడు రాజమోహనుడు.

"అవన్నీ ఆలోచించకుండానే మిమ్మల్ని రావలసిందిగా ఎలా కోరతాను ! రాధాగంజ్‌లోనే మీకు ప్రత్యేకంగా ఒక యింటిని ఇస్తాను."

రాజమోహనుడు షడ్డకునివైపు తీవ్రంగానూ, కోపంగానూ చూచి "ఛీ, రాధాగంజ్‌లో ఉంటానా నేను ! అసంభవం. అక్కడ ఉండటం కంటె జైలులో కృశించి చావటం మంచిది" అని అన్నాడు.

ఈమాట అని అతడు కోపంగా ఏదో గొణుక్కుంటూ అక్కడినుండి వెళ్ళిపోయాడు.

రాజమోహనుని అకారణ కోపాన్ని చూచి మాధవునికి ఆశ్చర్యం కలిగింది. కానీ అతడేమీ మాట్లాడలేదు రాజమోహనునికి కూడా మరొక మార్గమేదీ లేదు. అతని భార్యను కూడా ఏదోఒక అజ్ఞాత కారణంఉంది – అందువల్ల ఆలస్యమేమీ లేకుండా నివాసము మార్చటం మరింత అవసరమయింది. కానీ రాధాగంజ్ వెళ్ళవలసి వస్తుందని మాత్రం రాజమోహనుడు ఆలోచించలేదు. తనవేదతనంపేరు చెప్పి అడిగించినమాట నిజమే. కానీ మాధవుకు రాధాగంజ్

విషయం చెప్పినప్పుడు రాజమోహనుడు చాలా కోపం వచ్చి నట్లు వ్యవహరించాడు. ఉత్తరీయము వేసుకొని అతడు ఇంటిలోనుంచి బయటకు వెళ్ళిపోయాడు. మధ్యాహ్నపు మండుటెండలో అతడు మైదాన మార్గాన గబగబ ముందుకు సాగిపోతున్నాడు. అతని నడక పరుగెత్తుతున్నట్లుగా ఉంది. అతడు ఎక్కడా ఆగలేదు, ఎవరితోనూ మాట్లాడలేదు. గంట గడిచిపోయింది, రాజమోహనుడు తిరిగిరాలేదు.

చివరికి అతడు ఇంటికి తిరిగి వచ్చినప్పుడు చాలా గంభీరంగా కన్పించాడు. ముఖంలో కోపచిహ్నాలు కన్పిస్తున్నాయి. అతడు సపరివారంగా రాధాగంజ్‌కు వెళ్ళటానికే నిశ్చయించుకున్నాడు. కానీ అతడు తన నిశ్చయాన్ని పెద్దమనిషి లక్షణంగా మాధవునితో చెప్పలేదు. అతడుకూడా బయలు దేరటానికి వీలుగా మాధవుడు మరి కొన్ని రోజులు అక్కడే ఆగిపోయాడు. ప్రయాణ సన్నాహాలు పూర్తయిన తరువాత అందరూ పట్టణము వదలి కొద్ది రోజులలోనే రాధాగంజ్‌కు చేరుకున్నారు.

రాజమోహనుని ప్రవర్తన కర్కశంగా ఉన్నప్పటికీ, అతడు ఎంత అమర్యాదగా వ్యవహరించినా మాధవుడు మాత్రము అతనిని గౌరవంగానే చూడసాగాడు. మంచీ మర్యాదా తెలియని షడ్డకుని అసభ్యత, దుష్టస్వభావము, కృతఘ్నతా భావము తెలిసికూడా మాతంగినికి సంప్రాప్తించిన అకారణ దురదృష్టానికి సానుభూతి చూపించుటకు ఒక గ్రామ వ్యవహారమును మాత్రమే రాజమోహనునికి అప్ప

గించి మంచి జీతాన్ని ఇచ్చే ఏర్పాటు చేశాడు. రాజమోహానునికి ప్రత్యేకంగా ఒక ఇల్లుకట్టించి ఇచ్చాడు. గ్రంథ ప్రారంభములోనే పాఠకులు ఇంటినిగురించి తెలుసుకున్నారు. కూలీల ద్వారా వ్యవసాయము చేయించుటకు మాధవుడు రాజమోహానునికి కొంత భూమిని కూడా ఇచ్చాడు. రాజమోహానుడు వ్యవసాయ పనులలోనే సమయాన్ని గడప సాగాడు జమిందారీ వ్యవహారాలేవీ అతనికి అర్థమయ్యేవే కావు.

ఇంత చేసి కూడా మాధవుడు రాజమోహానుని మనసును జయించలేకపోయాడు. రాధాగంజ్ కి వచ్చినప్పటి నుండీ రాజమోహానుడు హృదయ హీనుడిగా వ్యవహరిస్తూ మాధవునికి బాధ కలిగించ సాగాడు. హృదయ హీనుడు గానే కాదు అతడు చాలా నిర్దయగా వ్యవహరించేవాడు. కనుక వాళ్ళిద్దరిమధ్య ఇచ్చి పుచ్చుకునే సామాన్య సంబంధాలు మాత్రమే ఉండేవి. రాజమోహానుని ఈ విచిత్ర ప్రవర్తనను ఏమీ గమనించనట్లే మాధవుడు పైకి వ్యవహరించేవాడు, గమనించి నప్పటికీ అతడు రాజమోహానునిపట్ల కఠినంగా వ్యవహరించక దయచూపేవాడు. ఇరువైపుల ఇలాంటి మనోభావాలు ఉన్న ఫలితంగా పరస్పరము చాలా ప్రేమగా ఉండే అక్క చెల్లెండ్రిద్దరూ కలుసుకోవటం తగ్గిపోయింది.

# 4

మాధవుడు తన పెదతండ్రి కుమారుని వద్ద శెలవు తీసుకొని తోటలోనుంచి లోనికి వచ్చేసరికి ఒక మనిషి తన

కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు. అతడు మాధవుని చేతికి ఒక ఉత్తరాన్ని ఇచ్చాడు. దానిమీద 'అర్జంటు' అని వ్రాసి ఉంది. మాధవుడు గబగబ ఉత్తరమును చించి ఆదురాగా చదవసాగాడు. జిల్లా ముఖ్యపట్టణము నుండి అతని వకీలు వ్రాసిన ఉత్తరము అది. ఉత్తరమును చదువుతూ మాధవుడు మధ్య మధ్య తన మనసులో అనుకున్న విషయాలను కూడా క్రింద ఇస్తున్నాము. మాధవుడు ఉత్తరము చదవసాగాడు —

"మహాశయా !

ఈ సేవకుడు ముఖ్యపట్టణములో ఉండి దొరవారి దావాను గురించి చాలా శ్రమ చేయుచున్నాడు, అన్ని దావాలలోను మనకే జయము లభిస్తుందని ఆశిస్తున్నాడు."

ఇంతవరకు చదివి మాధవుడు ఈ విధంగా ఆలోచించసాగాడు—"అన్ని దావాలలోను ... నువ్వు అలాగే అంటావు మిష్టర్ వకీలు; నా దావాలలో అబద్ధమైన వేవీ లేవు. కాని కోర్టులో ఎప్పుడూ న్యాయమే జరుగుతుందా ? కనుక నువ్వు చెప్పిన దానిని కొంత ఆలోచించి గాని అంగీకరించలేను— కాని ఈ వకీలు పనికి వచ్చేవాడే. కేసును బాగా వాదించగల సమర్థుడే. అసలు ఈ దావాలు తగాదాలు లేకుండా ఉంటే హాయిగా ఉంటుంది ! కాని ఇరుగు పొరుగువాళ్ళు దావాలకు దిగకుండా వూరుకుంటారా ? సరే తరువాత ఏమి వ్రాశాడో చూద్దాం—"

"దొరవారి పినతండ్రి భార్య వకీలు ద్వారా జిల్లా జడ్జి కోర్టులో ఒక దావా దాఖలు చేశారని తెలియజేయు

టను చాలా విచారిస్తున్నాను. ఈ విషయాన్ని తమ దృష్టికి తెచ్చుటకు ఎంతో బాధపడుతున్నాను. తన భర్త వ్రాసిన విల్లు ఫోర్జరీ అనిన్నీ, తన జమిందారీని, విల్లును తనకు అప్ప గించవలసిందిగా ఆమెగారు కోరియున్నారు."

పిన్నిగారు!——వ్యాకుల చిత్తుడగు మాధవుని చేతిలో నుండి ఉత్తరము జారిపోయింది. పిన్నిగారూ! పరమేశ్వరా! ఏమిటిది! నా సంపదనంతా తన హస్తగతం చేసుకోవాలను కుంటున్నదా! నేను ఫోర్జరీ చేశానా! దుర్మార్గురాలిని తన్ని తరిమేస్తాను.

మాధవుడు కొద్దిక్షణాలు అలాగే నిలబడి ఏదో ఆలోచించాడు——మనిషి కోపంతో వూగిపోతున్నాడు. చివ రికి నిగ్రహం వహించి అతడు తిరిగి ఉత్తరము అందుకొని చదవసాగాడు——

"ఈ విధంగా చేయవలసిందిగా ఆమెకు సలహా యెవరు చెప్పారో నేను స్పష్టముగా తెలుసుకోలేకపోయాను. కానీ దీనిని గురించి నేను చాలా ప్రయత్నం చేశాను. మద్దతు ఇచ్చేవారు లేకుండా ఇలాంటి పని జరిగేది కాదు. ఎవరో వెనుకఉండి ఇదంతా నడిపిస్తున్నారు. ఒకరి పేరు కూడా విన్నాను. దీనిలో అనేకమంది ప్రముఖుల ప్రోత్సాహం ఉంది."

మాధవుడు ఆలోచించాడు——'మద్దతు నిచ్చేవారా? ఎవరై ఉంటారు?' అతడు వూహించటానికి ప్రయత్నిం చాడు. ముందు పొరుగున ఉన్న ఒక జమిందారును అను మానించాడు. తరువాత మరొకర్ని గురించి ఆలోచించాడు.

కానీ వారిలో ఎవరూ ఈ పని చేసి ఉంటారని నమ్మలేక పోయాడు. మాధవుడు మళ్ళీ ఉత్తరము చదవసాగాడు—

"కానీ తమరు భయపడవలసిన అవసరంగానీ గాబరా పడవలసిన అవసరంగానీ ఏమీ లేదు. విల్లు ఫోర్జరీ కాదనే విషయము నాకు తెలుసు. ధర్మమే జయిస్తుందనటంలో కూడా సందేహమేమీ లేదు. అయినప్పటికీ మన జాగ్రత్తలో మనం ఉండక తప్పదు. జిల్లాకోర్టు లాయరు ఒకరికి వకాల్తా ఇవ్వవలసి ఉంటుంది. అవసరమైనచో ఒక హైకోర్టు లాయరును కూడా నియమిద్దాము ఇరుపక్షముల విచారణ ప్రారంభమయినప్పుడు ఒక సుప్రీంకోర్టు బారిష్టరును నియమించటం మంచిది. నా శక్తి వంచన లేకుండా నేను కృషి చేయగలనని ఇందుమూలముగా విన్నవించుకుంటున్నాను. ప్రాణములను కూడా లెక్కచేయకుండా నే నీ కేసును వాదించగలను. శ్రీవారి అనుమతి నిమిత్తము ఎదురుచూచుచున్నాను.

తమ—

విధేయుడు

శ్రీ గోకుల చంద్రదాసు.

ఒక సూచన:—ఖర్చుల నిమిత్తము ప్రస్తుతము ఒక వెయ్యిరూపాయలు పంపగలరు."

ఉత్తరము చదవగానే మాధవుడు మొదట తన పిన్నివద్దకు వెళ్ళి దీనిని గురించి అడగాలని అనుకున్నాడు. మాధవుడు వెంటనే అంతఃపురంలోనికి వెళ్లాడు. కానీ అక్కడ స్త్రీలు పిల్లల గోలమధ్య అతని మాటను యెవరూ

విన్పించుకోనేలేదు. పొట్టిగా లావుగా ఉన్న ఒక నల్లని దాసి ఏవేవో వస్తువులు లేవంటూ బిగ్గరగా అరచి చెప్తూ ఉంది. ఆమె ఎవరి నుద్దేశించి ఆ విధంగా వాగుతుందో మాధవుడు అర్థం చేసుకోలేక పోయాడు. మరొక దాసి బాగా పొడవుగాను పొడవుకు తగినంత లావుగానూ ఉంది. భగవంతుడు ఇచ్చిన ఆ భారీ శరీరాన్ని సాధ్యమైనంత వరకు సగర్వంగా ప్రదర్శిస్తూ సంతృప్తి చెందుతుంది. చీపురుకట్టను చేతితో పట్టుకొని అక్కడక్కడ చెదిరి పడిఉన్న కూరగాయల తొక్కలను ఊడుస్తూ మొదటి దాసి వలెనే గొంతెత్తి అరుస్తూ ఉంది. కూరగాయలు తరిగిన మనిషి వ్యతిరేకంగా అర్థనగ్నముగా ఉన్న ఈ స్త్రీ చీపురు కట్టను ఆడిస్తూ తిట్లవర్షం కురిపిస్తూ ఉంది.

మూడవ దాసి దొడ్లో గుట్టగా వేసిన యెంగిలి పాత్రల వద్దకూర్చొని శుభ్రము చేస్తూ ఉంది. వంటచేసిన స్త్రీ తనను కష్టపెట్టటానికే ఇత్తడి పాత్రలను ఇంత నల్లగా మాడ్చిందని ఆమె ఆరోపణ; పాత్రల మీద చేతులు రెండూ యెంత గబ గబ ఆడుతున్నాయో వంటచేసిన స్త్రీకి వ్యతిరేకంగా నోరుకూడా అంత తీవ్ర పద జాలంతో బడ బడ వాగుతూనే ఉంది. వంటచేసే స్త్రీ అప్పుడు అక్కడే ఉంది. కానీ కొద్ది దూరంలో రాత్రి వంటకు యెంత నెయ్యి కావాలి అనే దానిని గురించి కొంచెం తీవ్రంగానే వాదిస్తూ ఉంది. అందువల్ల పాత్రలు శుభ్రము చేసే దాసి తన ఇహపరలోక జీవితాన్ని గురించి తిట్టే భయంకరమైన తిట్లను విన్పించుకోలేదు వంట మనిషి కపటం లేకుండా కావలసిన దానికంటె

రెట్టింపు నెయ్యి అడుగుతూ ఉంది. తనకు కావలసిన సేతిని దీనిలోనుంచే మిగుల్చుకోవాలి గదా? ఆమె ఆరోగ్యానికి మాత్రం నెయ్యి అవసరం కాదా?

మరొకమూల ఒకదాసి చేపలను శుభ్రము చేస్తూ ఉంది. ధర్మ ప్రవృత్తిగల వంటమనిషికి చేపల్ని ఆవిధంగా పరపరకోయటం బాధకలిగిస్తూఉంది. మరి కొందరు దాసీలు దీపాలు వెలిగించి భవనంలోని గదులలో అలంకరిస్తున్నారు. నగ్న శరీరులగు ఇద్దరు పిల్లలు తమ వీరత్వాన్ని నిరూపించు కొనుటకు ఒకరిజుట్టు ఒకరు పట్టుకొని కుస్తీలు పడుతున్నారు. ఈ చెత్త చెదరుమధ్య ఆ పిల్లలు అసహ్యంగా కన్పించటం లేదు మరొకమూల కొంతమంది బాలికలు 'ఆచ్ థూచ్' అంటూ ఏవో ఆటలు ఆడుతున్నారు.

మాధవుడు క్షణకాలం నిరాశచెంది అలాగే నిలబడి పోయాడు. ఈ ప్రచండ కోలాహలం మధ్య అతని మాట ఎవరికి విన్పిస్తుంది?

చివరికి ఆ స్థితిని భరించలేక అతడు సాధ్యమయినంత బిగ్గరగా "మీరందరూ కాస్సేపు నోరుమూసుకుంటారా లేదా?" అని అరిచాడు.

ఆ నాలుగు మాటలు ఇంద్రజాలమువలె పనిచేశాయి. అవిలేవు ఇవిలేవు అని బిగ్గరగా కేకలు పెడుతున్న దాసి మాటలు మధ్యలోనే ఆగిపోయాయి పొట్టిగా లావుగాఉన్న నల్లనిదాసి అక్కడ మళ్ళీ కన్పించలేదు. చీపురుకట్ట పట్టు కొని ఉన్న దాసి చేతినుంచి ఆ ప్రచండ అస్త్రము క్రింద పడిపోయింది. పాము కాటువేసినట్లు క్షణకాలం అలాగే

నిశ్చేష్టురాలై నిలబడి తరువాత అత్యంత భారమగు తన అర్ధనగ్న శరీరమును ఒక చీకటి గదిలో దాచుకొనుటకు ప్రయత్నించింది. పాత్రలు తోముతున్న దాసి శాపనార్థాలు మధ్యలోనే ఆగిపోయాయి, క్షణకాలముకూడా విశ్రాంతి లేకుండా పనిచేస్తున్న చేతులు నోరు స్తంభించి పోయాయి. చేపల్ని శుభ్రముచేసి పరపర కోస్తున్న దాసి మాత్రము క్షణకాలము ఆగి తిరిగి నిశ్శబ్దంగా తన పనిని చేసుకో సాగింది. వంటమనిషి నేతిచర్చ అసంపూర్తిగానే ముగిసింది; కానీ అక్కడినుండి వెళ్ళిపోయే తొందరలో పొరపాటున నేతి పాత్రనుకూడా తీసుకువెళ్లింది—దానిలో కొంత భాగము కోసమే ఇంతసేపటినుంచి చర్చ జరుగుతూ ఉంది. దీపాలు వెలిగించి అలంకరించే స్త్రీలు కూడా ఎక్కడ వారక్కడ దాక్కున్నారు; కాలి అందెల చప్పుడు మాత్రము వారెక్కడ దాగినదీ తెలియ జేస్తున్నాయి; నగ్న శరీరాలతో కుస్తీలు పడుతున్న బాలుర యుద్ధము కూడా ఆగిపోయింది. కానీ వాళ్ళిద్దరిలో పైచేయిగా ఉన్న బాలుడు పారిపోతూ పారిపోతూ రెండవబాలుని వీపుమీద ఒకతన్ను తన్ని తన ఆధిక్యతను నిరూపించుకున్నాడు. వాళ్లిద్దరి వెనుక 'ఆచ్ ఛూచ్' ఆడుతున్న బాలికలు వస్తున్న నవ్వును ఆపు కొనుటకు ప్రయత్నిస్తూ తుర్రున పారిపోయారు. ఇంతవరకు కోలాహలంతో రణరంగమువలె కన్పించిన ఆ ప్రదేశము క్షణంలో సద్దుమణిగింది. మాధవుని పినతల్లివచ్చి అతనికి ఎదురుగా నిలబడింది.

"అమ్మా, ఏమిటిదంతా ? సంతబజారువలె ఉంది" అని అన్నాడు మాధవుడు ఆమెతో.

ఆమె నవ్వుతూ ఇలా అంది_"నలుగురుస్త్రీలు ఒక చోట చేరితే ఏమిజరుగుతుందే అదో జరుగుతూఉంది. అరవటమే వారి స్వభావము నాయనా!"

"పిన్నిగారేరీ ?"

"అదే నేనూ ఆలోచిస్తున్నాను. ఉదయం నుంచి ఇంటో కన్పించటం లేదు."

మాధవుడు ఆశ్చర్యపడుతూ "ఉదయంనుండి కన్పించటంలేదా? అయితే ఇదంతా నిజమేనన్నమాట !" అని అన్నాడు.

"ఏమిటి నాయనా అది?"

"అంత ముఖ్యమైన విషయం కాదు. తరువాత చెపుతాను. ఇంతకూ ఆమె ఎక్కడికి వెళ్ళినట్లు? ఎవరైనా ఆమెను చూచారేమో అడిగి చూడండి."

పాత్రలు తోముతున్న దాసీని, చేపలు శుభ్రముచేసే దాసీని పిలిచి: "అంబికా, శ్రీమతీ మీరెవరైనా చూచారా?" అని అడిగింది మాధవుని పినతల్లి.

వాళ్ళిద్దరూ "లేదండి" అని సవినయంగా జవాబు చెప్పారు.

"ఆశ్చర్యంగా ఉంది!" అని అంది పినతల్లి.

తరువాత మాధవుడు గోడ నుద్దేశించి అడిగి

నట్లు "ఎవరూ ఆమెను చూడలేదా?" అని ప్రశ్నించాడు.

గోడకు అవతలి వైపునుంచి "స్నానము చేయు సమయంలో అటువైపు భవనంలో వారిని చూచాను." అని ఎవరో జవాబు చెప్పారు.

పినతల్లి ఆశ్చర్యపడుతూ "అటువైపు భవనంలోనా?" అని అడిగింది.

"అటువైపు భవనంలోనా? అంటే మధురదాదా భవనంలో" అని మాధవుడు అన్నాడు.

మాధవునికి క్షణంలో విషయమంతా అర్థమయింది. అస్పష్టంగా పైకి గొణిగాడు—"మధురదాదా! అయితే ఇదంతా చేస్తున్నది వారేనా? కాదు, కాదు, ఆ విధంగా జరిగి ఉండదు. నేను అనవసరంగా వారిని అనుమానిస్తున్నాను."

తరువాత అతడు అక్కడ ఉన్న ఒక దాసీని పిలిచి "మా పిన్నిగారు అక్కడ ఉన్నారేమో చూచి పిలుచుకొనిరా. ఒకవేళ వారు రానట్లయితే కారణం ఏమిటో అడిగిరా" అని ఆజ్ఞాపించాడు.

# 6

రాజమోహనుడు మాతంగినిని కటువైన మాటలతో నిందించాడు. తరువాత అతని మేనత్త మాతంగినిని పడక గదిలోనికి తీసుకువెళ్ళి ఓదార్చింది. అప్పటినుండి మాతంగిని

బయటకు రాలేదు. తలుపులు వేసుకొని లోలోపల కుమిలి పోతూ స్పృహలేనట్లుగా మంచముమీద పడిఉంది. వృద్ధు రాలే రాత్రికి వంటచేసింది. ఆ వృద్ధురాలు, ఆడుబిడ్డ కిశోరి అనేక విధాల చెప్పారు—కానీ మాతంగిని లేచివచ్చి భోజనము చేయలేదు. చివరికి వాళ్ళిద్దరుకూడా బ్రతిమాలటం మానే శారు; ఈ విధంగా జరిగినందుకు వాళ్ళుకూడా బాధపడు తూనే ఉన్నారు.

మంచం మీద పడుకొని మాతంగిని రకరకాలగా ఆలోచించసాగింది—తాను జీవితమంతా ఇదే విధంగా దుఃఖ మును బాధలు అనుభవించక తప్పదు. ఈ రాత్రికి భర్త తన వద్దకు రాడనే విషయము ఆమెకు తెలుసు. భార్యమీద కోపం వచ్చినప్పుడు అతడు ఆ విధంగానే చేస్తాడు. అతడు రాకపోవటం మాతంగినికి సంతోషమే. ఇలాంటి సమయంలో ఒంటరిగా ఉంటేనే మనసుకు కొంత శాంతి ఉంటుంది; ప్రశాంతంగా తన పరిస్థితిని గురించి ఆలోచించుకో గలుగు తుంది

రాత్రి ప్రొద్దుపోయేసరికి ఇంటిలోని వారందరూ నిద్రపోయారు. ఇంటిలోనూ బయటా కూడా నిశ్శబ్దముగా ఉంది. మాతంగిని గదిలో దీపం లేదు. అక్కడ అంధకారం రాజ్యం చేస్తోంది. కిటికీ తలుపుల మధ్యనుంచి చంద్రకిర ణపు కాంతి సన్నగా గది నేలమీదపడుతోంది. దిండుమీద తలకింద చెయ్యి పెట్టుకొని మాతంగిని పడుకొని ఉంది. లోపల అమిత ఉక్కగా ఉంది మాతంగిని ఆ చంద్ర కిరణ కాంతివైపు చూస్తూ తన బాల్యమునాటి సంగతులు గుర్తు

చేసుకో సాగింది. సినిమాలోని దృశ్యములవలె చిన్ననాటి సంగతులు ఆమె మనో వీధిలో మెదలసాగాయి. తన అక్క హేమాంగినితో కలిసి చిన్నతనంలో సాయంత్రపు సూర్య కిరణాలతో ఆటలాడుతూ గంతులు వేసేది. అక్క-చెల్లెం డ్రిద్దరూ నిర్మలమగు నీలాకాశం క్రింద పడుకొని అనంత మగు నీలాకాశ సముద్రములో తేలిపోయే చంద్రబింబమును చూస్తూ ప్రపంచాన్నే మరచి పోయేవాళ్లు. నిజంగా శైశ వము ఎంత మధురమైనది! అక్క- తాను వింత వింత కథ లెన్నో చెప్పుకునేవారు. నాయనమ్మ చెప్పే కథల్ని ఏకాగ్ర తతో వినేవాళ్ళు.

వివాహమైన తరువాత ఈ యెనిమిది సంవత్సరాలలో యెంతో మార్పు వచ్చింది. బిగ్గరగా మాట్లాడటమూ లేదు; కిల కిలా నవ్వటమూ లేదు. ఆమె ప్రేమించే ముఖాలన్నీ ఆమె హృదయంలోనుంచి మాయమై పోయాయి ఆ మంద హాసాలు, వాత్సల్యముతో మాట్లాడే ఆ కంఠస్వరాలు— యిప్పుడు అవేమీ లభించవు—వాటికోసము ఆమె హృద యము యెంతో తపించి పోతూంది. ఆమె హృదయంలోని ప్రేమ ప్రవాహము నిత్యము ముందుకు దూకబోతోంది. కానీ ఒక పెద్దరాయి అడ్డుగా వుంది. ఆ స్వర్గములోని మందాకినీ ప్రవాహము పుట్టినచోటనే నిట్టూర్పులతో ఆగిపోయింది. వేదనా భరితమగు ఆ స్మృతులు—వేదనా భరితమయినప్ప టికీ మధురముగానే వున్నాయి—నాటి మాటికీ ఆమె మన సులో మెదులుతూ క్షణకాలము ప్రస్తుత దుస్థితినుంచి శాంతిని ప్రసాదిస్తున్నాయి. ఆ జ్ఞాపకాలను ఆమె మరచి

పోవాలనుకున్నా మరచిపోలేకుండా ఉంది. చివరికి ఆమెకు కనకమయి గుర్తొచ్చింది. చుట్టుపట్ల ఆమెను ప్రేమించేది కనకమయి మాత్రమే. తన మనసులోని బాధను గురించి మాతంగిని ఆమెతో మాత్రమే చెప్పుకుంది. నిత్యము దుఃఖము బాధలు భరించటమే మాతంగిని జీవిత చరిత్ర. ఇది ఆలోచించుకునే ఆమె ఏడుస్తూ ఉంది.

వేసవి కాలమగుటవల్ల గదిలో వేడిని భరించ లేకుండా ఉంది. మాతంగిని కిటికీ తలుపులు తెరవటానికని లేచి నిలబడింది. కిటికీ తెరుస్తూ ఆమె చేతులు అలాగే ఆగి పోయాయి; బయట ఎవరో అతి జాగ్రత్తగా చప్పుడు కాకుండా నడవటానికి ప్రయత్నిస్తున్నట్లు విన్పించింది. బయట ఎంతో దూరాన కాక ఆమె నిలబడిఉన్న కిటికీ సమీపము లోనే అడుగుల చప్పుడు విన్పించింది. సామాన్యంగా అన్ని మట్టిగోడల ఇళ్ళకు ఉన్నట్లుగానే రెండడుగుల ఎత్తున గోడలో రెండు అడుగుల వెడల్పు మూడు అడుగుల ఎత్తుగల కిటికీ ఉంది.

మాతంగిని అక్కడే నిలబడి తలుపుల సందునుంచి బయటకు తొంగి చూచింది. చెట్లు, వెన్నెల తప్ప ఆమెకు ఏమీ కన్పించలేదు.

అడుగుల చప్పుడు విన్పించేవైపున కాలిబాటగానీ మరో దారిగానీ లేవు. మాతంగిని భయపడింది. ఆమె శిలా విగ్రహం వలె కిటికీ వద్దనే నిలబడి ఆ చప్పుడు వినటానికి ప్రయత్నించింది. అడుగుల చప్పుడు కిటికీ వరకువచ్చి ఆగి

పోయింది. అవతలి వైపున ఎవరో ఇద్దరు గుసగుస లాడటం వినిపించింది. ఇద్దరిలో ఒకరి కంఠస్వరము తనభర్త రాజ మోహనుని కంఠస్వరం వలె ఉంది. భర్త కంఠస్వరాన్ని గుర్తించిన తరువాత మాతంగినికి మరింత కుతూహలము కలిగింది. అతని కంఠస్వరమే కొంచెము పెద్దగా వినిపిస్తూ ఉంది. మాతంగినికి వారికి మధ్య ఒక మట్టిగోడ మాత్రమే అడ్డుగా ఉంది. వారికి మాటలన్నీ స్పష్టంగా వినిపించక పోయినప్పటికీ వారి ఉద్దేశ్యమును అర్థం చేసుకొనుటకు కావలసినంతవరకు వినిపిస్తూనే ఉంది

వారిద్దరిలో ఒకవ్యక్తి "అంత బిగ్గరగా మాట్లాడతా వెందుకు ? యీ ఇంటిలోని వారు వింటారు" అని అన్నాడు.

"ఇంత ప్రొద్దుపోయేవరకు ఎవరూ మేల్కొని ఉండరు. అందరూ నిద్రపోయారు" ఈమాటలు అన్నది రాజమోహనుడేనని మాతంగిని గుర్తించింది.

"మరీ గోడదగ్గరగా ఎందుకు, అవతలికి వెళ్ళి మాట్లా డుకుందాం. ఒకవేళ ఎవరైనా మేల్కొని ఉన్నప్పటికీ మన మాటలు వినిపించవు" ఇది మొదటివ్యక్తి కంఠస్వరము

అందుకు రాజమోహనుడు ఇలా చెప్పటం వినిపిం చింది_"అవసరం లేదంటే మీరు చెప్పినట్లు ఎవరైనా మేల్కొని ఉంటే ఇతరచోట్లకంటే ఇదే సురక్షితమైన ప్రదేశము గోడనీడ పడుతుంది. అదీగాక చూరుక్రింద ఉన్నాము లోపల ఉన్నవారికి మనము కన్పించము. కిటికీ సందునుంచి చూచినప్పటికీ మనల్ని చూడలేరు. ఇంతరాత్రి

వేళ ఎవరైనా లేచి బయటకు వచ్చినా మనల్ని చూడలేరు."

"నిజమే. ఈ గదిలో ఎవరు ఉంటారు?"

"అలా అడగటంలో మీ ఉద్దేశ్యం ఏమిటి?" అని రాజమోహనుడు అంతలోనే సర్దుకుని ఇలా చెప్పాడు: "మీతో చెప్పినందువల్ల నష్టమేమీ లేదు—అది నా పడకగది. ఆగదిలో నా భార్యతప్ప మరెవరూ ఉండరు."

"నీ భార్య మేల్కొని ఉండవచ్చును గదా?"

"లేదు, తప్పకుండా ఆమె నిద్రపోయి ఉంటుంది. సరే, వెళ్ళి చూచి వస్తాను. మీరు ఇక్కడే ఉండండి."

మాతంగినికి తన భర్త అటు తిరిగివస్తున్న అడుగుల చప్పుడు వినిపించింది. నెమ్మదిగా ఆమె మంచంవద్దకు చేరుకొని చప్పుడు కాకుండా నిద్రపోయిన దానివలె పడుకొని కళ్ళుమూసుకుంది.

రాజమోహనుడు పడకగది వద్దకు వచ్చి నెమ్మదిగా తలుపు తట్టాడు. ఎవరూ తలుపు తెరవలేదు. అతడు నెమ్మదిగా తన భార్యను పేరుపెట్టి పిలిచాడు. అప్పటికీ ఎవరూ పలకలేదు మాతంగిని తప్పక నిద్రపోయి ఉంటుందనే అతడు అనుకున్నాడు. ఒకవేళ తన మీద కోపంవల్ల పలకటం లేదేమో, కనుక లోనికి వెళ్ళి చూడాలని అనుకున్నాడు. భార్య కోపానికి తగిన కారణం లేకపోలేదు. ఇవాళ తన ప్రవర్తన చాలా దారుణంగా ఉంది— అని ఆలోచించి రాజమోహనుడు వంట ఇంటిలోనికి వెళ్ళి దీపం వెలిగించుకొని

తిరిగి పడక గది వద్దకు వచ్చాడు. అతడు దీపమును క్రింద పెట్టి ఒక తలుపును కాలితో ముందుకు త్రోసి చేతితో రెండవ తలుపును లాగేసరికి రెండు తలుపులమధ్య చిన్న ఖాళీ ఏర్పడింది. రాజమోహనుడు ఆలస్యంగా వచ్చినప్పుడు తలుపు తెరుచుకొని వచ్చుటకు వీలుగా ఆమె గడియ మాత్రమే వేసుంది; రాజమోహనుడు వ్రేలితో గడియ తప్పించి దీపం తీసుకొని లోనికి వెళ్ళాడు.

మాతంగిని స్మారకం లేకుండా మంచంమీద పడి నిద్రపోతూ ఉంది. రాజమోహనుడు నెమ్మదిగా అనేకసార్లు ఆమెను పిలిచాడు. కోపంగా పిలిస్తే పలకదేమోనని ప్రేమతో పిలిచాడు. అయినా మాతంగిని పలకలేదు.మాతంగిని గాఢనిద్రలో మునిగి ఉన్నట్లు కన్పించింది. నిద్రపోయి నట్లు నటించటానికి కూడా అతనికి తగినకారణమేదీ కన్పించ లేదు. ఆ విధంగా జరుగుతుందనే అతడు ఆలోచించలేక పోయాడు. తన భార్య నిద్రపోయిందని నిశ్చయించుకొని రాజమోహనుడు గదిలోనుంచి బయటకు వచ్చాడు. తలుపులు యథా తథంగా మూసివేసి దీపాన్ని ఆర్పివేశాడు. మిగిలిన వారెవరైనా మేల్కొని ఉన్నారేమో పరీక్షిస్తూ; అందరూ నిద్రపోతున్నారని నిశ్చయించుకొని తన మిత్రుని వద్దకు తిరిగి వచ్చాడు.

భర్త కొద్దిదూరం వెళ్ళగానే మాతంగిని మంచము మీదినుంచి లేచి కిటికీ వద్దకు వచ్చి నిలబడింది. తరువాత ఆమెకు ఈ క్రింది సంభాషణ విన్పించింది—

ఇంటిలోని వారందరూ నిద్రపోతున్నారనీ, భయపడ

వలసిన అవసరమేమీ లేదనీ విని రాజమోహానుని మిత్రుడు "ఈ వ్యవహారములో నువ్వు మాకు సహాయం చేయటానికి సిద్ధంగా ఉన్నావా?" అని అడిగాడు.

"నాకు అంత ఇష్టంలేదు. ఇంతవరకు వచ్చిన తరువాత నేనిప్పుడు బుద్ధిమంతునిగా నటించటంలేదు. కానీ విషయమేమిటంటే అతడంటే, నా కెంతమాత్రం ఇష్టలేక పోయినప్పటికీ అతడు నాకు చాలా ఉపకారం చేశాడు——"

ధూర్తుడగు రెండోమనిషి రాజమోహానుని మాటకు అడ్డొస్తూ "అయితే అతడంటే నీ కెందుకు ఇష్టంలేదు? అతడంటే నీకు కోపం యెందుకు?" అని ప్రశ్నించాడు.

"అతడంటే నాకు ఎందుకు ఇష్టంలేదని నువ్వు అడుగుతున్నావు. అతడు నాకు మేలుచేసినమాట యదార్థమే. అపకారము కూడా చేశాడు. ఉపకారము కంటె అపకారమే ఎక్కువ చేశాడు."

"అలాంటప్పుడు మాకు సహాయము చేయటానికి అభ్యంతరం ఎందుకు?"

"సహాయం చేస్తాను; కానీ నేను కోరినది మీరు ఇవ్వాలి. ఈ పనికిమాలిన గ్రామాన్ని వదలి నేను మరెక్కడికైనా వెళ్ళిపోవాలను కుంటున్నాను. కానీ మరెక్కడికైనా వెళితే భోజనానికి గడవటమే కష్టమవుతుంది. ఎక్కడికి వెళ్ళిఉన్నా నాకు భోజనానికి ఎలాంటిఇబ్బందీ లేకుండా జరుగుసంత డబ్బుకావాలి. మీరు అంతడబ్బు యివ్వటానికి

అంగీకరించే యెడల నేను మీకు సహాయం చేయటానికి సిద్ధమే."

"నీకు ఎంత డబ్బు కావాలో చెప్పు."

"నేను చేయవలసిన పని ఏమిటో చెపితే అప్పుడు నాకు ఎంత కావాలో చెపుతాను."

"ఇంతకుముందు నువ్వు చేసినదే మళ్ళీ చేయాలి. అతని చరాస్తినంతా తరలించి వేయాలి. అందుకు నీ సహాయం కావాలి. ఈసారి నగదు కాక లభించే సంపదనంతా నీకే యిస్తాను. అయితే, ఆపని ఈరాత్రికే జరగాలి."

అందుకు రాజమోహనుడు ఇలా అన్నాడు—"అర్థమవుతుంది. మీకు ఈ పనిలో నావల్ల కాదగిన సహాయమేదో దాచకుండా చెప్పండి. యింత గొప్ప ధనికుల ఇంటిలో యిలాంటి పనిచేసిన ఫలితము ఎలా ఉంటుందో, ఎంత గందరగోళం జరుగుతుంతో మీకు తెలియకపోదు. పోయిన వస్తువుల కోసము ఎంత హంగామా చేస్తారో, సోదాలు మొదలగునవి జరుగుతాయనికూడా మీకు తెలుసు. ఆ గొడవలన్నీ సద్దుమణిగే వరకు దొంగిలించిన సంపదను నమ్మకముగా దాచి మీకు యివ్వగలిగిన వ్యక్తి కావాలి. ఆ దృష్టితోనే మీరు నన్ను ఎన్నిక చేసుకున్నారు—ఈపనిలో నాకంటె మీకు ఉపయోగపడే వారెవరూ దొరకరని మీకు తెలుసు. నన్ను ఎవరూ సందేహించరు. దోచుకున్న వస్తువులను కూడా సురక్షితముగా దాయగలను. కానీ నేను కోరే డబ్బుమీకు అధికంగా కన్పిస్తుందేమోనని నాభయం."

రాజమోహనునితో మాట్లాడే రెండో వ్యక్తి దొంగ అని పాఠకులకు ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. "కనుక ఎక్కువగా కన్పించకుండా నువ్వు ఆలోచించి ఎంతకావాలో అడుగు" అని అన్నాడు ఆ వ్యక్తి.

"బేరాలాడటం నాకెంత మాత్రం ఇష్టంలేదు. మీరు దోచుకున్న దానిలో నాకు నాల్గో వంతు ఇవ్వాలి."

ఆ దొంగకు రాజమోహనుని స్వభావం తెలుసు. అవసరాన్ని కనిపెట్టి రాజమోహనుడు బేరమాడుతున్నాడు. కొద్ది క్షణాలు మెదలకుండా దొంగ ఇలా అన్నాడు — "నువ్వు అడిగినది నాకు అంగీకారమే. కానీ మిగిలిన వారిని కూడా అడగాలి కదా ! నేను చెపితే వారు కూడా కాదనరు."

"ఆ విషయం నాకు తెలుసు. కానీ మరొక షరతు. ఆభరణములు మొదలగువాటికి ముందుగానే ధరను అంచనా వేసి నాకు నాల్గవ వంతు భాగము నగదుగా చెల్లించాలి. అమ్మినప్పుడు అంతకంటె తక్కువ వచ్చినట్లయితే నేను డబ్బు తిరిగి ఇస్తాను. ఎక్కువ లభించినట్లయితే తరువాత మీరు నాకివ్వాలి."

"సరే, సబబుగానే ఉంది. నీ షరతు మాకు అంగీకారమే. కానీ మాది కూడా ఒక షరతు ఉంది. నువ్వు మాకు మరొక పనికూడా చేసిపెట్టాలి."

"అందుకు వేరే డబ్బు ఇస్తే అదీ చేస్తాను."

"తప్పకుండా ఇస్తాము. మాధవఘోషు సంపదను మా కోసం దోచుకుంటున్నాను. కానీ మరొకరు ఒక కోర్కె కోరారు."

రాజమోహనుడు కుతూహలంతో "ఏమిటి ?" అని ప్రశ్నించాడు.

"మాధవఘోషు పినతండ్రి వ్రాసిన వీలునామా కావాలి."

రాజమోహనుడు ఆ మాట విని కొంత చలించాడు. అతడు 'ఊం' అని వూరుకున్నాడు.

"అవును, ఆ పనికి నీకు బహుమానం ఇస్తాము. అతడు దానిని ఎక్కడ దాచాడో నువ్వు చెపితే చాలు" అని అన్నాడు దొంగ.

"అది నాకు కూడా సరిగా తెలియదు. కానీ, ఒకసారి నేను కొన్ని ముఖ్యమైన కాగితాలు తీస్తూ ఉండగా దానిని చూచాను. ఆ పెట్టె ఎక్కడ ఉంటుందో మాత్రం నాకు తెలియదు. మరొక పెద్ద పెట్టెలో గానీ, బీరువాలో గానీ దాచి ఉంటారేమో! అది కావలసినది ఎవరికో చెపుతారా?"

"అది చెప్పకూడదు."

"నాతో కూడా చెప్పకూడదా?"

"ఎవరితోనూ చెప్పకూడదు."

"మధురఘోషుగారికి కాదు గదా?"

"కావచ్చు, కాకపోవచ్చు—ఆ పెట్టె ఎలా ఉంటుంది?"

"చెపితే నాకేమిస్తారు?"

"ఏం కావాలో చెప్పు."

"రెండు వందల రూపాయలు."

"ఒక్కమాట చెప్పినందుకు రెండు వందల రూపా యలా? చాలా ఎక్కువే. కానీ మా పనికూడా ఎక్కువే. (దొంగ తనలో తానే మాట్లాడుకో సాగాడు) రాత్రంతా వొక కాగితం ముక్కను వెతకాలా? ఆ పెట్టె అతని పడక గదిలోనే ఉంటుంది. అది ఎలా ఉంటుందో తెలిస్తే వెతక టం తేలిక. నీతో వాదించటం అనవసరం. నువ్వు అడిగినది మాకు అంగీకారమే."

"ఏనుగు దంతముతో చేసిన పెట్టె అది. దాని మీద బంగారు రంగుతో మాధవుని పేరు ఇంగ్లీషు అక్షరాలలో వుంటుంది."

"అయితే అన్నీ ఖాయమే. నువ్వు నా వెంట వస్తే మిగిలిన వారితో కూడా మాట్లాడదాము. మేము ఒక స్థలము చెపుతాము, నువ్వు అక్కడికి వచ్చి మమ్మల్ని కలుసుకో వాలి. యిప్పటికే చాలా ఆలస్యమయింది. త్వరగారా. చంద్రుడు అస్తమించగానే మనము పనిని ప్రారంభించాలి. వేసవికాలము, రాత్రి పొద్దు చాలా తక్కువ."

ఈ విధంగా మాట్లాడుకొని దొంగ, అతని స్నేహి తుడు ఇద్దరూ గోడ పడలోనుంచి ఇవతలికి వచ్చి చెట్లమధ్య ఉన్న కాలిబాట వెంట ముందుకు సాగిపోయారు. కొద్ది దూరము వెళ్ళి చీకట్లో అదృశ్యమై పోయారు. ఇక్కడ మాతంగిని ఆశ్చర్య భయాలతో తెలివితప్పి క్రింద పడి పోయింది.

# 7

చాటున నిలబడి మాతంగిని వాళ్ళ భయంకర సంభాషణ విన్నది. ఒక్కొక్క మాటను విన్నకొద్దీ భయంతో ఆమె శరీరములోని రక్తము గడ్డకట్ట సాగింది. అయినప్పటికీ వారి సంభాషణ పూర్తయేవరకు ఆమె భయంతో కంపించే తన శరీరాన్ని పడిపోకుండా ఎలాగో నిలబెట్టింది. భయంకర కుతూహల వశమున ఆమె వారి సంభాషణను ఆసాంతము విన్నది. కానీ సంభాషణ ముగియగానే శవమువలె క్రింద పడిపోయింది. కాస్సేపటివరకు భయము, బాధ తీవ్రతలో చలనం లేకుండా అలాగే పడిఉండి పోయింది. క్రమంగా ఆమె తాను విన్న మాటలకు అర్థము తెలుసుకొనుటకు ప్రయత్నించింది. తన భర్తయొక్క జీవితమునకు సంబంధించిన ఒక భయంకర రూపాన్ని యివాళ ఆమె స్పష్టంగా చూచింది. నేటివరకు ఆమె తనభర్తయొక్క పశుప్రవృత్తిని, కఠిన హృదయమును మాత్రమే చూడగలిగింది; యివాళ దొంగలకు సహాయకుని రూపములో అతనిని చూచింది. అతడు కూడా దొంగలలో ఒకడు కావచ్చునని ఆలోచించి దుస్సహ దుఃఖభారముతో నిలువెల్లా క్రుంగిపో సాగింది. ఇంతకాలము తన నిష్కళంక హృదయముతో ఆటలాడి తనతో కలిసి నిద్రించిన వ్యక్తి అతడేనని ఆలోచించేసరికి చాలా బాధకలిగింది. ఇంత తెలిసిన తరువాత భవిష్యత్తులో అలాంటి వ్యక్తి భీభత్స ఆలింగనములో ఉండక తప్పదని

కూడా ఆమె ఆలోచించింది; అతనికి దూరంగా ఉండగల ఉపాయమేదీ లేదు. మరో మార్గమేదీ లేదు–యిలాంటి శాప గ్రస్త జీవితమునే అనుభవించాలి.

ఇవన్నీ ఆలోచించి ఆమె చాలా వ్యాకుల పడసాగింది. హృదయము బద్దలైపోతుందేమో అన్నట్లుంది. తన భర్త సహాయము చేయు పాపకార్యము యొక్క భీషణ రూపము ఆమె కళ్ళ ఎదుట మెదలసాగింది. యిలాంటి మానసిక ఆందోళన, దుఃఖమువల్ల మాతంగిని శరీరము కంపించసాగింది. భీషణమగు ఈ దుష్టకార్యమువల్ల తన చెల్లెలు హేమాంగిని, మరది మాధవఘోషు నష్టపోతారు—వారు సర్వ నాశనమైపోతారు. భయముతో రోమములు నిక్కపొడిచాయి. నరనరాన రక్తము పొంగులెత్తుతూ ప్రవహించసాగింది. సమ్మెటతో మోదుతున్నట్లు తల పగిలిపోతూఉంది నిశ్చింతగా నిద్రపోతున్న తమ బంధుజనము భవన ద్వారములో భయంకర దారిద్ర్యము పొంచికూర్చుంది. అంతకంటె ఘోరమే జరుగవచ్చునేమో! యివన్నీ ఆలోచిస్తూ ఆమె తన శాపగ్రస్త భవిష్యత్తునే మరచిపోయింది. తన జీవితాన్ని అర్పించి వారిని కాపాడగలిగితే ఆవిధంగా చేయాలనే ఆమె నిశ్చయించుకుంది.

ముందు తన యింటిలోని వారందరినీ నిద్రలేపాలని ఆమె ఆలోచించింది. కానీ అది తెలివిగల పనికాదనే ఆమె అనుకుంది. రాజమోహనుడు ఆవిధంగా చేస్తాడని ఆమె చెప్పినా ఎవరూ నమ్మరు. రాజమోహనుని మేనత్త తన మాట నమ్ముతుందా? అతని చెల్లెలు నమ్ముతుందా?

తనకు మతి చలించిందనే వాళ్ళు ఆలోచిస్తారు. పీడకలను చూచి తాను కలవరిస్తున్నాననో, లేక మతి చలించి నోటికి వచ్చినది వాగుతున్నాననో అనుకుంటారు. ఒకవేళ వాళ్ళు తన మాటలు విశ్వసించినప్పటికీ మాధవఘోషును కాపాడటం కోసమని రాజమోహనునికి హాని కలిగించటానికి అంగీకరించరు. మనసులో కోర్కె ఉన్నా వారు ఆపని చేయలేరు. రాజమోహనుడంటేనే వారికి తగని భయం. అతనికి వ్యతిరేకంగా ఒక్క మాటకూడా మాట్లాడలేరు. అంతేకాక వారు తన మాటను నమ్మక విషయమంతా రాజమోహనునితో గనుక చెపితే తాను సర్వనాశనమై పోతుంది.

అప్పుడు ఆమెకు కనకమయి గుర్తొచ్చింది. కనకమయి ద్వారా మాధవునికి కబురు పంపకూడదా? కనకమయి ఇల్లు అట్టే దూరములేదు. ప్రక్కనే వున్నది. మొదలకుండా కనకమయిని కలుసుకొని రాబోయే ఆపదను గురించి మాధవునికి కబురుపంపితే రాజమోహనునికి ఎలాంటి హాని కలుగకుండా పని జరిగిపోతుందని ఆలోచించింది. అసంభవం కాకపోయినా మాతంగినికి ఇది అంత సులువైనదిగా కన్పించలేదు. కనకమయి తల్లిని లేపకుండా ఆమెను కలుసుకోలేదు. తల్లి కూతుళ్ళిద్దరూ ఒక గదిలోనే పడుకొని ఉంటారు. ఏమీ చెప్పకుండా కనకమయి తన మాటలు విశ్వసించదు. ఆమె తల్లికూడా ఒకపట్టాన నమ్మే మనిషికాదు. ఆమెకు నచ్చచెప్పాలంటే మొదటినుండి జరిగినదంతా చెప్పాలి. ఆ విధంగా చెప్పటంవల్ల తన భర్తకూడా చిక్కులో పడతాడు. ఈశ్వరుడు, మనుష్యుల సాక్షిగా ఒకనాడు ఆమె అతనికి

తన ఆత్మసమర్పణ కావించింది. అతనికి వ్యతిరేకంగా ఆమె ఒక్క మాటకూడా చెప్పలేదు. కనకమయిని ఒక్కదానినే బయటకు పిలిచి ఈ అర్థరాత్రి మాధవుని ఇంటికి వెళ్ళవలసిన అవసరాన్ని గురించి చెప్పటం అసంభవం. అర్థరాత్రి సమయంలో కనకమయితల్లి కుమార్తెను ఒంటరిగా బయటకు పంపటానికి అంగీకరించదు. వీటన్నిటివలన మంచికి బదులు కీడే జరుగవచ్చును. తన ఇంటిలోని వారందరినీ నిద్రలేపి ఆమె తనను వారికి అప్పగించినా అప్పగించవచ్చును. మాతంగినికి పిచ్చిపట్టిందనో లేక మాతంగిని చెడిపోయిందనో కూడా ఆమె ఆలోచించవచ్చును. ఒకవేళ ఆమె తల్లి అంగీకరిస్తుందనే అనుకున్నప్పటికి ఇంత రాత్రివేళ కనకమయి వొంటరిగా గానీ, లేక తన వెంటగానీ అంత దూరం వెళ్ళటానికి అంగీకరిస్తుందా? దొంగలు తమ ప్రయత్నంలో ఉన్నారని తెలిసి దారిలోపొంచి ఉంటారనే భయం వల్ల అసలే అంగీకరించక పోవచ్చును.

మాతంగిని అన్నివిధాల ఆలోచించి నిరాశ చెంది చివరకు చేయవలసినదేదో తానే చేయాలని నిశ్చయించుకుంది. అలాంటి ఆలోచన రాగానే ఆమె ఉక్కిరిబిక్కిరై పోయింది. హృదయం కంపించింది. రాత్రులందు ముఖ్యముగా అనేక ఆపదలు ఎదురవుతాయి—భూత ప్రేతములు సంచరిస్తాయి. విషజంతువులు తిరుగుతూ ఉంటాయి. ఒంటరిగా అందమైన స్త్రీ బయటకు వెళ్ళినందువల్ల కూడా అపాయమే. ఇవన్నీగాక దుర్మార్గులగు దొంగలు పరిసరముల

లోనే ఎక్కడో దాగి ఉన్నారు. తాను ఒకవేళ వాళ్ళకు చిక్కితే ఏమవుతుంది! అది ఆలోచిస్తేనే ఆమె గుండెదడ హెచ్చింది. ఆ దొంగల గుంపులో తన భర్తకూడా ఉంటాడేమో అని ఆలోచించినప్పుడు ఆమె మరింత భయపడింది.

కాని మాతంగిని ధైర్యము తెచ్చుకొని తానే ఆపని చేయటానికి నిశ్చయించుకుంది. తనచెల్లెలు, మరదికోసము. తన ప్రాణాలను సైతము అర్పించాలనే ఆమె ఆలోచించింది.

రాబోయే భయంకర ఆపదను గురించి ఆలోచించిన కొద్దీ ఆమెకు తనచెల్లెలియందు, మరదియందు ప్రేమభావము హెచ్చసాగింది. దుస్సహాభార స్వరూపమైన తన జీవితాన్ని వారిశ్రేయస్సుకై అర్పించటానికి సిద్ధమయింది. స్త్రీ సహజమగు మరొక ఆలోచన ఆమెకు అడ్డుగా నిలిచింది. అర్ధరాత్రి ఒంటరిగా తాను మాధవుని యింటికి వెళుతుంది, తనను ఎవరు విశ్వసిస్తారు? మాధవుడు మాత్రం నమ్మగలడా? నొసలు చిట్లించి నిశ్చలభావంతో నిలబడి మాతంగిని ఆలోచించ సాగింది.

కింకర్తవ్య విమూఢురాలై మాతంగిని దీర్ఘంగా నిట్టూర్చింది. గదిలో ఉక్కను భరించలేక ఆమె ధైర్యము చేసి కిటికీ తలుపులు తెరిచింది. గంట - గంటన్నర సమయంలో చంద్రుడు అస్తమించ బోతున్నాడు. చంద్రుడు అస్తమించగానే దొంగలు ముట్టడి జరుపుతారు. తన చెల్లెలిని, మరదిని అప్పుడు ఆమె కాపాడలేదు. క్షణ క్షణానికి ముంచుకొస్తున్న ఆపద ఆమె ఆలోచనాశక్తిని హరించి

వేసింది. ఇప్పుడు మాతంగిని మనసులో ఎలాంటి సందేహ భావమూ లేదు.

ఆమె ఆపాద మస్తకం ఒక ముతక దుప్పటిని కప్పుకొని జాగ్రత్తగా తలుపు తెరిచింది. ' రాజమోహానుడు మూసినట్లే ఆమెకూడా బయటినుంచి తలుపులు మూసింది. ఆమె బయటికివచ్చి ఒకసారి చుట్టూ పరిశీలనగా చూచింది. ఆ నిశ్శబ్ద వాతావరణములో ఆమె ధైర్యము సన్నగిల సాగింది. అడుగు ముందుకు పడటంలేదు. ఆమె రెండుచేతు లెత్తి నమస్కరించి "పరమేశ్వరా! శక్తినివ్వు" అని ప్రార్థించింది. తరువాత ఆమె శక్తినంతా కూడదీసుకొని చప్పుడు కాకుండా ముందుకు సాగింది. ఆవిడ పొదలమధ్యగా నడచుచున్నప్పుడు ఆమె హృదయము దడదడ కొట్టుకోసాగింది. నిశ్శబ్ద వాతావరణము, చీకటి నీడలు భయము కొల్ప సాగాయి. వృక్షముల మొదళ్ళు భూత ప్రేతములవలె అంధకారములో నిలబడి ఆమెను గమనిస్తున్నట్లున్నాయి. గుబురుగా ఉన్న చెట్లకొమ్మల చాటున దొంగలు దాగిఉన్నారనే ఆమె భయపడసాగింది. ఆ చెట్లనీడలో ప్రతిదీ దొంగల వలెనూ, భూతముల వలెనూ, క్రూరమృగముల వలెనూ ఆమెకోసమే పొంచి కూర్చున్నట్లు కన్పిస్తున్నాయి వాటి నేత్రాలు అగ్నిశిఖలవలె భగ భగ మండుతున్నాయి. కథలలో విన్నట్లు ఆ భయంకర ఆకారాలు పైశాచిక అట్టహాసముతో ఆమె చుట్టూ తిరుగుతున్నట్లే వూహించుకో సాగింది. చెట్టునుంచి ఆకులు రాలిన చప్పుడు విన్పించినా, చెట్లమీద నివసించే పక్షులు కదిలినా, ఎండుటాకులమీద

జర జర పురుగులు ప్రాకినా, చివరికి తన అడుగుల చప్పుడు వినికూడా మాతంగిని త్రుళ్ళిపడేది. అయినా ధైర్యము చిక్కబట్టుకొని ఆమె ముందుకు సాగిపోతూనే ఉంది. ఆమె మనసులో మాటి మాటికి ఇష్టదైవమును ప్రార్థించుకోసాగింది. కొంతసేపటికి ఆమె ఒక సమతల ప్రదేశానికి చేరుకుంది. దాని మధ్యగా మార్గం ఉంది. ఇరువైపుల భూమి ఎత్తుగా వుంది. అక్కడ ఎక్కువ చీకటిగా కూడా ఉంది. ఒకవైపున పెద్ద మామిడితోట ఉంది. దానిచుట్టూ ముళ్ళకంచె వేశారు. రెండోవైపున ఒక చెరువు వుంది. ఆ చెరువు గట్టు మీాద అన్నీ ముళ్ళపొదలే. మూడు పెద్ద పెద్ద మర్రిచెట్లు గుబురుగా వున్న కొమ్మలతో గట్టును కప్పివేసి చూచుటకు చాలా భయంకరంగా వున్నాయి. వాటిక్రింద చీకటి మరింత దట్టంగా వుంది. అక్కడికి వచ్చేసరికి భయపడి మాతంగిని వెనక్కి తిరిగి చూచింది—మామిడి తోటలో నుండి ఒక వెలుగు ఆమె వైపుకే వస్తూఉంది. గుస గుసలాడుతున్న మనుష్యుల కంఠస్వరాలు కూడా విన్పించాయి. వారేదో విషయాన్ని గురించి చర్చిస్తున్నట్లున్నారు. ఆమె భయపడినట్లే జరిగింది. ఇప్పుడేమి చేయాలి? ఆ దొంగల గుంపే యిది. మాతంగిని ఒక క్షణకాలం అడుగు ముందుకు వేయకుండా అలాగే ఉండిపోయింది. ఆపదమీాద ఆపద ముంచుకొచ్చినట్లు దారిలో నిద్రించే ఒక కుక్క ఆమె అడుగుల చప్పుడు విని, లేచి మొరగసాగింది. దానితో మామిడి తోటలోనుంచి మనుషుల మాటలు ఆగిపోయాయి కుక్క

మొరగగానే ఎవరో అటు వస్తున్నట్లు దొంగలు పసికట్టారు. తా నిక వారిచేతికి చిక్కినట్లేనని మాతంగిని ఆలోచించింది.

ఆమె శరీరములో ఏదో నూత్నశక్తి ప్రవేశించింది. క్షణకాలంలో ఆమె లేడివలె చప్పుడు కాకుండా చెరువు గట్టుమీదికి చేరుకుంది. అక్కడ చీకటిగా వుంది. దారివెంట ఆమెను వెతుకుతూ వస్తే వారికి తాను కన్పించదు. కానీ దొంగలు గట్టుమీదికి వచ్చి మర్రిచెట్టుచుట్టుపట్ల వెతికితే ఆమె తప్పించుకోలేదు. దాగి కూర్చొనుటకు చుట్టుపట్ల గుబురుగా వున్న పొదలు కూడా ఏమీ లేవు. ఆ కుక్క ఇంకా మొరుగుతూనే వుంది. మాతంగిని ధైర్యం చేసింది. క్షణంకూడా ఆలస్యం చేయలేదు. ఒక పెద్ద మట్టి ముద్దను తీసి తాను కప్పుకున్న దుప్పటిలో మూటగా కట్టి చప్పుడు కాకుండా నీళ్ళలో పడవేసింది. మర్రిచెట్టు నీడ పడుతున్న చోట తానూ నీటిలోదిగి కూర్చుంది. చెరువు అవతలి గట్టుమీద అడుగుల చప్పుడు స్పష్టంగా విన్పిస్తూనేవుంది. వారి మాటలు కూడా అస్పష్టంగా విన్పిస్తున్నాయి. నల్లని నీటిలో చెట్టు నీడలో కూర్చున్నది కనుక తల తప్ప మరేమీ కన్పించే అవకాశం లేదు. ముఖము కన్పించకుండా నల్లని తుమ్మెద రెక్కల వంటి జుట్టును ముఖంమీదుగా విరబోసింది. యెంత పరిశీలనగా చూచినప్పటికీ ఆమెను తెలుసుకోవటం కష్టమే.

ఇంతలో ఆ దొంగలగుంపు అటువస్తూ మధ్యలోనే ఆగిపోయింది. మాతంగిని అదిగ్రహించికూడా ఏమీ కదలకుండా కూర్చుంది.

వారిలో ఒకమనిషి ఇలా అన్నాడు "చాలా విచిత్రంగా

ఉంది! ఆపాదమస్తకం దుప్పటి కప్పుకొని నిలబడిఉన్న ఒక మనిషిని నేనుచూచాను."

మరొకడు ఇలా అన్నాడు—"కాదోయ్, నువ్వేదో చెట్టు మొదలును చూచి మనిషి అనుకున్నావేమో! మనిషే అయితే ఇంతలోనే గాలికి ఎగిరిపోయాడా? అదీ గాక ఇంతవేసవిలో దుప్పటిని ఎవరు కప్పుకుంటారు? అలాంటిపని మతిచెడిన వాళ్ళెవరైనా చేయాలి తప్ప మంచి వాళ్ళెవరూ చేయరు."

"నిజం చెప్పావుదాదా! నేను చూచిన దేదైనా భూతమేమో." అని విన్పించింది జవాబుగా.

మాతంగిని ఒకసారి తలెత్తి అటు చూచింది. ఆ నిశ్శబ్ద వాతావరణంలో అశాంతిని కలిగించిన మాతంగిని జాడ తెలియక దొంగలు తిరిగి వెళ్ళిపోయారు.

జాగ్రతకోసం మాతంగిని మరికొంతసేపు నీళ్ళలోనే కూర్చుంది. దొంగల అడుగుల చప్పుడు మామిడి తోటలోకి వెళ్ళి ఆగిపోగానే ఆమె నీళ్ళలో నుండి బయటకు వచ్చింది. నెమ్మదిగా చీరను పిండుకుంది. దుప్పటిని మాత్రం అక్కడే వదలివేసింది. రెండోవైపు గట్టుమీదికిచేరి ఒక ఇరుకైన కాలిబాటవెంట ముందుకు సాగింది. ఆ కాలిబాటకు ఇరు వైపుల అన్నీపొదలే. అప్పుడప్పుడూ మధుమతి నదికి స్నానానికి వస్తూ ఉండటం వలన ఆమెకు ఆ మార్గము తెలిసినదే. మామిడి తోటను, మొరిగే కుక్కను దాటి ఆమె చాలా దూరమువచ్చి ఒకచోట ఆగింది. రాధాగంజ్‌కి వచ్చిన తరువాత ఆమె రెండుసార్లు మాత్రమే హేమాంగిని యింటికి

వెళ్ళింది. రెండు పర్యాయములు కాలినడకన కాకుండా పల్లకీలో వెళ్ళింది. మాధవుని భవనం ఏవైపున ఉన్నదో ఆమెను తెలియదు. నాలుగు బజార్లు కలిసే చోటకు వచ్చి తలెత్తి చుట్టూ చూచింది. అదృష్టవశాత్తు ఆమెకు దూరంగా ఒక దేవదారు వృక్షము ఉన్న సంగతి ఆమెకు తెలుసు. ఆమె అటువైపు వెళ్ళింది. కొద్దిసేపట్లోనే మాధవుని భవనం ఎదుటకు చేరుకుంది.

అన్ని ఆపదలు గడిచి ఇక్కడవరకు చేరింది. మరొక ఆపదగడవాలి. భవనంలోని వారందరూ నిద్రపోతున్నారు. లోనికి ఎలా వెళ్లాలి అనేదే ఇప్పుడున్న సమస్య. ఒకచోట బయట వైపుకు ఒక కిటికీ ఉంది. అటువైపు గదిలో కరుణ అనే ఒక దాసీ ఉంటుంది, ఆమె మాతంగినికి పరిచితురాలే.

అనేకసార్లు తలుపు చప్పుడు చేయగా కరుణకు మెలకువ వచ్చింది_"ఇంతరాత్రివేళ తలుపులు కొడతా రెవరు ?" అంటూ ఆమె కోపంగా అడిగింది.

"కరుణా, త్వరగా త్వరగా తలుపు తెరువు" అని మాతంగిని భయపడుతూ జవాబు చెప్పింది.

వేళకాని వేళవచ్చి కమ్మని నిద్రను పాడుచేసిన వ్యక్తిమీద కరుణకు దయ కలుగుతుందా ?

"తలుపు తెరవటానికి నువ్వెవరు ?" అని కరుణ మరింత తీవ్రంగా ప్రశ్నించింది.

మాతంగినికి తన పేరు చెప్పటం ఇష్టంలేదు. ఆమె గాబరాపడుతూ "త్వరగా తలుపు తెరువు. నే నెవరో చూడగానే గుర్తుపడతావు" అని చెప్పింది.

"ఎవరంటే చెప్పవేమిటి ?" అంటూ కరుణ మళ్ళీ రెట్టించింది బిగ్గరగా.

"నేను ఒక సామాన్య స్త్రీని, దొంగను కాదు. వచ్చి చూడరాదూ ?" అని చెప్పింది మాతంగిని.

నిద్రనుంచి లేవగానే కొంత కంగారుపడింది కాని కరుణ ఈసారి కొంచెం ఆలోచించింది. దొంగ కంఠస్వర మైతే అలా ఉండదనుకొని ధైర్యంచేసి తలుపు తెరిచింది.

మాతంగినిని చూచి కరుణకు చాలా ఆశ్చర్యం కలిగింది. "అమ్మగారూ, మీరా?" అంటూ ఆమె బిగ్గరగానే అంది.

"నేను వెంటనే హేమను కలుసుకోవాలి. నన్ను ఆమె వద్దకు తీసుకువెళ్ళు" అని చెప్పింది మాతంగిని.

కరుణకు మరింత విస్మయం కలిగింది. ఆమె మాతంగిని వైపు చూస్తూ ఇలా అడిగింది—"ఇంత రాత్రివేళ మీ రిక్కడికి ఎలా వచ్చారు? అంత గాబరా పడుతున్నా రెందుకు అమ్మగారూ, ఏం జరిగింది ? మీ దుస్తులన్నీ తడిసిపోయా యేమిటి— ఏమిటమ్మా ?"

మాతంగిని ఎంతో వ్యాకులపడుతూ ఉంది. దాసీ అడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పకుండా "త్వరగా నన్ను హేమ వద్దకు తీసుకువెళ్ళు" అని ఆజ్ఞాపించే ధోరణిలో చెప్పింది.

"వారు నిద్రపోతున్నారు. నేను వెళ్ళి వారిని నిద్ర లేపి వస్తాను. మీరీ లోపల దుస్తులు మార్చుకోండి" అని చెప్పింది కరుణ.

కరుణ ఎదురుగా కన్పించిన ఒక చీరను తెచ్చిఇచ్చింది. మాతంగిని వెంటనే చీరనుమార్చుకొని కరుణవెంట రెండో అంతస్తులో ఉన్న హేమాంగిని వద్దకు వెళ్ళింది.

# 8

మాతంగిని బయట వసారాలోనే నిలబడి హేమాంగినిని నిద్రలేపి అక్కడికి తీసుకు రమ్మని కరుణకు ఆజ్ఞాపించింది. హేమాంగిని మెలకువగానే ఉంది. మరుక్షణంలోనే ఆమె అక్కడికి వచ్చింది. ఆమె ముఖంలోనూ, కళ్ళలోనూ విస్మయ చిహ్నాలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. తత్పరతతో సంభాషించటమేగాక ఏదీ కాని వేళ తలవని తలంపుగా మాతంగిని రాకకు కారణం అడిగింది.

"ఇవాళ మీ భవనంలో దోపిడీ జరుగుతుంది. అందుకని హెచ్చరించి వెళదామనే వచ్చాను" అని చెప్పింది మాతంగిని.

నిశ్చేష్టురాలై హేమాంగిని మాటలు తడబడుతూ "దోపిడీ!" అని అంది బిగ్గరగా.

"అమ్మబాబోయ్!" అంటూ కరుణ గుండెలు బాదుకుంది.

అప్పుడు మాతంగిని ఇలా అంది—"కరుణా అరవకు. హేమా, అల్లరి చేయవద్దు. ఇక్కడ నిలబడి ఉన్నందువల్ల

పని జరుగదు. త్వరగా వెళ్ళి నీ భర్తతో దొంగలను ఎదు ర్కొనుటకు సిద్ధంగా వుండమని చెప్పు."

కాని హేమాంగిని ఆపని చేయగల స్థితిలో లేదు. భయంవల్ల ఆమె ముఖం వెల వెల బోతూ వుంది. నిలు వెల్లా కంపించసాగింది. నోటి వెంట మాట రావటమే కష్టంగా వుంది. కాళ్ళు నేలమీద ఆనటంలేదు. మాతంగిని తన చెల్లెలి పరిస్థితిని గ్రహించింది. సమయం మించిపోతే చేసిన శ్రమ వృధా అవుతుంది. అందరికంటె ముందు యీ భయంకర వార్తను తానే యజమానికి తెలియజేయాలని కరుణ ఆదుర్దా పడసాగింది. అంతేగాక ఆ వార్తను వినగానే తనకు కలిగిన భయాన్ని తీర్చుకొనుటకు యజమానికి చెప్ప టం అవసరమనే భావించింది. చేపల్ని కడిగి కోసే కరుణ ఈ దుర్వార్తను యజమానికి తెలియచేయటం ఘనకార్య మని భావించి, గబ గబ మాధవుని పడకగదివైపు పరుగె త్తింది.

ఆ పనిని చేయవలసింది హేమాంగిని. అదీగాక కరుణ వ్యర్థప్రసంగి. అందువల్ల వెంటనే తిరిగివచ్చి బాబు గారు తన మాట విశ్వసించ లేదని చెప్పింది. ఈ వార్త చెప్పటానికి మాతంగిని ఇంత రాత్రివేళ యిక్కడికి వచ్చిం దనే విషయమే మాధవుడు విశ్వసించలేదు. మాతంగిని వచ్చినసంగతి నిజమే అయితే ఆమెను తనవద్దకు తీసుకు రమ్మనీ, ఆమెనుఅడిగే విషయమేమిటో తెలుసుకుంటాననీ మాధవుడు కరుణతో చెప్పాడు.

మాతంగిని తన చెల్లెలితో ఇలా చెప్పింది—"హేమా, నువ్వు వెళ్ళి వారితో నేను వచ్చి చెప్పిన మాట నిజమేనని చెప్పు. నువ్వు చెపితే నమ్ముతారు."

"ఆ పని నావల్ల కాదు, అక్కా, నువ్వే వెళ్ళు. ఆ విషయాన్ని గురించి వారు ఏదైనా అడిగితే జవాబు చెప్ప టానికి నాకేం తెలుసు? నువ్వే వెళ్ళి పరిస్థితినంతా వారితో చెప్పు. నువ్వు చెప్పేది నిజమే అయితే త్వరగా వెళ్ళి చెప్పు"

"నేను వెళ్ళకుండా ఉండటమే మంచిది. నువ్వు వెళ్ళి ఈ వార్త నేనే చెప్పాననీ, అదంతా యదార్థమేననీ చెప్పు."

హేమాంగినికి వెళ్ళటం ఇష్టంలేదు. అందుకని చిన్నపిల్లవలె మారాము చేస్తూ "దీదీ, నువ్వే వెళ్ళు" అని అంది.

మాతంగిని అత్యంత గంభీరంగా "నేను వెళ్ళను, నేను వెళ్ళను హేమా" అని చెప్పింది.

కరుణ ధైర్యం తెచ్చుకొని నవ్వుతూ "అమ్మగారూ, అలాంటిదేమీ లేదండీ! అక్కగారు మిమ్మల్ని భయపెడు తున్నారు" అని అంది.

ఈమాట వినగానే హేమాంగిని ముఖం సంతో షంతో మెరిసింది "నిజమేనా అక్కా? నన్ను భయపెట్ట టానికే అలా చెప్పావా? ఇంత రాత్రివేళ నువ్వు వచ్చిన పనేమిటో చెప్పవూ! నేను నిజంగానే భయపడి పోయాను" అని అంది హేమాంగిని.

మాతంగిని ఒక క్షణకాలం మెదలకుండా ఫూరు కుంది, ఏదో ఆలోచించింది. చివరికి మనసులోనే తన కర్తవ్యమును నిశ్చయించుకొని "సరే, నేనే వెళ్ళి చెపుతాను. హేమా, నువ్వుకూడా నావెంటరా" అని అంది మాతంగిని.

సిగ్గుపడే స్వభావంకల హేమ అక్కగారి ఎదుట భర్త వద్దకు వెళ్ళటానికి ఇష్టపడలేదు.

"సరే, నువ్వు ఇక్కడే ఉండు. నేను తిరిగి వచ్చే వరకు నేను వచ్చిన సంగతిగానీ, నేను చెప్పిన విషయాన్నిగానీ ఎవరితోనూ చెప్పవద్దు, జాగ్రత్త! ఈ విషయాలు మరెవరికీ తెలియకూడదు" అని హెచ్చరించి మాతంగిని మాధవుని వద్దకు బయలు దేరింది.

ఆమె గబగబ వసారాదాటి ముందుకు వెళ్ళింది. చంద్రుడు అస్తమించే సమయం కావచ్చింది. మాధవుని గదిముందుకు వచ్చేసరికి మాతంగిని కాళ్ళు వణుకుతున్నాయి. మామిడి తోటలో దొంగలను చూచినప్పుడు కూడా ఆమె కాళ్ళు ఇంతగా కంపించలేదు! చీరకొంగును తలమీదినుంచి కొంచెం ముందుకు లాక్కొని అయిష్టంగానే మరి రెండడుగులు ముందుకు వేసింది; అంతలోనే ఆగి ఒక అడుగు వెనక్కి తగ్గింది. తరువాత ధైర్యం చేసి ముందుకు వెళ్ళి తలుపు తట్టింది మరొకసారి. తరువాత లోనికి వెళ్ళింది. గది అలంకరించి ఉంది. ఒక దీపం మాత్రము వెలుగుతూ ఉంది. ఖరీదైన సోఫాలో యువకుడగు మాధవుడు కూర్చొని ఉన్నాడు. మాతంగిని గోడకు ఆనుకొని సిగ్గుతో తలవంచు

కొని నిలబడింది. ఒకటిరెండుసార్లు మరదివైపు చూచింది. మాధవుడు త్రుళ్ళిపడి సోఫాలో సరిగా కూర్చున్నాడు.

కాని ఇద్దరిలో ఎవరూ మాట్లాడలేకపోయారు. ఒకరు ఒక భయంకర వార్తను అతనితో చెప్పాలని ఆదుర్దా పడు తుంటే మరొకరు ఆ వార్తను తెలుసుకోవాలని ఆదుర్దా పడుతున్నారు. ఆ మౌనము ఇద్దరికీ బాధాకరంగానే ఉంది. చివరికి మాధవుడు వదినగారిని పరిహాసమాడుతున్న ధోరణిలో "దీదీ, మీరు విదేశీ దొరసానులయితే ముందుకు కుర్చీ జరిపి కూర్చోమని కోరేవాడిని" అని అన్నాడు.

మాధవుని ముఖంలో ఒక చిరునవ్వుమెదిలింది. "దీదీ, మీరు కూర్చోవటంలేదేమిటి? అదుగో, అక్కడ కూర్చోండి" అని అన్నాడు తిరిగి అతడే.

"నేను ఇంతకుముందుచెప్పి పంపినసంగతి విన్నారా?" అని అడిగింది మాతంగిని నెమ్మదిగా.

ఈసారి మాధవుడు గంభీరంగా "విన్నాను. అది నిజ మేనా ?" అని అడిగాడు.

"నిజమే" అని – మొదటివలెనే నెమ్మదిగా జవాబు చెప్పింది మాతంగిని.

"ఇవాళ రాత్రికేనా ?"

"అవును, ఇవాళ రాత్రికే. చంద్రుడు అస్తమించ గానే వాళ్లు ముట్టడిస్తారు. చంద్రుడు అస్తమించే సమయం కూడా కావచ్చింది"

"అలాగా ? అయితే ప్రమాదమే ! కానీ దీదీ, ఈ వార్త మీకెలా తెలిసింది ?"

ఈసారి మాతంగిని ముసుగును కొద్దిగా తొలగించి "ఆ విషయం అడగవద్దు" అని స్పష్టంగానే చెప్పింది.

"మీరు చెప్పేది నాకేమీ అర్థంకావటంలేదు. ఇప్పుడు నాలో ఆలోచించే శక్తికూడా లేకుండా పోయింది."

ఈసారి మాతంగిని ముసుగును పూర్తిగా తీసివేసింది. రెప్పవేయకుండా మాధవుని ముఖంలోకి చూస్తూ మరింత స్పష్టంగా చెప్పింది—"నన్ను నువ్వు మర్చిపోయావా మాధవ్? నీతో నేను అబద్ధం చెపుతానా ? ఇంత రాత్రివేళ ఒంటరిగా నీ యింటికి వచ్చానంటే..."

"నిజమే. నావలన పొరపాటు జరిగింది. నువ్వు ఇక్కడే ఉండు దీదీ. నేను వెళ్ళి నా మనుష్యుల్ని పిలిచి వస్తాను."

మాధవుడు వెళ్ళబోతూ ఉండగా మాతంగిని అతని వైపు చూస్తూ "ముందు నాకొక మాటఇచ్చివెళ్ళు" అని అడిగింది.

"ఏమిటో చెప్పండి."

"మీ పినతండ్రి వ్రాసిన వీలునామా ఎక్కడఉంది. వాళ్ళు దానిని దొంగిలించాలనుకుంటున్నారు."

"అలాగా !" అన్నాడు మాధవుడు.

పిన్ని దానిని గురించి దావా వేసింది. అకస్మాత్తుగా అతనికి ఒక ఆధారం దొరికింది. "వీలునామా వాళ్ళ చేతికి చిక్కదు" అని చెప్పాడు మాధవుడు.

"ఏనుగు దంతముతో చేసిన పెట్టెలో ఉంచి దానిని ఈ గదిలోనే దాచావు గదూ?"

"అవును, అది మీకెలా తెలుసు ?" మాధవునికి చాలా ఆశ్చర్యం కలిగింది.

"నాకే కాదు. ఆ సంగతి దొంగలకు కూడా తెలుసు" అని చెప్పింది మాతంగిని.

"అర్థమయింది మీరు చాలా సంగతులు విన్నారు" అని మాధవుడు లేచి నిలబడ్డాడు.

"మరొక సంగతి. నా దొక చిన్న కోర్కె. అంగీకరిస్తావా?"

"తప్పకుండా అంగీకరిస్తాను."

"ఈ వార్త నేను నీతో చెప్పానని కానీ నేను ఇక్కడికి వచ్చానని కానీ ఎవరికీ తెలియకూడదు. ఇది ఇతరులకు గనుక తెలిస్తే నా ప్రాణాలు దక్కవు."

మాధవుడు ఉద్రేకపడుతూ బిగ్గరగా "ప్రాణాలు దక్కవా ? మీకు అపకారం కలగించే దెవరు?" అని అన్నాడు.

"నెమ్మదిగా మాట్లాడు!"

"నేను ఆసంగతే మర్చిపోయాను. ఇక ఇలాంటి తప్పు జరుగదు".

"అల్లరిచేయవద్దని కరుణను, హేమను హెచ్చరించి వెళ్ళండి."

"కరుణ నోరు మూయటం కష్టమే. ఏదో విధంగా బెదిరించి ఆమెనోరు మూస్తాను. మీరు, హేమ తలుపులు వేసుకొని గదిలో కూర్చోండి. అలా అయితే మిమ్మల్ని ఎవరూ చూడరు. నేను తిరిగివచ్చిన తరువాత మిమ్మల్ని ఒక సురక్షితమైన ప్రదేశానికి తీసుకు వెళతాను."

మాతంగినితో ఇలా చెప్పి మాధవుడు తన భార్య హేమ, దాసి కరుణ ఉన్న చోటుకు వచ్చాడు. ఈ విష యాన్ని గురించి ఎవరితోనూ ఏమీ, అనవద్దని యిద్దరినీ హెచ్చరించి అతడు బయట కచేరీవైపు తననౌకర్లు, కాపలా సైనికులు ఉన్న చోటుకు పరుగెత్తాడు.

మాధవుడు మాతంగిని బుద్ధిని ప్రశంసిస్తున్నాడు. ఆమె యందు పూజ్యభావము కలిగింది. ఈ విషయంలో మాతం గిని తనను మోసం చేయలేదని కూడా అతనికి నమ్మకం కలి గింది. మోసం చేయదలచినట్లయితే ఇంత రాత్రివేళ ఒంట రిగా ఇక్కడికి ఎందుకు వస్తుంది? కనుక రాబోయే దొంగ లను ఎదుర్కొనుటకు అతడు తగిన సన్నాహాలు చేయసా గాడు. చీకట్లు వ్యాపించకముందే భవనం మీద అటూ

ఇటూ కదులుతున్న మనుష్యుల నీడలు కదులుతున్నాయి. జమిందారు మాధవఘోషు తమ రైతులనుంచి ఎన్నిక చేసిన వీరులు వాళ్ళు. ఆభవనం చుట్టుపట్లనే వారి నివాసము. కర్ర సాము నేర్చిన ఈ ఆసాములు ఏక్షణంలోనైనా సహాయానికి సిద్ధంగా ఉంటారు. దొంగలు భవనం వద్దకువచ్చి లోనికి జొరబడునప్పుడు ఎదుర్కొని తరిమి వేయటానికి వారు లాఠీలు, బల్లెములు మొదలగునవి ధరించి సిద్ధముగా నిలబడి ఉన్నారు. ఉత్తర ప్రదేశ్ కి చెందిన అయిదారుగురు సైనికులు కత్తి, ఢాలు, బల్లెము, పాత తుపాకులు ధరించి సింహద్వారంలో కాపలా కాస్తున్నారు. మరి నలుగురైదుగురు జాగ్రత్తగా చుట్టూ పరిశీలిస్తూ తిరుగుతున్నారు. ఏమాత్రం అనుమానము కలిగినా హెచ్చరిక చేయవలసిందని మాధవుడు వారికి ఆజ్ఞాపించాడు. వెండి బంగారాలు, విలువైన ఆభరణాలు, డబ్బు మొదలగునవి ఉన్న పెట్టెలను, వీలునామా ఉన్న దంతపు పెట్టెను ఎక్కడో దాచేశారు. అది చాలా విశాలమైన భవనము, దానిలో అనేక గదులున్నాయి. యావత్తు సంపదను ఆ గదులలోనే దాచాడు. వాటిలోనికి వెళ్ళే రహస్య మార్గాలు, ఆ గదులలోఉన్న రహస్య ప్రదేశాలు ఇతరులకు తెలియవు. ఆ భవనంలో నివసించేవారికి కూడా వాటిని గురించి తెలియదు.

మాధవుని స్వభావము సహజముగా కోమలమైనది. చాలా నమ్రతగా వ్యవహరిస్తాడు. కానీ ఏదైనా కారణంవల్ల ఉద్రేకపడితే అతనిని అప్పుడు చూడాలి; అతడు చాలా

చురుకుగా పట్టుదలగా పనిలో నిమగ్నమవుతాడు. ఆ స్థితిలో అతనిని చూస్తే ఎలాంటి వారికైనా భయం కలుగుతుంది. భవనంలో నివసించే దాసీలు నగ్నంగా ఉన్న పిల్లల్ని, పెద్ద పెద్ద మూటల్ని ఈడ్చుకుంటూ ప్రక్కనేడున్న పాకలలోకి వెళ్ళి తల దాచుకోసాగారు. పాకల లోనికి దొంగలు రారని తిను సామాగ్రి జాగ్రత్తగా ఉంటుందని వారి ఆశ. నిన్న సాయంత్రము నేతికోసము తగాదాపడిన వంటమనిషి వెళుతూ వెళుతూ నేతిగిన్నెను తీసుకు వెళ్ళటం మర్చిపోలేదు.

ఉద్యోగ పర్వపు తీవ్ర కోలాహలము శాంతించిన తరువాత ఏర్పాట్లన్నీ పూర్తికావించి అందరూ గాబరాగా దొంగల రాకకై ఎదురుచూస్తున్నారు. చంద్రుడు అస్త మించాడు. సమయం గడుస్తున్న కొద్దీ మాధవునికి మాతం గిని మాటలమీద నమ్మకం తగ్గిపోసాగింది. ఆ సందేహము అతని మనస్సులో ఒక నిశ్చిత రూపం పొందకముందే కాప లాకు నియమించిన వారిలో ఒకమనిషివచ్చి ఊరికి దూరంగా ఉన్న మామిడి తోటలో ఏదో వెలుగు కన్పించిందని చెప్పాడు. మాతంగిని దొంగలకు చిక్కకుండా తప్పించు కున్నది అక్కడే. ఆ మనిషి ధైర్యముచేసి తోటవరకువెళ్ళి చూచి వచ్చాననీ, అక్కడ అనేకమంది ఆయుధాలు ధరిం చిన దొంగలు ఉన్నారనికూడా మాధవునితో చెప్పాడు.

"దొరా, తమరు ఆజ్ఞాపిస్తే మేమే ముందుగా ఆ దొంగలమీద దాడి చేస్తాము" అని చెప్పాడు ఆ మనిషి.

"భూపసింహా, ఆ పని చేయవద్దు. మీరు కొద్దిమంది అక్కడికి వెళితే వాళ్ళను ఎదుర్కోవటం కష్టం కావచ్చు.

మీరు అందరూ అక్కడికి వెళితే ఇక్కడ భవనం వద్ద ఎవరూ ఉండరు. దొంగలు కొంతమంది ఒక జట్టుగా చీలి మరొకచోట ఎక్కడైనా దాగి వుండవచ్చును."

"చిత్తం! అయితే ఇప్పుడు మమ్మల్ని ఏమి చేయమని శలవిస్తారు?"

"ఎక్కడ ఉన్నవారు అక్కడే అప్రమత్తులై ఉండండి. మేము సిద్ధంగా ఉన్నామని దొంగలను సవాలు చేస్తూ మీరందరూ ఒక్కుమ్మడిగా కేకలు వేయండి."

మాధవుడు ఆ మాట చెప్పగానే వారి ప్రచండ గర్జనతో వాయుమండలము ప్రతిధ్వనించింది. గదులలో వున్న స్త్రీలు ఆ గర్జనవిని భయకంపితులయ్యారు. త్వర లోనే ఆపద ముంచుకు రానున్నదని కూడా గ్రహించారు ఆ గర్జన తరువాత తిరిగి నిశ్శబ్దం ఆవరించింది.

"మరొకసారి—మరొకసారి" అంటూ మాధవుడు వారిని రెట్టించాడు.

మళ్ళీ అలాంటి గర్జనతోనే నిశ్శబ్ద నిశీధి కంపించింది. ఇంతలో అటు నిర్జనమైదాన ప్రదేశమునుండి అర్ధరాత్రి గాఢాంధకారములో పిశాచాలు వికటాట్టహాసము చేసినట్లుగా హృదయ విదారకమగు కేకలు విన్పించాయి. అటునుంచి వచ్చిన ఆ ఆర్తనాదము వినగానే శ్రోతల రక్త సంచారము ఆగిపోయింది.

"మళ్లీ, మరొకసారి సవాలు చేయండి! సిద్ధమేనని ఎలుగెత్తి చెప్పండి" అంటూ మాధవుడు తన మనుష్యుల్ని ఉత్సాహపరుస్తున్నాడు. దొంగల కేకలు విని తన మను

ష్యులు భయపడతారేమోనని ఆలోచించి మాధవుడు వారి వెనుకనే ఉండి ఉత్సాహ పర్చసాగాడు. యజమాని ఇచ్చే ఉత్సాహముతో కేకలు వేయసాగారు. ఈసారి వారికి అటు నుంచి జవాబు విన్పించలేదు. దొంగలు పారిపోతున్న కేకలు విన్పించాయి.

"పారిపోతున్నారు—దొంగలు పారిపోతున్నారు –" అంటూ మాధవుని మనుష్యులు కేకలు వేయసాగారు.

"వాళ్ళు పారిపోయారని మీరు అజాగ్రత్తగా మాత్రం వుండవద్దు. ఎక్కడి వాళ్ళక్కడే ఉండండి" అని మాధవుడు హెచ్చరించాడు.

మాధవుడు, అతని అనుచరులు చాలాసేపటివరకు ఎదురు చూచారు. కానీ, ఎవరూ రాలేదు. రాత్రింతా అప్రమత్తులై కాపలా ఉండమని హెచ్చరించి మాధవుడు తనను ఈ ఆపదనుండి కాపాడిన స్త్రీకి ధన్యవాదాలర్పించ టానికి అంతఃపురమువైపు వెళ్ళాడు.

# 9

మాధవుడు తనభార్య, మాతంగిని ఉన్న గదిలోకి వెళ్ళాడు. అతడు మాతంగిని నుద్దేశించి "ఇవాళ మీరు నాకెంతో ఉపకారం చేశారు. జీవితాంతం మీరు చేసిన మేలు మర్చిపోలేను" అని అన్నాడు.

హేమాంగిని హృదయంలోని భయ సందేహాలన్నీ భర్తను చూడగానే తొలగిపోయాయి. ఇప్పుడు ఆమెకు

ధైర్యం వచ్చింది; భర్తను, అక్కను అక్కడే వదలి ఆమె గదిలోనుంచి బయటకు వెళ్ళిపోయింది. మాధవుడు తిరిగి మాతంగినితో "ఇవాళ మీరు నాకు చాలా ఉపకారం చేశారు" అని అన్నాడు.

అప్పుడు మాతంగిని యిలా అంది – "దానిని మర్చిపోలేనట్లయితే హేమకోసము మనస్సులోనే ఉంచుకో, ఎప్పుడైనా హేమమీద మీకు కోపం వస్తే నేను అనుభవించే బాధల్ని గుర్తుచేసుకొని ఆమెను క్షమించండి. అలా జరగకూడదనే భగవంతుణ్ణి వేడుకొంటున్నాను. ఇక నా విషయానికివస్తే నేను ఈపని చేయక తప్పదు. యిప్పుడీ విషయాలన్నీ అనవసరం. నేను వెళతాను."

"అదేమిటి దీదీ? హేమ మిమ్మల్ని చూచి ఎంతో కాలమయింది.మీతో కలిసిఉండటం ఆమెకు చాలా సంతోషంగా ఉంటుంది. రెండుమూడు రోజులు ఉండకపోయినా ఉదయం వరకైనా ఉండండి. ఉదయం పల్లకీలో మిమ్మల్ని యింటికి పంపుతాను. ఈరాత్రికి రాత్రే యింటికి వెళ్ళవలసిన అవసరం ఏముంది?"

"నా రాత! నాకు అంత అదృష్టం కూడానా? నేను వెళ్ళవలసిందే!"

"విషయం ఏమిటి దీదీ? నాతో చెప్పకూడదా?"

సిగ్గు దుఃఖము వలన వ్యాకుల పడుతూ మాతంగిని "వారు—వారిసంగతి నీకు తెలుసు నేను యిక్కడఉంటే వారికి కోపం వస్తుంది–" అని మాత్రమే చెప్పింది.

"చెల్లెలి ఇంటివద్దఉంటే వారికి కోపం వస్తుందా? వెంటనే తిరిగి వస్తానని మీరు ఒట్టువేసుకొని వచ్చారా? మీరు ఎక్కడ వున్నారో వారికి తెలుసునా?"

"తెలియదు. నేను ఒట్టువేసుకొని రాలేదు. నేను బయలుదేరి వచ్చిన సంగతికూడా వారికి తెలియదు."

"అయితే ఆశ్చర్యంగానేఉంది. నాకేమీ అర్థం కావటంలేదు. మీరెలా వచ్చారు? మీరు వచ్చినప్పుడు వారు ఎక్కడ ఉన్నారు?"

"ఆ విషయాలేవీ నన్నడగవద్దు."

ఈ సమాధానము విని ఒక క్షణకాలం మాధవుని మనసులో ఏదో సందేహం కలిగింది—తరువాత కొద్ది క్షణాల వరకు అతడేదో ఆలోచిస్తూ వుండిపోయాడు. మాతంగిని రెప్పవేయకుండా మాధవుని ముఖంలోకి చూడసాగింది.

చివరకి ఆమే మాట్లాడింది—"వద్దు, నేను వుండటం వల్ల ఏమీ లాభం లేదు. నేను వెళుతున్నాను. కరుణను నా వెంటపంపు."

ఆమె కంఠస్వరము గాబరా పడుతున్నట్లుగాఉంది — "నేను వెళుతున్నాను! వెళుతున్నాను మాధవ్! నువ్వు సుఖంగాఉండు" అని అంది మాతంగిని.

"దీదీ, నువ్వు ఏడుస్తున్నావా? ఏం జరిగింది?"

మాతంగిని సమాధానం చెప్పలేదు—ఏడ్వసాగింది. కొద్దిసేపటికి దుస్సహమగు హృదయావేదనతో పిచ్చెత్తినట్లు అకస్మాత్తుగా ఆమె మాధవుని చేతులు పట్టుకొని నొక్కుతూ

కమలపుష్పమువంటి తన ముఖమును అతని చేతులమీద ఆనించింది. నిష్కళంకమగు మాతంగిని కోమల లలాట స్పర్శతో మాధవునికి ఏదో మత్తులాంటిది ఆవరించినట్లయి కంపించాడు. ఆమె కన్నీటి ప్రవాహము అతని రెండు చేతు లను తడిపివేసింది.

"నన్ను ద్వేషించవద్దు—నన్ను ద్వేషించవద్దు" అని ఆమె ఆవేశంతో అంది. ఆవేశం అధికమై పుష్పము లాంటి ఆమె సుకుమార దేహము కంపించ సాగింది. అదే స్థితిలో ఆమె తరువాత ఇలా అంది—"నాలోని ఈ బల హీనతను నన్ను ద్వేషించవద్దు. మాధవ్, మనం కలుసు కోవటం ఇదే ఆఖరుసారి కావచ్చు. కానచ్చునేమిటి, యదా ర్థముకూడా అంతే. అందుకనే నేను నిన్ను హృదయపూర్వ కంగా ప్రేమించాననీ, ఇప్పటికీ నిన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాననీ, ఆఖరుక్షణంలో నీతో చెప్తున్నాను. అందుకనే శాశ్వతంగా నీ వద్ద శలవు తీసుకొని వెళ్ళటానికి బాధగా ఉంది."

మాతంగిని లోని ఈ బలహీనతను చూచి మాధ వుడు ఆమెను తిరస్కరించాడా? లేదు. అతడు అలాంటి పని చేయలేదు. అతడు రెండు చేతులతో ముఖము కప్పుకొని కూర్చున్నాడు. అతని అరచేతులు కన్నీటితో తడిసి పోయాయి. కొద్దిక్షణాల వరకు ఇద్దరూ మౌనంగానే ఉండి పోయారు—ఇద్దరి హృదయాల స్పందన స్పష్టంగా విన్పించ సాగింది. అకస్మాత్తుగా ఆవేశములో సర్వమూ మరచి

పోయిన మాతంగిని మళ్ళీ వెంటనే తనను తాను నిగ్రహించుకుంది.

దూర దూరంగా ఉండటం, సంకోచము, మనస్సులోని విషాదము, భగ్నహృదయము యొక్క హాహాకారము! ఇవన్నీ ఇంతకుముందు మాతంగినిని ఆవరించి ఉన్నాయి. ఇప్పుడవన్నీ లేవు. వ్యాకులతతో అకస్మాత్తుగా వ్యక్తమైన గంభీర ప్రేమలో కలిగిన ఆవేశము, వ్యాకులత కూడా శాంతించాయి. మాతంగిని ప్రశాంతంగా నిశ్చల భావంతో నిలబడి ఉంది. సహజంగా ఎప్పుడూ విచారంగా ఉండే ఆమె ముఖమండలము ఏదో అవ్యక్త భావావేశము వల్ల దీప్తివంతముగా కన్పించసాగింది.

మధురమగు ప్రశాంత గంభీర్యము ఆమె సుకుమార అవయవములలో వ్యాప్తమై ఉంది. కానీ ఆ గాంభీర్యము అమితమగు ఆనందానుభూతి వలన మాత్రము కాదు. హృదయములోని ఆవేశము ప్రచండమగు వెల్లువవలె ఆమెను న్యాయన్యాయ విచక్షణ తెలియని ప్రస్తుత అనిర్వచనీయ సుఖమనే ఉన్మాదములోనికి తెచ్చి పడేసింది; తాత్కాలికమగు ఆ క్షణాలుతప్ప మరేమీ కన్పించదు. కేవలము మాతంగిని మాధవుడు దగ్గరగా ఉన్నాడనే మధురానుభూతిని పొందుతూ వుంది. ఎంతో కాలంగా ఆపుకున్న కన్నీరు మాధవుని చేతులమీద కురిసింది, ఇదే—ఆమెకు యిదే పదివేలు. తనతోపాటు మాధవుడుకూడా కన్నీరు కురిపించాడు !— ఈ అనుభూతే మాతంగిని మనసు

సంతృప్తి నిచ్చింది. ఒక క్షణకాలం. కళంకిత ఆనంద తరంగాలలో ఆమె హృదయము తేలిపోయింది. ఆమె చేసేపని అనుచితమయినప్పటికీ ఒక క్షణకాలం మాధవుణ్ణి కలుసుకునే ఆనందములో తన పవిత్రతకు భంగము కలుగకుండా ఆమె కర్తవ్యము, ధర్మము, నీతి మొదలగునవన్నీ మర్చిపోయింది. అభిలాషతో కూడిన ఆమె దృష్టిలో ఒక జ్వాలఉంది – చంద్రబింబమువంటి లలాటముతో ఒకజ్యోతి ఉంది. ఆమె సోఫామీదికి వంగి నిలబడిఉన్న తీరునుచూచి యింతకంటె మించి కన్నులు మిరుమిట్లు కొల్పు స్త్రీ సౌందర్యము ప్రపంచములో ఎక్కడ ఉంటుంది అనిపించింది మాధవునకు.

ఆవేశమువలన అతని కంఠస్వరము కంపిస్తూఉంది – "నా మనసులోని సంగతి ఎన్నటికీ మరొక మనిషికి తెలియకూడదనే నేను ఆలోచించాను – నీతో కూడా చెప్పను, కానీ నేను దానిని అణచుకొని దాచి ఉంచలేకపోయాను. నా మనస్సులో ఏమిజరుగుతుందో నాకే తెలియదు" అని అన్నాడు మాధవుడు.

ఆవేశముతో మాతంగిని తన ప్రేమను వ్యక్తము చేసిన తరువాత మాధవుడు మాట్లాడినది ఇప్పుడే.

"మాతంగినీ, ఇలాంటిదేమీ లేకుండానే నువ్వు వెళ్ళిపోతావని ఆలోచించాను. కానీ–నువ్వు–" తరువాత మాధవుడు మాట్లాడలేక పోయాడు.

"మాతంగినీ, నిన్ను నేను అర్థం చేసుకోగలను; నువ్వు చాలా సహించావు – ఎంతో త్యాగం చేశావు.

మరొకసారి ప్రయత్నించు. ఇదే ఆఖరుసారి అనుకో, నిష్కళంకమగు నీ హృదయంనుండి ఆ భావాన్నే తొలగించుకో, అంతా మర్చిపో మాతంగినీ, అంతా మర్చిపో" అంటూ మాధవుడు దుఃఖించసాగాడు.

"లేదు, లేదు, నువ్వేమీ చెప్పవద్దు" అంటూ మాతంగిని తనమాటలను తానే ఖండించటానికి ప్రయత్నించింది. తలవంచుకొని పొంగిపొర్లే కన్నీటి ప్రవాహాన్ని ఆపుకుంటూ ఆమెఇలా చెప్పింది — "మాధవ్, నువ్వునన్ను నిందించు, తిరస్కరించు—నాకు ఉపదేశించు, నేను పాపాత్మురాలను, నేను పాపం చేశాను. భగవంతుని ఎదుట నేను అపరాధం చేశాను. మాధవ్, నన్ను పూర్తిగా చెప్పనివ్వు. ఈ భూమి మీద నా ఈశ్వరుడనేవాని ఎదుట నీఎదుట నేను అపరాధినినే. నన్ను నేను ద్వేషించుకున్నంత కాలం నుంచి నేనెంత సహించానో ఆ భగవంతునికే తెలుసు. హృదయాన్ని చీల్చి చూపించగలిగితే నా హృదయంలో ఏమి జరుగుతుందో నువ్వే చూడగలుగుతావు."

మాధవుడు ఏడ్చాడు. ఏడుస్తూ—"మాతంగినీ, ప్రియా ..."అతడు మాటను పూర్తి చేయలేకపోయాడు.

"మాధవ్, ఏదీ—ఆ మాట మళ్ళీ అను. ఆ మాట వినటానికే ఎంతోకాలంగా నిరీక్షిస్తున్నాను. ఆ మాట మళ్లీ ఒకసారి అను. ఇప్పటికీ నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా? ఏదీ—ఆ మాటే మళ్ళీ ఒకసారి చెప్పు. అది విని ఈ రాత్రికే నవ్వుతూ మృత్యువును ఆహ్వానిస్తాను."

తనను తాను నిగ్రహించుకోటానికి వ్యర్థ ప్రయత్నం చేస్తూ మాధవుడు యిలా అన్నాడు—"మాతంగినీ, నన్ను క్షమించు ఈ దారుణ దుఃఖమును నేనిక భరించలేను. నీ ఇంటిలోనే నా హృదయంలో ఈ అగ్ని రగిలింది. మనిద్దరమూ ఈ అగ్నికి ఆహుతి కావలసిందేనేమో! అప్పుడు మనిద్దరము చిన్నవాళ్ళము; ప్రారంభములో ప్రయత్నించినప్పటికీ ఈ అగ్ని చల్లారేదికాదు. అలాంటి సమయంలో ఆనాడు కూడా మనము మన కర్తవ్యమునుంచి చలించలేదు. ఇప్పుడో—ఇంతకాలమునుండి అనేక దెబ్బలు తిని తిని మన హృదయము గట్టిపడింది. ఇప్పుడు మనము పొరపాటు చేస్తామా? మనస్సులోనుంచి ఆ పాపాన్ని తొలగించుకో మాతంగినీ. మనిద్దరమూ ఒకరినొకరు మర్చిపోదాము—దూర దూరంగా ఉందాము."

మాధవుడు దీర్ఘంగా నిట్టూర్చాడు.

మాతంగిని తిన్నగా నిలబడింది—ఆమె దేహములో నూత్న రూపమేదో ప్రకాశించింది. తన మనస్సుతో గట్టిగా ఘర్షణపడుతూ చివరికి ఆమె ఇలా అంది—అలాగే, అలాగే చేద్దాం. ప్రయత్నించినంత మాత్రాన మానవుని మనస్సు మర్చిపోగలిగినట్లయితే నేను కూడా మర్చిపోతాను—నిన్ను మర్చిపోతాను. ఇటురా, మాధవ్! మనిద్దరమూ శాశ్వతంగా శలవు తీసుకుందాము."

మాతంగిని కంఠస్వరములో ఒక భయంకర శాంత భావము వ్యక్తమవుతూ ఉంది.

ఎంతగా ప్రయత్నించినా ఆమె కన్నీటిని ఆపుకోలేక

పోయింది. తన కన్నీటిని మాధవుడు చూడకుండా ఉండాలని నెత్తిమీది ముసుగును మరింత ముందుకు లాక్కొని గబ గబ గదిలోనుండి బయటకు వెళ్ళిపోయింది.

## 10

తెల్లవారడానికి ఇంకా అప్పటికి గంట సమయముండుంది. విషాద హృదయంతో, ఆ అరణ్య మార్గానే మాతంగిని భారంగా అడుగులువేస్తూ బయలుదేరింది. కరుణ మెదలకుండా ఆమె వెనుకనే నడుస్తూఉంది. నక్షత్ర ఖచిత మలిన నీలాకాశములో అటునీటు పరుగులెత్తే చిన్నచిన్న మబ్బులు సగభాగము వ్యాపించాయి. ఒక నల్లని కారుమేఘము దూరాన క్షితిజములో తేలుతూవుంది. దానియొక్క నల్లని నీడపడి దూర దూరాన ఛాయామాత్రముగా కన్పించు వృక్షములు నల్లగా కన్పిస్తున్నాయి. అంధకారము వలన నల్లగా కన్పించే అరణ్యము మీదుగా మధ్యమధ్య దారితప్పినట్లుగా చంచల వాయువు అశుభ ఆర్తనాదమువంటి శబ్దము కలిగిస్తూఉంది. అప్పుడప్పుడు భూమిమీద చెట్ల ఆకులమీద నాలుగైదు చినుకులు పడి విచిత్ర శబ్దసృష్టి చేస్తున్నాయి. మాతంగిని ఏవేవో ఆలోచనల్లో మునిగి వున్నందువల్ల ప్రకృతియొక్క భయంకర రూపాన్ని చూచే అవకాశం లేకపోయింది. తన చుట్టూవున్న ప్రకృతి దుఃఖభారంతో అణగి ఉన్నదని మాత్రమే ఆమె అనుకుంది. నిషిద్ధమయినప్పటికీ ఆమె మనస్సులో ఆకాంక్షఉంది. ఆ కలయిక యొక్క మధురస్మృతి ఆమె మనసులో ఉండిఉంది. యింటికి చేరుకోగానే ఇంటిలోని వాళ్ళు ఎలా వ్యవహరిస్తారు అని గానీ,

కసురుకుంటా రేమోననిగానీ, దీనిని గురించి భర్తకు తెలిస్తే తాను ఆపదలో చిక్కుకుంటాననిగానీ ఆమె ఆలోచించటం లేదు. ఆమె మనసులో తాను మాధవుణ్ని కలుసుకున్న మధుర స్మృతి మాత్రమే మెదులుతూ ఉంది. తాను అతనిని మరచి పోతానని మాతంగిని మాధవునికి వాగ్దానము చేసింది. కానీ మాధవుని వద్దనుంచి లేచిరాగానే ముందుగా ఆమె ఆ స్మృతినే పూజించ సాగింది. మాధవుడు మాట్లాడిన మాటలలోని ఒక్కొక్క అక్షరమును స్మరించుకొని స్వప్న లోకములో విహరించసాగింది. మాధవుని కన్నీటిని తలచు కొని ఆమెకు పిచ్చెత్తినట్లుంది. దానితోపాటు క్షణక్షణమూ ఆమె మనసులోని ఈ పిచ్చిని తొలగించి తనమానసిక పాప ము ను గుర్తు చేసుకొని వ్యాకుల పడసాగింది.

ఇదే స్థితిలో ఆమె కొంచెము దూరము వెళ్లేసరికి ఆకాశములో నల్లని మేఘాలు ఆవరించాయి. అది చూచి స్త్రీలిద్దరూ గాలిదుమారము వాన రానున్నాయని అర్థం చేసుకున్నారు ఇంతవరకు మౌనంగా ఉన్న దాసి కరుణ;

"అమ్మగారూ, త్వరగా నడవండి. గాలిదుమారము వస్తుంది. వానకూడా వచ్చేట్లుంది. త్వరగా మనము ఇంటికి చేరుకోవాలి" అని అంది.

పరధ్యానంగా ఉన్న మాతంగిని "అలాగే" అని అంది.

కరుణ త్వర త్వరగా నడవసాగింది. మాతంగిని ఏమీ ఆలోచించకపోయినా కరుణను చూచి తాను కూడా గబ గబ నడవసాగింది.

మరికొంత ముందుకు వెళ్ళిన తరువాత "చూచారా, పెద్ద పెద్ద చినుకులు ప్రారంభమయ్యాయి" అని అంది కరుణ.

స్వప్నలోకంనుంచి మేల్కొన్నట్లు "చినుకులు ప్రారంభమయ్యాయా?" అని అడిగింది మాతంగిని. తరువాత వొక క్షణం ఆగి "కాదు కాదు. అది వర్షపు చినుకుల శబ్దం కాదు" అని అంది.

"అయితే ఆ శబ్దం ఏమిటంటారు?"

"అది మనుష్యుల అడుగుల చప్పుడు. ఒక మనిషి గాని, ఎక్కువమందిగానీ, యెండుటాకుల మీద నడుస్తున్నారు."

"అంతే నంటారా అమ్మగారూ?" అంటూ కరుణ భయంతో కేక వేసింది.

ఈ మాట అని ఆమె నడక వేగాన్ని హెచ్చించింది.

ఆలస్యమయితే, ఆ పరివారములలోనే తిరుగుతున్న దొంగల చేతికి చిక్కవచ్చునని ఆలోచించి కరుణ భయ కంపితురాలయింది.

కానీ ఆ స్త్రీలు యెంతో దూరం వెళ్ళలేకపోయారు. గాలి ఆగ్రవేశంతో వీచినట్లు తీవ్రమయింది, ఉరుములతో ఆకాశము బ్రద్ధలయినట్లుంది. కన్నులు మిరమిట్లు గొలుపుతూ మెరుపులు, పెద్ద పెద్ద చినుకులు పడసాగాయి.

"ఈ వర్షానికి ఇవాళ ప్రాణం పోయేట్లుంది. చెట్టు క్రింద నిలబడదామా అమ్మగారూ!" అని అడిగింది కరుణ.

"సరే, పద"

దట్టంగా వున్న ఒక పెద్ద చింతచెట్టు క్రిందికి చేరుకోవాలని మాతంగిని రెండడుగులు ముందుకు వేసింది. కాని సరిగా అదే సమయానికి మెరుపు మెరిసింది. వారికి కొద్ది దూరంలోనేఉన్న ఆచెట్టుక్రింద నిలబడిన ఒక మనిషిని వారా మెరుపు కాంతిలో చూడగలిగారు.

"పరుగెత్తండి, పారిపొండి" అంటూ భయకంపితురాలైన కరుణ జవాబుకుకూడా ఎదురుచూడకుండా ప్రాణభయమే ఎరుగని స్థితిలోఉన్న మాతంగిని చేతిని పట్టుకొని యింటివైపు పరుగెత్తింది. గాలిదుమారముతో కూడిన వర్షములో పరుగెత్తుతూ కరుణ మాటిమాటికి "పరుగెత్తండి, పరుగెత్తండి" అంటూ కేకలు వేయసాగింది. ఇంటిముందుకు చేరేవరకు కరుణ మాతంగినిని ఈడ్చుకుంటూ పోయిందనే చెప్పాలి. అదృష్టవశాత్తు దగ్గరగానే వున్నందువల్ల త్వరలోనే ఇంటికి చేరుకున్నారు.

ఇంటి ఎదుటకు చేరుకోగానే మాతంగిని కరుణతో ఇలా చెప్పింది—"కరుణా, ఇక నువ్వు వెళ్ళిపో. రాత్రివేళ ఇప్పటికిప్పుడే నిన్ను తిరిగి వెళ్ళమని చెప్పటం మంచిది కాదని నాకు తెలుసు, కాని నువ్వు ఉన్నందువల్ల మరింత కీడు కలుగుతుందని భయంగాఉంది. వర్షంలో నువ్వు వెళ్ళటం కంటె ప్రక్కనే ఉన్న కనకమయి ఇంటికి వెళ్ళు. వారింటి వసారాలో పడుకొని వర్షము తగ్గి వెలుగు రాగానే నిన్నెవరూ చూడకుండా లేచివెళ్ళు."

కరుణను సాగనంపి మాతంగిని లిస పడకగది ముందుకు వెళ్ళింది. తలుపులు మూసేవున్నాయి. మాతంగిని

ఎప్పటివలె గడియతీసి మెదలకుండా లోనికి వెళ్ళిపోయింది తరువాత ఆమె తలుపు మూయుటకు వెనక్కి తిరిగింది. అప్పటికే ఆమె వెనుకనే ఒక మనిషి లోనికివచ్చి తలుపు మూశాడు. అతని నడకనుచూచి వచ్చిన మనిషి భయంకర నరపిశాచముగు రాజమోహనుడేనని పోల్చుకుంది.

రాజమోహనుడు ఏమీ మాట్లాడలేదు. చీకటిలోనే తడిమి దీపం వెలిగించాడు. అప్పటికీ అతడేమీ మాట్లాడ లేదు. మంచము మీద కూర్చుని క్రూర దృష్టితో మాతంగినిని చూడసాగాడు. అతని చూపులోని క్రూరత్వమును చూచి తనస్థితి ఏమి కానున్నదో మాతంగిని అర్థం చేసుకో గలిగింది. ఆమె భయకంపితురాలు కాలేదు. సగర్వంగా దృఢభావంతో నిలబడి ఉంది. ఆమె దేహములో తీక్ష్ణమైన సౌందర్య సాహసాలు మూర్తీభవించాయి. ఆ రోజు సాయంత్రము వాటిని చూచే రాజమోహనుని కోపమంతా మంత్రించినట్లు మాయమయింది. బయట గాలిదుమారపు హోరు, వర్షంకురుస్తున్న చప్పుడు. మధ్య మధ్య మేఘాల గర్జనలు గదిలోని నిశ్శబ్దాన్ని భంగపరుస్తున్నాయి.

చివరికి రాజమోహనుడు మాట్లాడాడు.

"భాగ్యహీనురాలా!" అని అన్నాడు.

అతని కంఠస్వరం తీవ్రంగా ఉన్నప్పటికీ సాధారణంగా ఎప్పుడూ కఠిన స్వభావం కలవాడే కావటం వలన అతని మాటలలో ఉండే కర్కశత్వము ఇప్పుడు కన్పించ లేదు.

"భాగ్యహీనురాలా, మిత్రుని వద్దకు వెళ్ళావా ?" అని అడిగాడు తిరిగి.

మాతంగిని ఏమీ జవాబు చెప్పలేదు. రాజమోహనుడు కాలితో నేలను తన్నుతూ భయంకర గంభీర కంఠ స్వరంతో "మాట్లాడవేం ? జవాబు చెప్పు" రెట్టించాడు.

సగము దోషి, సగము నిర్దోషియగు మాతంగిని "ఈ విషయాలు వేటికీ నేను జవాబు చెప్పను." అని అంది.

రాజమోహనునికి పిచ్చెత్తినట్లయింది. పళ్ళు పటపట నూరుతూ "దుర్మార్గురాలా, జవాబు చెప్పవా !" అని గద్దించాడు.

తరువాత వెంటనే తనను తాను నిగ్రహించుకొని "ఇవాళ రాత్రి నువ్వు మాధవఘోషు ఇంటికి వెళ్ళావా; లేదా ?" అని ప్రశ్నించాడు.

మాధవుని పేరు వినగానే మాతంగిని భావము మారిపోయింది. ఉన్నట్లుండి ఆమె ఉద్రేకపడి "అవును, వెళ్లాను. మీరు అతని ఇంటిలో దొంగతనము చేయాలనుకున్నారు, అందుకే నేను అతనిని కాపాడాలని వెళ్ళాను" అని జవాబు చెప్పింది.

రాజమోహనుడు పిడికిళ్ళు బిగించి మంచం మీది నుంచి ఎగిరి దూకాడు. మేఘ గర్జనవలె అరిచాడు_"చూడు, నువ్వు నన్ను మోసగించలేవు. నిన్ను నేను ఏవిధంగా కాపలా కాస్తున్నానో నీకు తెలియదు. నీ అందమే నీపాలిట

శాపమని తెలిసిన నాటినుండి నిన్ను వేయి కళ్ళతో కనిపెట్టి ఉంటున్నాను. నీ పనులేవీ నాకు తెలియవని అనుకోవద్దు."

అకస్మాత్తుగా అతడు కొంచెం శాంతించి ఈ విధంగా చెప్పసాగాడు – "నేను ఒక జంతువునే కావచ్చు, నాలో మానవత్వము కూడా లేకపోవచ్చు, కానీ నా భార్య అందమైనదని గర్వించే వాడిని. ఆడుపులి తనబిడ్డను కనిపెట్టి ఎప్పుడూ కాపుదల ఉన్నట్లే అనుక్షణము నిన్ను గమనిస్తూనే వున్నాను. నేను చూడనిదేముంది, అన్నీ చూస్తూనే ఉన్నాను. యుక్తవయస్సు రాకముందే నువ్వు, నీచుని ప్రేమలో చిక్కుకున్నావు–క్రమంగా అదే నీ పాలిట పాపమయిందని నాకు తెలియదా ? ఏం, నమ్మకం లేదా ? ఇవాళ సాయంత్రం ఆ వేశ్య – ఆ విధవ కనకం వచ్చి పిలవగానే ఎవరితోనూ చెప్పకుండా ఇంటిలోనుంచి బయటకు వెళ్ళిపోయావు, అప్పుడు కూడా నేను నీ వెనుకనేవుండి నీ చర్యలు కనిపెడుతూనే ఉన్నాను–ఇప్పటికైనా తెలుసుకో ! నువ్వు ఆమె వెంట వెళ్ళావా; లేదా? ఆతోట ఎదుటకు వెళ్ళగానే నువ్వు కావాలని పాపపు తలంపుతో ముఖము మీది ముసుగును తొలగించలేదా ? ఇవాళ రాత్రి ప్రియుణ్ని కలుసుకోవచ్చుననేగదా నువ్వు కోరినది ? నేను నీ వెనుకనే వచ్చాను. ఒక క్షణకాలం నన్ను తప్పించుకో గలిగావు. ఇప్పుడు విచారించి ఏమి ప్రయోజనం ! కొంచెం జాగ్రత్తగా ఉంటే ఈ విధంగా జరిగేదికాదు. తిరిగివచ్చి చూచేసరికి గదిలోలేవు నువ్వు. ఈ పాపపు పురుగు ఏ పుట్టలో జొరబడిందో గ్రహించలేనా ? నువ్వు వెళ్ళిన మార్గం గుండా

నేనూ మాధవుని భవనంలోనికి వచ్చాను. అప్పటినుండి గాలిదుమారము ప్రారంభమయే వరకు నేను నీ వెనుకనే ఉన్నాను. నువ్వు అపవిత్రమైపోయావు. నిన్నిక బ్రతుక నివ్వను. కత్తికి పదును పెట్టాను. తెల్లవారకముందే నిన్ను చంపేస్తాను."

రాజమోహనుడు మాటలు ఆపేశాడు, అతని కన్నులు నిప్పులు కురుస్తున్నట్లు క్రూరంగా ఉన్నాయి.

నిశ్చలంగా నిలబడివున్న మాతంగిని దేహాన్ని అతడు ఆఖరుసారి చూచాడు. ఈ క్షణిక నిశ్శబ్దములో బయట గాలి దుమారపు హోరు విన్పిస్తూనేఉంది. చివరికి మాతంగిని మాట్లాడింది ఆసమయంలో ఆమె ప్రాణాలకు కూడా తెగిం చింది. ఆమె యిలా చెప్పింది – "మీరు చెప్పినది నిజమే. నేను అతనిని ప్రేమిస్తున్నాను – అతనిని నేను గాఢంగానే ప్రేమిస్తున్నాను. ఆప్రేమ ఎంతోకాలంగా నా హృదయంలో నిండి వుంది. నేను పిచ్చిదానినై పోయాను – అందుకు నేను అంగీకరిస్తున్నాను. నా పరిస్థితి మీరు సరిగా అర్థం చేసుకో లేరు. ఆ ప్రేమోన్మాద స్థితిలో నా నోటినుంచి కొన్ని మాటలు వెలువడ్డాయి; అంతే. అది తప్ప నేను మరే అప రాధమూ చేయలేదు. అదే నా దోషము. నాయందు మీకు నమ్మకం కలుగుతుందా?"

రాజమోహనుడు లేచి నిలబడి "లేదు; నిన్ను చంపి వేస్తాను" అని అంటూ అతడు తన దుస్తులలో దాచిన బాకును తీశాడు.

"అమ్మా, అమ్మా, నాన్నా! ఎక్కడున్నారు మీరు?" మాతంగిని నోటినుండి వెలువడిన మాటలు ఇవే. తరువాత భయంతో తెలివితప్పి పడిపోయింది.

నిర్దయుడగు రాజమోహానుని చేతిలోని పదునైన బాకు మాతంగిని తలమీద మెరుస్తూ ఉంది. మరుక్షణంలో ఆ బాకు కంపించే మాతంగిని గుండెల్లో దిగబడటానికి సిద్ధంగా ఉంది. ఇంతలో అకస్మాత్తుగా ఆ హత్యాకాండకు అంతరాయం కలిగింది.

ప్రక్కనే ఉన్న కిటికీలోనుంచి ఒక భయంకర శబ్దం విన్పించింది. ఏమిటోనని రాజమోహానుడు అటు తిరిగి చూచాడు. కిటికీ తెరుచుకొని నల్లగాఉన్న ఇద్దరు వస్తాదులు లోనికి ప్రవేశించారు. ఇద్దరూ వర్షంలో పూర్తిగా తడిసి పోయారు. దేహమంతా బురదకొట్టుకుంది. జ్యోతుల వలె మెరుస్తున్న కళ్ళనుంచి నిప్పులు కురుస్తున్నట్లుంది.

# 11

లోనికి ప్రవేశించిన ఇద్దరిలో ఒకడు "ఛీ, చండాలుడా! నీ భార్యను నువ్వే చంపుకుంటావా?" అనిఅన్నాడు.

అతడు ఇక్కడికి వచ్చినది సదుద్దేశముతో కాదని అతని ముఖం చూస్తేనే అర్థమవుతుంది. అతని చేతిలోని కత్తి దీపపు వెలుగులో తళుక్కున మెరిసింది.

రాజమోహానుడు కూడా గర్జిస్తూ వచ్చిన మనిషి మీదికి దూకాడు. "మీ రెవరు? దొంగతనానికి వచ్చారా?"

అంటూ గద్దించాడు. అతని చేతిలోని బాకు వారివైపు తిరిగింది.

వచ్చినవారిలో ఒకడు వ్యంగ్యంగా నవ్వి "నెమ్మదిగా మాట్లాడు. అల్లరిచేస్తే మీ ఇంటిలోని వారే నిద్ర లేస్తారు. మిత్రమా, మేము దొంగతనానికి రాలేదు. సరిగా మమ్మల్ని చూడు, గుర్తించగలుగుతావు" అని అన్నాడు.

తరువాత అతడు మాతంగినితో "ఇదుగో అమ్మాయీ! ఒకసారి దీపాన్ని ఇలా తీసుకురా. నీ భర్త తన మిత్రుల ముఖాలను గుర్తుపట్టగలడో, లేదో చూదాం" అని చెప్పాడు.

ఆ సమయంలో మాతంగినికి పూర్తిగ తెలివి తప్ప లేదు. అయినా ఆమెలో లేవగల శక్తి లేదు. ఏదో భయం ఆవహించినట్లు ఆమె అలాగే పడిఉంది. ఆమె జీవితంమీద జరిగిన అనుకోని ఆక్రమణ, అంతలోనే ఆశించని విధంగా కలిగిన అంతరాయము-ఈ రెండూ ఆమె ఆలోచనాశక్తిని హరించి వేశాయి.

"నువ్వు శత్రువువైనా, మిత్రుడవైనా ముందు నా ఇంటినుండి వెళ్ళిపో" అని గద్దించాడు రాజమోహానుడు.

దుస్సాహసియగు ఆగంతకుని ముఖంలో ఒక పైశాచిక హాసం తొంగిచూచింది.

"నువ్వు నిశ్చింతగా నీ భార్యను చంపుకోవచ్చు" అని అన్నాడు ఆగంతకులలో ఒకడు.

రాజమోహానుడు పిచ్చివానివలె అరుస్తూ "నా ఇష్టం

వచ్చినట్లు చేస్తాను. నన్ను ఆపటానికి నువ్వెవరు?" అంటూ అతడు ఆగంతకుని మీదికి దూకాడు.

ఆగంతకుడు మెరుపువలె అతని బాకు పోటును తప్పించుకున్నాడు. మరుక్షణంలో అంతకంటె చురుకుగా అతడు తనచేతిలోని కత్తితో రాజమోహానుని బాకును దూరంగా ఎగరకొట్టాడు. రెప్పపాటులో ఆగంతకుడు తన కబంధ హస్తముతో రాజమోహానుని చేతిని పట్టుకున్నాడు. అంతవరకు రెండో ఆగంతకుడు చూస్తూ నిలబడ్డాడు. అతనితో మొదటి ఆగంతకుడు "భీఖూ, ఆ దీపాన్ని యిలా తీసుకు వచ్చి నా ముఖాన్ని ఇతనికి చూపించు. (రాజమోహానునితో) రాజూ భైయ్యా, ఇతడు ముఖచంద్రుడోయ్! మీ చంద్రవదన ఈ ముఖాన్ని చూచి సంతోషిస్తుంది."

భీఖూ దీపాన్ని తెచ్చి అతని ముఖానికి దగ్గరగా పెట్టాడు.

రాజమోహానుడు విస్మయంతో "సర్దార్ !" అని అరిచాడు.

"అవును సర్దార్, చివరికి ఎలాగైతేనేం గుర్తించావు. మిత్రులు ఇంత త్వరగా స్నేహాన్ని మర్చిపోతారా?" అని అన్నాడు సర్దారు అనే వ్యక్తి.

కాని అంతమాత్రాన కూడా రాజమోహానుని కోపము శాంతించలేదు—"మీరు ఇక్కడికి ఎందుకు వచ్చారు? నా యింటిమీద దండెత్తి రావటంలో మీ ఉద్దేశం ఏమిటి?" అని గద్దించాడు.

"నువ్వు నీభార్యను ఎందుకు హత్య చేయాలనుకున్నావో ముందు జవాబుచెప్పు?" అని అన్నాడు సర్దారు.

"ఆ విషయం మీకు అనవసరం. అడగటానికి మీరెవరు ?—మెదలకుండా ఇక్కడినుండి వెళ్ళిపోవటం శ్రేయస్కరమని మరొకసారి చెపుతున్నాను. సర్దారు గిర్దారు ఏమీ పనికిరాదు. మర్యాదగా వెళ్ళకపోతే తన్ని తరిమేస్తాను" అన్నాడు రాజమోహనుడు.

"నువ్వు నా చేతిలో చిక్కావు; తన్ని తరిమేసేది ఎవరు ?" అని పరిహాసం చేశాడు సర్దారు.

"నా కాళ్ళను కట్టివేయలేదుగదా !" అంటూ రాజమోహనుడు అతనిని గట్టిగా తన్నేసరికి, ఉక్కుముక్కవంటి దొంగల సర్దారు శరీరము రెండడుగులు వెనక్కి తూగింది; రాజమోహనుడు సర్దారు చేతిపట్టునుంచి తప్పించుకున్నాడు.

మెరుపువలె రాజమోహనుడు తన బాకు పడిఉన్న వైపు దూకాడు. అదిచూచి దొంగల సర్దారు "భీఖూ, అతనిని పట్టుకొని బంధించు" అని ఆజ్ఞాపించాడు.

సర్దారు ఆజ్ఞ వినగానే భీఖూ బలమైన చేతులు రాజమోహనుణ్ని పట్టుకొని క్రిందపడవేశాయి. సర్దారు పులివలె లంఘించి. రాజమోహనుని గుండెలమీదికెక్కి కూర్చున్నాడు. బట్టలు ఆరవేసుకునే త్రాటినివిప్పి భీఖూ రాజమోహనుని కాళ్ళు, చేతులు కట్టివేశాడు.

"వంచకుడా, ఇప్పుడు నీ ప్రాణాలు నా చేతిలో వున్నాయి" అన్నాడు సర్దారు అతని గుండెలమీద కూర్చునే.

"అవును. మీరిద్దరు, నేను ఒక్కణ్ని. నేను చేసిన అపరాధం ఏమిటో, మీరిలా ఎందుకు వ్యవహరిస్తున్నారో చెపుతారా?" అని అడిగాడు రాజమోహనుడు.

సర్దారు కన్నులనుంచి నిప్పులు కురుస్తున్నాయి. "విశ్వాస ఘాతకుడా, ఏమిచేశానని అడుగుతున్నావా? మోసం చేశావు. మా షడ్కుణ్ని కాపాడటం కోసము నువ్వు ముందే కబురు పంపలేదా? ఛీ, నీచుడా! నీకు మరణం తప్పదు. నువ్వే కబురు పంపావు" అని సర్దారు గద్దించాడు.

"నేనా? నేను కబురు పంపానా?" అని ఆశ్చర్యంగా అడిగాడు రాజమోహనుడు.

"ఓహో! ఇప్పుడే ఆకాశాన్నుండి ఊడిపడినట్లు మాట్లాడుతున్నావు. నువ్వు చెప్పకపోతే మరెవరు చెపుతారు? నేను తెలివి తక్కువ పనిచేశాను. మా షడ్కునికి వ్యతిరేకంగా మాకునువ్వు సహాయం చేస్తావని నమ్మాను. కానీ నువ్వు తక్కువ వాడివేమీకాదు. మాధవఘోషును గురించి మా ఎదుట నువ్వు మాట్లాడే కబుర్లువిని మోసపోయాను—నిన్ను పూర్తిగా విశ్వసించాను."

రాజమోహనుడు సర్దారు మాటల్ని గట్టిగా వ్యతి

రేకిస్తూ—"నిజం చెపుతున్నారు, నేను కబురు పంపలేదు" అని అన్నాడు. దొంగలసర్దారు స్వభావం రాజమోహనునికి తెలుసు—దయ దాక్షిణ్యాలు ఏకోశానా లేనివ్యక్తి. రాజమోహనుడు ఆపనిని తాను చేయలేదని నచ్చచెప్పాలని మరొకసారి ప్రయత్నించాడు — "నన్ను నమ్మ సర్దార్ ! నేనాపని చేయలేదు. నేను మీవెంటే వచ్చాను, తిరిగివచ్చే వరకు మీతోనే ఉన్నాను; క్షణమైనా మిమ్మల్ని వదలి నేనెక్కడికీ వెళ్ళలేదు గదా !"

"ఇక కట్టిపెట్టు నీ మాటలు. తెలివిగా నాటకం ఆడావు. ఏదో ఇంత చిరుతిండి చేతిలోపెట్టి ఓదార్చటానికి నేనేమైనా పసివాడనా? నీ మాటలు నమ్మటానికి ఏమీ తెలియని అమాయకుడ ననుకుంటున్నావా? చూరు క్రింద నాతో మాట్లాడుతూ మాట్లాడుతూ నీ భార్య నిద్ర పోతుందో లేదో చూచివస్తాన్ని నువ్వు ఒకసారి లోనికి వెళ్ళివచ్చావు గదా? ఈ సంగతులన్నీ నీ భార్యతో చెప్పి ఆమెద్వారా కబురు పంపావని నేను తెలుసుకోలేనంటావా? ఇదీ అబద్ధమే నంటావా? ఆమె వెళ్ళి చెప్పకపోతే మరెవరు చెప్పారు?"

"నాకు తెలియకుండా తన బావగారికి ఈ కబురు చెప్పింది నా భార్యేనని నేనూ అంగీకరిస్తాను.ఆమెను చూడటానికి నేను లోనికి వెళ్ళినప్పుడు నిజంగానే ఆమె నిద్ర పోతుంది. ఇదంతా యదార్థమేనని ప్రమాణం చేసి చెప్పగలను."

సర్దారు అప్పటికీ నమ్మలేదు. తీక్ష్ణంగానే మాట్లాడు తున్నాడు—"నువ్వు చెప్పే అబద్ధాలకు అంతులేదు. ఇక చాలించు. ఇప్పుడు నిన్ను మేము బాగా అర్థంచేసుకున్నాం. సరే, నీకు దురుద్దేశము లేదనే అనుకుందాం, మాధవఘోషు ఇంటివద్ద కేకలు వగైరా విని అందరికంటె ముందుగా ఎందుకు పారిపోయావు ? ఎందుకేముంది, అర్థమవుతూనే వుందిగా-నువ్వు అనుకున్నది నెరవేరింది-నువ్వింకా అక్క డెందుకు ఉంటావు ? మిత్రమా, నాతలకూడా నెరిసింది. ఇంత తేలికగా నువ్వు నన్ను మోసం చేయలేవని ఇప్పటి కైనా తెలిసిందా ? ఇక చావటానికి సిద్ధంగావుండు."

రాజమోహానునికి ఊపిరి ఆడటంలేదు-కొండశిలవలె దొంగల సర్దారు గుండెలమీద కూర్చున్నాడు. రాజ మోహానుడు మంచి బలవంతుడైనప్పటికీ ఎక్కువసేపు ఆ బరువును మోయలేక పోయాడు.

"సర్దార్, ప్రమాణం చేసి చెపుతున్నాను - నేను మాధవఘోషుకు కబురుపంపలేదని భగవంతుని సాక్షిగా - నా తల్లిమీద ప్రమాణంచేసి చెపుతున్నాను. నాకేమీ తెలియదు సర్దార్" అంటూ రాజమోహానుడు బ్రతిమా లుతూ అన్నాడు.

"ఈ వార్తను నీ భార్య ఎలా చేరవేసింది ? ఆమె నిద్రపోయిందిగదా ?" అని ప్రశ్నించాడు సర్దారు.

సర్దారు అతని గుండెలమీదినుంచి లేచాడు, కానీ రెండు చేతులతో అతని మెడను మాత్రం గట్టిగా పట్టుకునే

ఉన్నాడు. అవసరమైతే ఏక్షణంలోనైనా గొంతునులిమి చంపేద్దామని అతని ఉద్దేశం.

"అప్పుడు ఆమె నిద్రపోయినట్లు నటించిందేమో ?" అన్నాడు రాజమోహనుడు.

"అవునవును, నన్ను తెలివితక్కువ దద్దమ్మనను కున్నావు-నేను దూరంగా నిలబడి మాట్లాడదామని చెప్పి నప్పుడు నువ్వు గోడప్రక్కనే ఎందుకు నిలబడదామని అన్నావో ? మమ్మల్ని గురించి ఇవాళ మాధవఘోషుకు చెప్పిన వాడవు రేపు పోలీసులకుమాత్రం ఎందుకు చెప్పవు? మాధవఘోషు నిన్ను రక్షించటానికి తప్పకుండా ప్రయ త్నిస్తాడు, అందుకని నువ్వు జీవించి ఉన్నంతకాలము మాకు శాంతి వుండదు - మేము నిశ్చింతగా ఉండలేము. నువ్వు పారిపోయి వచ్చావు, లేకపోతే అప్పుడే నిన్ను యము లోకానికి పంపి ఉండేవాళ్ళము."

రాజమోహనుడు ఉన్నట్లుండి ఉద్రేకపడుతూ ఇలా అన్నాడు-"మీరు నా యింటిలోనికి జొరబడగానే చూచిం దేమిటి ? నేను నా భార్యద్వారా కబురుపంపానని అంటు న్నారు మీరు, మీరువచ్చినప్పుడు ఆమెనేగదా నేను చంప బోతూఉంది ? మరికొంతసేపు మీరు రాకుండా ఉంటే ఆమె శవం గదిలో దొర్లుతూ వుండేది."

ఈమాటవిని సర్దారు కొంచెం ఆలోచనలో పడ్డాడు. అతని సలహాకూడా అడుగుతున్నట్లుగా సర్దారు మెదలకుండా నిలబడివున్న భీఖూ వంక చూచాడు.

"అవును సర్దార్ ! ఇతడు చెప్పేది నిజమే" అన్నాడు భీఖూ.

రాజమోహనుని హృదయం భయంతో కంపిస్తూ ఉంది_"నేను ఏ అపరాధం చేశానని మీరు అంటున్నారు - దానిని గురించే నేను ఆమెను చంప బోయాను."

సర్దారు ఎగిరి గంతేసి నిలబడ్డాడు.

"ఆ దుర్మార్గురాలు ఎక్కడ ఉంది ? నేనే ఆమెను చంపేస్తాను" అంటూ సర్దారు మాతంగిని పడివున్న వైపు వెళ్లాడు. అక్కడ ఏవేవో గుడ్డలు గుట్టగా పడి వున్నాయి. సర్దారు వాటిని తడిమి చూచాడు. ఆరిపోతున్న దీపపు వెలుగులో ఏదీ స్పష్టంగా కన్పించటంలేదు.

"దుర్మార్గురాలు ఎక్కడికి వెళ్ళింది ? మోసగించి పారిపోవచ్చు ననుకుందేమో! అది సాధ్యం కాదు. ఎక్కడ దాగినా వెతికి పట్టుకుంటాను" అంటూ దొంగల సర్దారు గదిలో ఆమెకోసం వెతక సాగాడు.

రాజమోహనుని కంఠస్వరం ఇప్పుడు మామూలు స్థితికి వచ్చింది___"ఆగండి. నేను తప్ప నా భార్యను ఎవరూ తాకటానికి వీల్లేదు. నా కట్లు విప్పండి" అన్నాడు.

సర్దారు గదిలో తిరుగుతూ భీఖూవైపు తిరిగి_"అతని కట్లు విప్పు. ఆ రాక్షసి ఎక్కడ వుందో జుట్టుపట్టుకొని ఈడ్చుకు వస్తాను. ఎక్కడికి పోతుంది?" అని అన్నాడు.

భీఖూ కత్తితో అతని కాళ్ళకు చేతులకు ఉన్న కట్లను కోసేశాడు. "ఎక్కడికి పోతావే కుట్రదానా ?"

అంటూ సర్దారు గదిలో వెతుకుతూ మంచము వద్దకువచ్చి కత్తితో పొడిచి చూడసాగాడు. కాని మాతంగిని అక్కడ లేదు.

"భీఖూ, దీపం ఇలా తీసుకురా. మంచంక్రింద దాగిం దేమో చూద్దాం" అన్నాడు సర్దారు.

భీఖూ ఆరిపోతున్న దీపం వత్తిని హెచ్చించి అక్కడికి తెచ్చాడు. రాజమోహనుడు కూడా అతని వెనుకనే వచ్చాడు. మోకాళ్ళమీద వంగి ముగ్గురూ మంచంక్రింద వెతికారు. అక్కడ ఎవరూ కన్పించలేదు.

దీపాన్ని చేత్తో పట్టుకొని ముగ్గురూ గదిలో ప్రతి మూల వెతికారు. చివరికి రాజమోహనుడు ద్వారంవైపు చూచి—"పారిపోయింది దుర్మార్గురాలు ! నేను లోనికి రాగానే గడియవేశాను. ఇప్పుడు తలుపు తెరిచి వుంది" అని గట్టిగా అరిచాడు.

మాతంగిని నిజంగానే పారిపోయింది. దొంగల సర్దారు రాజమోహనుడు ఒకరి నొకరు హతమార్చుకోరుటకు సిద్ధమై పోరాడుతున్నప్పుడు ఆమె సంగతే మరచి పోయారు. మాతంగినిని ఒకసారి చూస్తే ఎంతటి కఠిన హృదయులైనా మర్చిపోరు. కానీ వీళ్ళు అంతకంటె దుర్మార్గులు. అది గ్రహించి మాతంగిని నెమ్మదిగా పాకుతూ తలుపు తెరుచుకొని బయటకు వెళ్ళిపోయింది. గడియ తెరిచినప్పుడు కొంచెం చప్పుడయినా ప్రాణాలకు తెగించి దెబ్బలాడుతున్న ఆ ముగ్గురిలో ఎవరూ అది గమనించలేదు.

"ఆమెను యెక్కడున్నా సరే పట్టుకోవాలి. లేకపోతే మనము సర్వనాశనమై పోతాము" అన్నాడు సర్దారు.

"అవును, ఆమెను పట్టుకోవాలి. నా భార్యను మీరు తాకవద్దు. బంధించండి. మీరు మాత్రం ఆమెను చంపవద్దు. ఆ పని నేనే చేస్తాను. నేను ఆపని చేయకపోతే మీరు నన్నే చంపివేయండి. ఆమె దేహాన్ని ఇతరులెవరూ తాకవద్దని మాత్రమే నేను కోరుతున్నాను. వెళదాం పదండి" అంటూ రాజమోహానుడు ముందు నడిచాడు.

ముగ్గురూ గబ గబ బయటికి వచ్చారు. ఆకాశంలో ఇంకా అక్కడక్కడా మబ్బులు వ్యాపించే ఉన్నాయి. ఒక్కొక్క చినుకే వర్షం కూడా పడుతూనే వుంది. పారి పోయిన సుందరికోసము నలువైపుల గాలించారు. ఉదయం కావచ్చింది.

ముందు రాజమోహానుడు కనకమయి ఇంటికి వెళ్ళి బయటనుండే తొంగిచూడాలనుకున్నాడు. సర్దారు, రాజ మోహానుడు అడుగులో అడుగు వేస్తూ చప్పుడు కాకుండా కనకమయి యింటి దగ్గరకు చేరుకున్నారు. బయట అరుగు మీద నిలబడి కిటికీలో నుంచి లోనికి తొంగి చూచారు. లోపల బాగా వెలుతురు లేకపోయినా తల్లీకూతుళ్ళు ఇద్దరు మాత్రమే లోపల నిద్రపోతున్నారు.

చుట్టుపట్ల ఉన్న పొదలలో కూడా చూచారు. కాని ఎక్కడా మాతంగిని జాడ కన్పించలేదు. మేఘావృతమగు

ఆకాశములో అరుణకాంతి వ్యాపించే సమయానికి బయట తిరగటం క్షేమకరము కాదని దొంగలు వెళ్ళిపోయారు. రాత్రికి ఎక్కడ కలుసుకోవాలో కూడా నిశ్చయించు కున్నారు. "రాత్రికి తప్పక కలుసుకోవాలని" సర్దారు రాజ మోహనుణ్ణి గట్టిగా హెచ్చరించి వెళ్ళాడు.

# 12

అప్పుడే వర్షములో స్నానము చేసిన ప్రాతఃకాలము హృదయమును చలింపచేయు నూతన కాంతితో ప్రకాశిం చింది. ఆకాశములో తేలియాడు మబ్బులను దాటి తరుణ భాస్కరుడు క్రమంగా పైకి రాసాగాడు. ప్రకాశవంతమగు అనంత నీలాకాశములో తేజోవంతముగా సూర్యుడు పయని స్తున్నాడు. ఇళ్ళ కప్పులు, వృక్షాగ్ర భాగాలు - కొబ్బరి చెట్లు ఖర్జూరపు చెట్లు, మామిడి మొదలగు చెట్ల తలలుఅమిత సౌందర్యమగు కాంతి ప్రవాహములో మునిగి నవ్వసాగాయి. చెట్ల ఆకుల మీద నిలచిన వర్షపు చినుకులు సూర్యకాంతిలో ముత్యముల వలె మెరుస్తున్నాయి. దట్టంగా ఉన్న తరుశాఖ లలో నుండి సూర్యకిరణాలు తడిగా ఉన్న నేలమీదికి తొంగి చూస్తున్నాయి. క్షణం క్రితమే మేల్కొన్న పక్షుల కలరవ ముతో ఆ ప్రాంతము ప్రతిధ్వనిస్తూ ఉంది. మధ్య మధ్య కోయిల కమ్మని సంగీతం విన్పిస్తూ ఉంది. తెల్లని దూదిపింజల

వంటి చిన్న చిన్న మబ్బులు నిర్మలమగు నీలాకాశములో అక్కడక్కడా తేలిపోతున్నాయి. చెట్ల ఆకులమీద నిలిచిన వర్షబిందువులను క్రిందికి పడగొట్టటానికి వీచుచున్న చిరుగాలులు ఆకాశములో వ్యాపించిన మేఘమాలను చెదరగొడుతూ ఉన్నాయి.

రాత్రి మాతంగిని దొంగల ఆపదనుంచి తప్పించుకున్న చెరువు వద్దకు వెళదాము. అప్పటికి సూర్యభగవానుడు ఆకాశమార్గములో ఒక జాము ప్రయాణము చేశాడు. అక్కడ ఒక చింతచెట్టు క్రింద చిన్న పొదచాటున తడిగా ఉన్న పచ్చగడ్డిమీద మాతంగిని కూర్చుని ఉంది. ఆమె దుస్తులు తడిసి బురదతో నిండిపోయాయి. వర్షములో తడిసిన దీర్ఘ కేశములుభుజములమీద,వీపుమీద వ్యాపించిఉన్నాయి. ఆమె తలవంచుకొని వర్షపు మేఘాలకంటే నల్లనైన తన కేశములను ఆరబెట్టుకుంటూ ఉంది ప్రక్కనే స్నేహితురాలు కనకమయి కూర్చొని ఉంది. ఇంతకుముందే తైలమర్దనము చేసినందువల్ల కనకమయి శరీరము మెరుస్తూ ఉంది—భుజం మీద ఒక మురికి తువాలు ఉంది ఆమె ప్రక్కనే ఒక ఖాళీ ఇత్తడి బిందె ఉంది. మసిబొగ్గుతో పళ్లు తోమినదే కాని ఇంకా కడగలేదు. స్నేహితురాండ్రిద్దరూ ఏదో గంభీర విషయాన్ని చర్చిస్తున్నట్లు కన్పిస్తున్నారు. వారు దేనిని గురించి చర్చిస్తూ ఉంటారో పాఠకులు గ్రహించే ఉంటారు. తనకు నమ్మకమైన తెలివిగల స్నేహితురాలితో మాతంగిని రాత్రి జరిగిన సంగతులన్నీ నెమ్మదిగా చెబుతూ

ఉంది. వారి సంభాషణలోని అంతిమ భాగము ఈ విధంగా సాగింది—

మాతంగి చెపుతున్న మాటల్ని విస్మయంతో నిశ్చేష్టురాలై వింటూ మరికొంతసేపటికి భయకంపితురాలై కనకమయి "అమ్మో! నేనైతే అప్పుడే ప్రాణం పోయేది. నీ సాహసం మెచ్చుకోదగినదే దీదీ. ఇప్పుడిక నువ్వు నీ భర్త దగ్గరకే వెళతావా?" అని అడిగింది.

మాతంగిని దీర్ఘంగా నిట్టూర్చి "మరింకా ఎక్కడికి వెళతాను?" అని అంది.

"వద్దు వద్దు. నామీద ఒట్టే దీదీ. నువ్విక అక్కడికి మాత్రం వెళ్ళవద్దు. నిన్ను బ్రతకనివ్వరు" అంటూ కనకమయి తన భయాన్ని వ్యక్తం చేసింది.

మాతంగిని ఏడుస్తూ "నేనెలాగో చావాల్సిందే! బ్రహ్మరాతను ఎవరు తప్పిస్తారు? మరెక్కడికి వెళ్ళమంటావో నువ్వే చెప్పు" అని అంది.

స్నేహితురాలి దుఃఖమునుచూచి కనకమయి కూడా ఏడ్చింది. "నువ్వు మా యింట్లో ఉండటానికి వీలుపడదని నాకు తెలుసు. కానీ నువ్వు మీయింటికి మాత్రం వెళ్ళవద్దు. ఇవన్నీ ఎందుకు, మీ చెల్లెలి యింటికి వెళ్ళటానికి అభ్యంతరం ఏమిటి ?

కనకమయి ఈమాట అనటంతో మాతంగిని

దేహంలో ఒక పూర్వ భావాంతరము కన్పించింది. కట్టలు తెంచుకొని ప్రవహించే కన్నీటిని తుడుచుకొని మాధవుని వద్ద శలవు తీసుకొంటూ మాట్లాడినంత కఠినంగా "అసంభవం ! ఈ జీవితంలో తిరిగి అక్కడికి వెళ్ళలేను" అని అంది.

మాతంగిని ముఖభావాన్ని చూచి కనకమయి ఎదురు చెప్పటానికి సాహసించలేక పోయింది. ఆమె ముఖాన కొంగు కప్పుకొని ఏడ్వసాగింది.

ఇంతలో అకస్మాత్తుగా వెనుకనుంచిఎవరివోమాటలు వినవచ్చాయి-"అమ్మాయిలూ, యిక్కడ దాగి కూర్చొని ఏమిటో మాట్లాడుకుంటున్నారు. నాక్కూడా చెపుదురూ ? అయ్యో, ఏడుస్తున్నారెందుకు ? ఏమిటి, ఏం జరిగిందమ్మా ?"

ఆశ్చర్య భయాలతో కూర్చొని ఉన్న వారి వద్దకు ఒక నల్లని వృద్ధ స్త్రీ వచ్చి నిలబడింది. ఆమె జుట్టునెరిసింది, శరీరం ముడుతలు పడింది. ఆమె శుభ్రమైన ముతకచీర ధరించింది. భుజాన ఒక తువాలు ఉంది. ముఖానికి నూనె రాసుకుంది, చంకన కాళీ బిందె ఉంది. ఆమె అక్కడికి వచ్చిన కారణం స్పష్టంగా కన్పిస్తూనే ఉంది.

కనకమయి గబగబ కళ్లు తుడుచుకుంది. ఆమె నవ్వు ముఖం పెట్టి"ఎవరూ, సుఖియా తల్లి గదూ! అవునవును,ఇదేమిటి ఇప్పుడు వచ్చావు ?" అని అడిగింది.

సుఖియా తల్లి ఎంతో సంతోషంగా జవాబు చెప్పింది. "ఇవాళ చాలా ఆలస్యమయిందమ్మా! ఇంటి పనులు ప్రారంభించక ముందే త్వరగా ఒక మునుగు మునిగి వెళదామని వచ్చాను. అది సరే కానీ, ఏం జరిగిందమ్మా? మీరిద్దరూ ఏడుస్తున్నారెందుకు?"

ఆ మాటతో కనకమయికి మళ్ళీ దుఃఖం ముంచుకొచ్చింది— "ఏం చెప్పమంటావు నాయనమ్మా! దురదృష్టవంతురాలు, ఈమె కష్టాలు ఏమని చెప్పను!"

మాతంగిని ఒకసారి కనకమయివైపు నా కష్టాలు ప్రతి మనిషికీ చెప్పకూడదన్నట్లు చూచింది. ఈ ముసలిదానితో ఏమీ చెప్పవద్దన్నట్లు ఆమె చూపు హెచ్చరించింది భయపడకు, నీ రహస్య విషయం ఎవరికీ తెలియదు అన్న అర్థం వచ్చేట్లు కనకమయి మాతంగినివైపు చూచింది.

కనకమయి ఆ వృద్ధురాలితో ఇలా చెప్పింది—"ఏం చెప్పను, పాపం! భర్త ఇంటినుంచి తన్ని తరిమేశాడు. ఎక్కడికి వెళ్లాలి, ఎవరు సహాయం చేస్తారు, ఎలా బ్రతకాలి అని ఆలోచించుకొని ఏడుస్తోంది!"

"అయ్యో! ఛీ ఛీ! దానికోసం ఇంత ఏడ్వాలా! భార్యా భర్తలు ఉదయం పోట్లాడుకుంటారు. సాయంత్రానికి ఏకమవుతారు — ఇది అందరికీ తెలిసిందే కదా! ఇప్పుడేదో కోపంగా ఉంటాడు. ఆ కోపం శాంతించగానే అతడే వచ్చి నిన్ను బ్రతిమాలి తీసుకు వెళతాడు. అయ్యో పిచ్చి తల్లీ, ఈమాత్రం దానికి ఏడ్వాలా!— నీకు తెలుసా కనకం, మా

అల్లుడు ఇక్కడికి వస్తాడు గదా, ప్రతిరోజు రాత్రి భార్యా భర్తలు ఇద్దరూ తగాదా పడుతూనే ఉంటారు. కానీ అందులో ఏముంది? మా అమ్మాయికి అతడేమీ లోటు చేయడు. పోనీ భార్య మీద ప్రేమ లేదా అంటే అదీ కాదు. మొన్న మొన్న బుధవారంనాడు ఏం జరిగిందో తెలుసా, అల్లుడు బంగారు ముక్కుపుడక తెచ్చాడు - చాలా అందంగా ఉంది___"

కానీ కనకమయి మధ్యలోనే ఆమె మాటలకు అడ్డు వచ్చి అల్లుడు తెచ్చిన ముక్కుపుడక కథను పూర్తిగా చెప్ప నివ్వలేదు___"నువ్వు చెప్పేది నిజమే నాయనమ్మా! కానీ ఈమె పరిస్థితి వేరు. యెక్కడినుంచో వాళ్ళ సంబంధం వచ్చిందట___రాజుదాదా ఆ అమ్మాయిని వివాహమాడా లని నిశ్చయించుకున్నాడు. అందుకనే ఈమెను రోజు రోజూ రక రకాలుగా బాధలు పెడుతున్నాడు. ఇక ఈమె ఆ ఇంటికి వెళ్ళి రాజుదాదాతో కాపురం చేయలేదని అర్థమవుతూనే ఉందిగదా! అదీగాక అలాంటి అవమానాలు భరిస్తూ యే స్త్రీ మాత్రం ఉండగలుగుతుంది? తిట్లు దెబ్బలు అవ మానాలు తప్ప అక్కడ లభించేదేముంటుంది? ఇవన్నీ భరించగలిగితేనే అక్కడికి వెళ్లాలి. భరించటానికి కూడా హద్దు ఉండాలి. పాపం! ఎక్కడికి వెళ్ళాలో ఏమీ తోచ కుండా వుంది. పుట్టిల్లుదగ్గరే అయితే ఇంత బాధే ఉండేది కాదు. ఇలాంటి స్థితిలో ఎవరి కూతుర్ని ఎవరు వదులు కుంటారు"?

అందుకు సహృదయురాలగు ఆ వృద్ధురాలు యిలా అంది—"అయ్యో పాపం, యెంత కష్టం వచ్చింది! నువ్వు చెప్పింది నిజమేనమ్మా కనకం. ఇలాంటి పరిస్థితిలో భర్త ఇంటికి వెళ్ళటం మంచిదికాదు. రెండో వివాహం చేసుకోవాలనుకుంటున్నాడా? అతనికి ఇలాంటి రత్నంలాంటి పిల్ల మరెక్కడ దొరుకుతుంది? ఎదిగీ ఎదగని పిల్లను చేసుకుంటె యేం ప్రయోజనం? లేదమ్మా, నువ్వింక అక్కడికి వెళ్ళవద్దు. మీ చెల్లెలు గారింటికి వెళ్ళరాదా, ఆమె ఏమంటుందో చూడు.

"అక్కడికి వెళ్ళగలిగితే యింత ఆలోచన ఎందుకు? ఆమె ఇంటికి వెళ్ళటానికి కూడా వీలులేకుండా పోయింది. అదే ఇప్పుడు వచ్చిన చిక్కు" అని చెప్పింది కనకమయి.

సిగ్గుతోనూ, ద్వేషంతోనూ మాతంగిని తల వంచుకొని కూర్చుంది. కనకమయి మాత్రం తాను చెప్పదలచినదేదో చెపుతూనే వుంది—గతంలో శ్రాద్ధ కర్మలు జరిగినప్పుడు మాధవబాబుగారు రాజుదాదాను ఆహ్వానించలేదని ఆమె తన చెల్లెలితో తగాదా పడింది. ఆనాటినుంచి అక్కచెల్లెండ్రిద్దరూ మాట్లాడుకోవటంలేదు ఈమెను మా ఇంటికే తీసుకు వెళ్ళవచ్చు కానీ మేము ఎంత పేదవాళ్ళమో నీకు తెలియనిది కాదుగదా! మా ఇంటివద్ద ఈమె తిండిలేక ఉపవాసాలుచేయటం మంచిదంటావా?"

"ఏమిటుంచి, కృశించి చావటమే! అయినా అదేమిటమ్మా నువ్వు-ఇలాంటి మొగుడికోసం చెల్లెలితో తగాదా

పడటం మంచిదికాదు. నా అల్లుడు ఇలాంటి పనిగనుక చేస్తే అతనితోనే వదలను, వాళ్ళ అమ్మ నాన్నను బజారులో నిల బెట్టి నాలుగూ దులిపేస్తాను. అమ్మాయీ, వాడెట్లాచస్తే నీ కెందుకు కానీ నువ్వు నావెంటరా" అని అంది సుఖియా తల్లి,

ఇందుకు కనకమయి ఏమీ మాట్లాడలేదు. మాతంగిని దుఃఖభారంతో మెదలకుండా కూర్చునిఉంది. అదిచూచి ఆ వృద్ధురాలే మళ్ళీ ఇలాఅంది – నావెంటరా అమ్మా! నువ్వు కోరినంతకాలం మీ యజమానురాలివద్ద వుండు. పెద్దమ్మగారికి మీరంటే చాలా ఇష్టం; యిందుకు ఆమెగారు సంతోషంగా అంగీకరిస్తారు, తరువాత నీ భర్తకు కోపం తగ్గిపోతుంది – తప్పకుండా నీ కాళ్ళదగ్గరకు వస్తాడు – అప్పుడే బ్రతిమాలించుకొని వెళ్ళవచ్చును. చూడు, అతడువచ్చి అడిగితే అంత త్వరగా అతనికి లొంగిపోకూడదు సుమా! అతడు చెంపలు వేసుకోవాలి, ఏడ్వాలి, యిలాంటిపని యింకెప్పుడూ చేయను బుద్ధివచ్చిందని క్షమాపణ కోరుకోవాలి, అప్పుడు అంగీకరించాలి, తెలిసిందా?"

కనకమయికి చాలా ఆనందం కలిగింది. ఆమె సంతోషపడుతూ యిలా అంది–"అవునవును, నువ్వు చెప్పినది బాగానే ఉంది, ఈమె ఇప్పుడే నీవెంట వస్తుంది – దీదీ, ఏమంటావ్? ఈమెవెంట వెళ్ళటమే ప్రస్తుతము నీకు అన్ని విధాలా మంచిది. పెద్దమ్మగారికి నువ్వంటే చాలా ఇష్టమని నాకుతెలుసు. నువ్వు వెళితే ఆమెగారు చాలా సంతోషిస్తారు మాట్లాడవేమిటి దీదీ?

మాతంగిని ముఖం చిట్లించి కోపంగా ఉన్నట్లుంది. కానీ బడబడవాగే కనకమయి ఇవేమీ పట్టించుకోలేదు. ఆమె తన ధోరణిలో అలాగే మాట్లాడసాగింది–“అవును, దీదీ నీవెంట వస్తుంది నాయనమ్మ, నువువెళ్ళి, స్నానం చేసిరా. ఆలస్యం చేయకు–త్వరగా రా”

సుఖియా తల్లి స్నానానికి వెళ్ళింది, “వెళ్ళక తప్ప దంటావా” అని అడిగింది మాతంగిని.

కనకమయి ఉత్తేజితురాలై బిగ్గరగా “దీదీ, కాదనకు నా మీద ఒట్టే. ఆమెవెంట వెళ్ళు. సాయంత్రం నేనువచ్చి కలుసు కుంటాను. ఇక దీనిని గురించి మరేమీ మాట్లాడ వద్దు” అని చెప్పింది.

ఈమాట అని కనకమయి మాతంగిని జవాబుకోసం కూడా ఎదురు చూడకుండా బిందె తీసుకొని గబగబ చెరువుకు వెళ్ళి సుఖియా తల్లితో కలిసి స్నానం చేయసాగింది.

## 13

మధురఘోషు నివాస భవనము పల్లెటూరి సమృద్ధితో పాటు పరిశుభ్రత, అందచందాలు, అలంకారాలు మొదలగునవేవీ లేకుండా ఉండటానికి ఒక గొప్ప నిదర్శనము.

చాలా దూరం వరకు వ్యాపించిన ధాన్యపు పొలాల అవతలివైపునుంచి చూస్తే చెట్లచాటునవున్న ఆ భవనపు పైభాగము నల్లని గోడలు కన్పిస్తూనే ఉంటాయి. కానీ దగ్గరకు వచ్చి చూస్తేకాని ఆ భవనపు యదార్థ స్వరూపం తెలియదు. అనేకచోట్ల పెళ్ళలు పెళ్ళలుగా గోడల గచ్చు వూడి ఇటుకలు బయట పడ్డాయి; కొన్నిచోట్ల గోడలు కూలి పోవుటకు సిద్ధంగా వున్నట్లున్నాయి. కొన్ని కిటికీలకు వున్న తలుపులు-రంగుపోయి అసహ్యంగా-చిన్నమేకు ఆధారంతో వ్రేలాడుతున్నాయి, ఇంతకుముందు వూడిపడిపోయిన తలుపుల వియోగ దుఃఖములో తలలువంచి వ్రేలాడుతున్నట్లు కన్పిస్తున్నాయి. కొన్ని కొన్ని కిటికీలకు తేలికరకపు చెక్కలను బిగించారు. విశాలమైన ఆ భవనపు గోడలకు బయట వైపున ఎక్కడోగాని గచ్చు కన్పించదు. ఆ భవనంలో వెతికితే శిథిలమైపోయిన ఒకటి రెండు పల్లకీ ముక్కలుకూడా కన్పిస్తాయి. కానీ దైత్యాకారముగల ఆ విశాల భవనంలోని గోడలమీది సున్నము చాలావరకు రాలిపోయింది. బయట పడిన ఇటుకలమీద మందంగా దుమ్ముపేరుకొని భీభత్స సౌందర్యాన్ని సృష్టించింది. అక్కడక్కడా గోడలోనుంచి చిన్నచిన్న మొక్కలు తొంగి చూస్తున్నాయి.

ఆ భవనంలో నాలుగు భాగాలు వున్నాయి. అవి వేటి కవే వేరువేరుగా వుంటాయి. ఎదుటనుండి వెళ్తే ఒక పెద్ద ద్వారం కన్పిస్తుంది. తారుపూసిన రెండు పెద్ద పెద్ద ఇనప తలుపులు ఉన్నాయి. అక్కడినుండి ఒక విశాలమైన

ఆవరణలోనికి అడుగు పెడతాము - దానికి మూడువైపుల రెండు అంతస్తుల గదులున్నాయి; అవి అంత ఎత్తుగా వుండవు. ద్వారానికి ఎదురుగా ఒక పెద్ద హాలువుంది-దానికి ఆర్చీలుగల అయిదు ద్వారాలు వున్నాయి. హాలులోపలా బయటా కూడా పూర్వం ఎప్పుడో సున్నం కొట్టారు. కానీ ఆనాటినుంచి కురిసిన అనేక వర్షాల దుండగము వలన ఆ గోడలు నల్లబడి పోయాయి. ఈ హాలులోనుంచి అంతః పురములోనికి వెళ్ళడానికి మెలికలు తిరుగుతూ నెమ్మ వాసన వేసే చీకటి గదులలోనుంచి వెళ్ళాలి. అప్పుడు రెండో భాగంలోకి చేరుకుంటాము. యిక్కడ చుట్టూ గదులు మధ్య కాళీ స్థలము వుంటుంది. ముందు వసారాలలోని స్తంభాలమీది పెళ్ళలు వూడి అస్థిపంజరాలవలె కన్పిస్తాయి. వీటికి ఈ దుర్గతి పట్టటానికి పిల్లలు చాలావరకు సహాయం చేశారు. పైన క్రింద వున్న గదులు వసారాలలోని గోడలన్నీ రంగురంగుల మరకలతో ఇంద్రధనస్సులోని ఏడురంగులతోనూ వర్థిల్లుతున్నాయి. అధికంగా తాంబూలము నములుతూ ఉమ్మివేసిన గుర్తులు, పొయ్యి మొదలగునవి అలికే కుండలు దాసీ చేతినుంచి క్రిందపడి పగలటంవల్లచిందిన పేడమరకలు, తాంబూలములు చుట్టునప్పుడు చేతుల్ని తువాలుకు తుడవకుండా గోడలకు రాసిన మరకలు మొదలగు చిత్ర కళలతో గోడలన్నీ నిండి ఉన్నాయి. మసి బొగ్గుతో గీసిన చిత్రాలు చిన్న పిల్లల చిత్రకళకు గొప్ప నమూనాలే. మధ్యనున్న కాళీస్థలము గచ్చు చేసినది కాదు.

అక్కడ భూమాత తన ఒడిలో రకరకాల గడ్డికి మొక్కలకు ఆశ్రయమిచ్చింది. ప్రపంచములోని చెత్త మురికినీరు అంతా కలిసి నల్లని రూపాన్ని ధరించి దొడ్లో ఒకవైపున యుగ యుగాలుగా విశ్రమిస్తున్నట్లు కన్పిస్తుంది. ప్రపంచంలో మరే వస్తువూ అంత నల్లగా ఉండదేమో!

ఇక్కడినుండి ఒక ఇరుకైన సందు మార్గాన వొక పెద్ద ద్వారాన్ని దాటి వెళితే మూడవ భాగంలోకి చేరు కుంటాము. ఈ భాగంలోనే పాఠశాల ఉంది. రెండు వైపుల ఒక్కొక్క గది వంతున వరుసగా అనేక గదు లున్నాయి. మధ్య విశాలమైన ఖాళీస్థలము—రెండవ భాగ ములోకంటె గడ్డిమొక్కలు ఇక్కడ మరీ ఎక్కువ. ఇక్కడ నిత్యము కూరగాయలమీద కత్తులతో దుండగము జరిపే సజీవ చిహ్నాలు యెన్నో కన్పిస్తాయి. అంతేగాక ఈ విభా గంలో నీటిలో నివసించే చేపలనే ప్రాణుల్ని ఎంత ఘోరంగా హత్యచేస్తూ ఉంటారో కూడా అనేక నిదర్శనాలు కన్పి స్తాయి. పొగవలన యుగ యుగాలుగా పేరుకుంటూ వచ్చిన మసి అప్రతిహత గౌరవంతో ప్రకాశిస్తుంది.

దీని వెనుక నాలుగవ భాగం వుంది. కాని మూడవ భాగంలోనుంచి అటు వెళ్ళటానికి ఉన్న మార్గాలన్నీ మూసివేశారు. ఈ భాగంలోనికి ప్రవేశించే అధికారం పొందిన స్త్రీలు చాలా తక్కువమంది ఉంటారు

బయటినుండి ఈ భాగంలోకి రావటానికి ఒకే ఒక మార్గం ఉంది. ఆ ద్వారానికి బిగించిన తలుపులు చాలా

బలమైనవి; వాటిలో ఎక్కడా చిన్న రంధ్రంకూడా కన్పించదు. ఈ భవనానికి మూడు వైపుల ఎత్తయిన గోడలు వున్నాయి. బయటినుంచి ఎవరూ సునాయాసంగా దీనిలోకి రాకుండా ఉండగలందులకు గోడలమీద గాజు పెంకులు బిగించారు. నాల్గవ వైపున వరుసగా గదులు కట్టారు. గోడల గదులు చాలా మందంగా ఉన్నాయి. ఆ గదుల ద్వారాలు చిన్న చిన్న కిటికీలవలె ఉండి ఇనప తలుపులు బిగించారు. వీటిలో వివిధరకాల వస్తువుల్ని నిలవచేస్తారని మాత్రమే ప్రజలకు తెలుసు. అందుకే దీనిని గిడ్డంగుల భవనం అని కూడా అంటారు. భవనానికి ఒకవైపున పోకచెట్ల తోట వుంది. పోకచెట్లమధ్య పొగడచెట్లుకూడా ఉన్నాయి. అక్కడే నిండుగా నీళ్ళున్న చిన్న కొలనుకూడా ఉంది—చుట్టూ ఇటుకలతో గోడ కట్టారు. దీని తరువాత మరొక ద్వారాన్ని దాటి వెళితే ఇంటిముందున్న ఉద్యానం లోనికి చేరుకుంటాము.

మనం యిప్పుడు ఈ భవనంలోని రెండో అంతస్తులోకి వెళ్ళి చూద్దాం. పైకి వెళ్ళటానికి చాలా యిరుకైన మెట్లున్నాయి, చీకటిగా ఉంటుంది. ఒక్కొక్క మెట్టే జాగ్రత్తగా ఎక్కుతూ పైకి వెళ్ళాలి. అక్కడే మధుర ఘోషు పడకగదిఉంది. ఆగదిగోడలు సున్నముకొట్టి తెల్లగా శుభ్రంగానే వున్నాయని చెప్పవచ్చు. యిక్కడకూడా ఒకటి రెండుచోట్ల నల్లని మచ్చలు గీతలు వున్నాయి. గదిలో ఒక మూల ఎత్తుగావున్న ఒకపెద్ద మంచమువుంది. పైనవున్న కర్రలతో సంబంధం లేకుండా ఒక దోమతెర క్రిందివరకు

వ్రేలాడుతూవుంది. చుట్టూ అనేక బీరువాలు, డ్రాయర్లు కూడా ఉన్నాయి. ఒకటిరెండు సామాన్యమగు పల్లెటూరి వాయిద్యాలు, మరికొన్ని పెట్టెలు—ఇవే ఆ గదిలోని సామాన్లు. ఎదురెదురుగా రెండు గోడలమీద రెండు పెద్ద తైలవర్ణ చిత్రాలు వున్నాయి. వాటిలో ఒకటి కాళికాదేవి చిత్రము, మరొకటి దుర్గామాత చిత్రము. దూరానికి అది ఎంద్రకాయ చిత్రమువలె కన్పిస్తుంది. మరొక గదిలో మేరీ మాత ఆమెబిడ్డ క్రీస్తుఉన్న కళాత్మక చిత్రము ఉంది. కానీ ఆ గదిలో నివసించేవారికి ఆ చిత్రములోని ఉద్దేశ్యము, అర్థము ఏదీ తెలియదు. ఆ గదిలో కిటికీకి దగ్గరగా ఒక స్త్రీ కూర్చొనిఉంది. ఆమె వయస్సు యిరువదెనిమిదేండ్లు. అవ యవ సౌష్ఠవము, ముఖమునుబట్టి ఆమె ఇప్పటికీ అందమైన దనే చెప్పవచ్చును. శ్యామవర్ణ శరీరము. విశాలమైన నేత్రాలు—తుమ్మెదలాంటి నల్లని కనిగ్రుడ్లు. ఆ కన్నుల్లో ఎప్పుడూ ఏదో కాంతి వుంటుంది. ముఖం నవ్వుతో ప్రకా శిస్తూ ఉంటుంది. ఇంతకుమించి ఆ స్త్రీలో ప్రత్యేకించి చెప్ప తగినవేమీలేవు. వీటన్నిటివలన ఆమెలో ఒక మాధుర్యం మూర్తీభవించివుంది—అది ఆమెకు పుట్టుకతో వచ్చినదే. ఆమెలో ఈ మాధుర్యం కన్పించని క్షణం అంటూ ఉండదు. నెత్తిమీద ముసుగులేదు. అప్పుడే స్నానం చేసినందువల్ల తడిగా ఉన్న జుట్టును ఆరబెట్టు కుంటూ వుంది. దువ్వ కుండా చెదిరిపడివున్న కేశరాశి చాలా అందంగా కన్పి స్తుంది. చెవులకు చేతులకు మెడలోను పెద్దపెద్ద ఆభరణా లేమీ లేవు; నాజూకైన చిన్నచిన్న ఆభరణాలే ధరించింది.

ఆడపిల్లలకు అతిప్రియమైన జడలకు ఉపయోగించే దారాలు అల్లుతూవుంది, ఆమెప్రక్కనే ఒకపదేండ్ల బాలిక ముఖంలో మనోహరమగు ఆ స్త్రీ ముఖపోలికలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. కనుక ఆ బాలిక ఆమె కుమార్తెనని అర్థమవుతుంది. బాలిక తల్లి అల్లుతున్న దారాలను కుతూహలంతో చూస్తూ కూర్చుంది. ఈ తల్లీ కుమార్తెలకు కొద్ది దూరాన నమ్రతతో మరొక స్త్రీ కూర్చొనివుంది. సుఖియాతల్లి తన వాగ్దానము నెరవేర్చింది. సందిగ్ధావస్థలోఉన్న మాతంగినిని ఆమె తన యజమానురాలివద్దకు చేర్చింది.

మధురఘోషు భార్య, మాతంగిని చాలా నెమ్మదిగా మాట్లాడుతున్నారు. సుఖియాతల్లి వారికి కొద్దిదూరంలో కూర్చొని తనలో తానే గొణుక్కుంటూఉంది — వాళ్ళిద్దరి సంభాషణలో జోక్యం కలిగించుకోవటంలేదు. సుఖియాతల్లి మాతంగిని కష్టగాథను గురించి తన యజమానురాలితో ఏమి చెప్పిఉంటుందో పాఠకులు వూహించుకోగలరు. మాతంగినిని గురించి కనకమయి ఆమెతో చెప్పిన కల్పిత కథకు తాను మరికొన్ని అత్యుత్తమ అలంకారాలు అతిశయోక్తులు చేర్చి మాతంగిని దుర్దశను వర్ణించి, యజమానురాలితో చెప్పింది. తన కుమార్తె సుఖజీవితమును నిదర్శనముగా పేర్కొని వైవాహిక జీవితంలోని సుఖాలను గురించి తన అభిప్రాయాలను కూడా సుఖియాతల్లి చెప్పటం మర్చిపోలేదు. తాను అతిశయోక్తులు అలంకారాలు చేర్చి చెప్పినందువల్ల తన యజమానురాలికి గాని, మాతంగినికి గాని

ఎలాంటి హాని కలుగదు. పైగా ఈ విధంగా తన వాక్చాతుర్యాన్ని ప్రదర్శించుకునే అవకాశం లభిస్తుందనే సుఖియా తల్లి ఆలోచించింది. వృద్ధురాలు తనను గురించి ఈ విధంగా చెపుతూ ఉంటే మాతంగిని ఇష్టం లేకపోయినప్పటికీ మెదల కుండా వింటూ కూర్చుంది. తాను ఎక్కువరోజులు ఇక్కడే ఉండవలసి వచ్చినట్లయితే ఏదో ఒక సమయంలో తన పరిస్థితులన్నీ ఆమెతో చెప్పవచ్చునని మాతంగిని ఆలోచించింది. తన భర్త ఎలాంటి నీచమైన పనులకు పాల్పడ్డాడో తెలియనివ్వ కూడదనే ఆమె ఉద్దేశ్యము.

మధురఘోషు భార్య ఎంతో ఆత్మీయతతో ఆమెను దగ్గరకు తీసింది. ఆమె మర్యాదకోసము పైపై ప్రేమ నటించటం లేదని మాతంగిని అర్థం చేసుకుంది. ఆమె మాతంగినికి ఆశ్రయమిచ్చినట్లుగా గాక ఆహ్వానించి ఆదరాభిమానాలతో తనవద్ద ఉంచుకోవాలనుకుంటుంది. ఈ విషయంలో మధురబాబు అనుమతి పొందటం అవసరం. భర్త అనుమతి పొందటం కోసము ఆమె సుఖియాతల్లితో భర్తకు కబురు పంపింది. అప్పుడు కూడా ఆ వృద్ధురాలు తన కుమార్తె అదృష్టాన్ని ఆమె భర్తను గురించి వర్ణించి చెపుతూనే ఉంది. భర్తకు ఎందుకు కబురు పంపిందో ఆమె మాతంగిని ఎదుట వ్యక్తం చేయలేదు. కొద్ది క్షణాల అనంతరము గృహయజమాని గదిలోనికి వచ్చాడు. భర్తను చూడగానే భార్య నెత్తిమీద ముసుగును ముందుకు లాక్కుంది. తాను అక్కడ ఉండటం మంచిదికాదని భావించి

మాతంగిని గదిలోనుంచి బయటకు వెళ్ళిపోయింది. వెళ్ళే ముందు గృహయజమాని నిర్నిమేష నేత్రాలతో ఆశ్చర్యంగా తనను చూడటం మాతంగిని గమనించింది.

# 14

మధురఘోషు రెండు వివాహాల వలలో చిక్కుకున్నాడని పాఠకులకు తెలిసినదే. అదృష్టపు సుఖాలనూ లేదా దురదృష్టపు దుఃఖాలనూ అనుభవిస్తూ యిద్దరి భార్యల అధికారాన్ని లేదా ఆనందాన్ని అనుభవిస్తూ కాలం గడుపుతున్నాడు. పెద్దభార్య తారను గురించి ఇంతకుముందే తెలుసుకున్నాము. చిన్నభార్యపేరు చంప. వయస్సులో ఆమె తారకంటె ఏడెనిమిదేండ్లు చిన్నది. అందములోనూ ఆకారములోనూ రంగులోనూ గౌరవంలోనూ చంప తన సవతికంటె అనేక అంశములలో ఆధిక్యతగలదే. ముఖ్యంగా ఆమె స్వభావము చంచలమైనది, సౌందర్యపు మాయా జాలమును విసరటంలో మాత్రము చాలా నేర్పరి. దాని ఫలితంగా ఆమె హావభావములలో గర్వము చాంచల్యము వ్యక్తమవుతూ వుండేవి. అందువల్ల ఇరుగు పొరుగు అందమైన యువతులు సౌందర్య గర్వంలో ఆమె ఎదుట ఓటమిని అంగీకరించే వారు. ఈ విషయంలో అందరూ ఆమెనుచూచి ఈర్ష్య పడేవారు-ద్వేషించేవారు. గర్విష్ఠి. పెత్తనం చేయా

లనే అలవాటుగల చంప ఇంటికి తానే సర్వాధికారిణియై అందరినీ శాసిస్తూ ఉండేది లో లోపల అందరికీ అయిష్టమే. కాని అందరూ ఆమెను భయపడేవారు. ముఖం అందమైనదే కాని హృదయం అలాంటిది కాదనీ, చంప కఠిన హృదయురాలు కావటం వల్లనే పెద్ద భార్య తార గృహయజమానురాలయినప్పటికి ఈమే యింటిలో పెత్తనం సాగిస్తూ ఉంటుందని అందరూ తెలుసుకున్నారు. ప్రేమించటంకానీ ప్రేమను పొందాలనే కోర్కెలాంటి పదార్థంగానీ మధురఘోషు స్వభావంలోనే లేదు; ప్రేమ అనేది అతని మనసులో ఒక ఉత్తమమైన భావన అనే అభిప్రాయంకూడా లేదు. అందాన్ని చూచి సహజంగా అందరూ మోహితులవుతూ వుంటారు. అలాగే మధురఘోషుకు చిన్న భార్య అంటే వ్యామోహం ఎక్కువ, అంతేకాని దానిని ప్రేమ అని చెప్పలేను.

చుట్టూ ఉన్న స్వార్థా లన్నింటినీ తన స్వార్థ సిద్ధికి ఉపయోగించుకొని మనసులోని కఠోరశక్తితో అందరికీ అధికారి కాగలిగిన మధురఘోషు టక్కులాడి చంప యొక్క ఇచ్ఛాశక్తి ముందు పూర్తిగా దాసుడై పోయాడు. తార యొక్క స్వభావంలో ఒక విధమగు మాధుర్యము, ధైర్యము ఉన్నందు వల్ల ఆమె యందు కోపం వచ్చే అవకాశం ఉండేది కాదు. కానీ తార విషయంలో మధురబాబు తటస్థభావంతో ఉండేవాడు. ఆమెకు ఎప్పుడూ ఎలాంటి కష్టమూ కలిగించే వాడు కాదు.

రాజమోహనుని భార్యను తమ ఇంటిలో ఆశ్రయ

మిచ్చే విషయంలో ఎక్కువ శ్రమపడకుండానే తార భర్త అనుమతిని పొంద కలిగింది.

"భగవంతుని దయవల్ల, బ్రాహ్మణుల ఆశీర్వాదం వల్ల మనకు తిండికేమీ లోటులేదు. ఆమె శీలము, స్వభావము మంచిదనే నువ్వు అంటున్నావు కనుక ఆమె ఇష్టం వచ్చినంత కాలము ఇక్కడ ఉండటానికి ఎలాంటి అభ్యంతరమూ లేదు." మధురఘోషు తన భార్యతో చెప్పిన మాటలు ఇవి. కానీ ఆచరణలో ఇందుకు విరుద్ధంగా జరుగుతుందని సరళ స్వభావముకల్ల తార గ్రహించలేక పోయింది. తన సవతి ఇష్టప్రకారము యెవరికో తమ ఇంటిలో ఆశ్రయమివ్వటం చంపకు ఇష్టంలేదు.

సూర్యాస్తమయం కావచ్చింది. మాతంగిని జీవితంలో రక రకాల అమంగళకరమగు ఆపదలను సూచిస్తూ ఉదయించిన సూర్యుడు పడమటి ఆకాశంలోకి జారిపోతున్నాడు. తార గది ముందు వసారాలో కూర్చొని కుమార్తెకు తలదువ్వి జడవేస్తూ ఉంది. కానీ ఆ జడ తల్లీ కూతుళ్ళిద్దరికీ నచ్చినట్లు కుదరటంలేదు. అక్కడే కూర్చొని ఉన్న చంప అసభ్యమగు విసిగించే ప్రశ్నలేవో అడుగుతూ ఉంది. అందుకు మాతంగిని 'ఆఁ ఊఁ' అంటూ జవాబులు చెపుతూ వుంది. నిపుణురాలగు ఒక దాసీతో తన చిన్న చిన్న పాదాలకు పారాణి పెట్టిస్తూ చంప మాతంగినిని ప్రశ్న తరువాత ప్రశ్న అడుగుతూ వుంది. తన భర్త దయతలచి ఈమెను

ఆశ్రయమిచ్చాడు. తాను తలచుకుంటే ఏ క్షణంలోనైనా ఆమెను బయటకు పంపివేయగలడు—ఈ సంగతి మాతంగినికేమి తెలుసు. తమ ఆశ్రయంలో వుంటూ తన ప్రశ్నలకు అయిష్టంగా జవాబు చెప్పగలదా? మాతంగిని చాలా వినయంగా సంతృప్తంగా జవాబు చెపుతూ వుంది. కానీ దానివల్ల చంప గర్వానికి దెబ్బతగిలింది. దానితో ఆమె మరింత కోపగించుకో సాగింది.

తార మాతంగినిని పిలిచింది_'ఇదుగో చూడు, మధ్యాహ్నం నుంచి ప్రయత్నించినా ఈ జడ నాకు కుదరటంలేదు. నీవు ఇంతకంటె బాగా కుదురుతుందేమో చూడు.'

"నాకు కూడా అంత అనుభవంలేదు. అయినా ప్రయత్నించి చూస్తాను" అంటూ మాతంగిని ఆరోజుకు జడ బాధ్యతను తాను వహించింది.

మాతంగిని బాలిక వెనుక కూర్చొని అంతకుముందు అల్లిన జడను విప్పి మళ్ళీ దువ్వి జడ అల్లసాగింది.

చంప మధ్యలో అడ్డొస్తూ "అయ్యో, దీదీ! ఇదేం జడ! పశ్చిమ దేశస్తుల జడ అల్లుతుంది! దీనికంటె ఇంతకుముందు అల్లినదే అందంగా ఉంది" అని విమర్శించింది.

"ఈ దేశపు జడ అల్లితే ఈ అమ్మాయి ముఖానికి మరింత అందం వస్తుంది" అని అంది మాతంగిని.

"అయ్యయ్యో, వద్దు వద్దు. ఆ జడవద్దు. సంసారుల పిల్లకు ఇలాంటి జడలు వేయకూడదు. కులటలు యిలాంటి

జడలు వేసుకుంటారు” అంటూ చంప మళ్ళీ అడ్డగించింది.

కానీ తార మాతంగినినే సమర్థించింది — “ఛీ! ఏం మాటలవి! కులటలు అందంగావుంటే వాళ్ళ అందాన్ని హేళన చేస్తున్నారా? చెల్లీ, నువ్వు చెప్పేదానిని బట్టి ఆలోచిస్తే నీలాంటి అందమైన ముఖాలను కూడా వికృతంగా చేసుకోవాలి. కులటలకు జుట్టు ఉంటుంది కనుక సంసార స్త్రీలకు ఉండకూడదనటం సబబైన మాట కాదు. దీదీ, నీకెలా నచ్చితే అలాంటి జడనే అల్లు” అని తార మాతంగినితో చెప్పింది.

ఇందుకు చంప సమాధానం చెప్పలేదు, కానీ ఆమె ముఖం ముడుచుకుపోయింది. తార తన అందాన్ని ప్రశంసించినప్పటికీ తన మాట సాగనందుకు చంపకు మంటగానే ఉంది. సరిగా అదే సమయంలో మెట్లమీద అడుగులచప్పుడు విన్పించింది. మరుక్షణంలో మధురఘోషు పైకి వచ్చాడు. చంప ముసుగు ముందుకు లాక్కొని గబగబ తన గదిలోనికి వెళ్ళిపోయింది. తార కూడా ముసుగు వేసుకొని లేచి ఒక ప్రక్కనే నిలబడింది. మాతంగిని ముసుగులో పూర్తిగాముడుచుకు పోయింది. మధురఘోషు అక్కడే నిలబడి తన కుమార్తెతో రెండు మాటలు మాట్లాడాడు. చంప తలుపు చాటు నుండి తొంగి చూస్తూనే ఉంది—ఆమెకు అప్పుడే అనుమానాలే. కుమార్తెతో మాట్లాడుతూ తన భర్త ముసుగులో ముడుచుకుపోయిన యువతి వైపు చూడటం గమనించింది. మధురఘోషు తన చిన్న భార్య గదివైపుకు వెళ్ళగానే అందరూ తమ తమ పనులు చేసుకోసాగారు.

భర్త తన గదిలోనికే వస్తాడని చంపకు తెలుసు, తానే వారిని కలుసుకోవాలనుకుంటూంది. తాను భర్తను కలుసుకోదలచినట్లు ఎవరికీ తెలియకూడదని భర్త రాకను గమనించి గబగబ ఒక పెట్టెను తెరచి ఏవేవో డబ్బాలను తీసి గుట్టగా పేర్చసాగింది. మధురఘోషు గదిలోకి వచ్చి రకరకాల డబ్బాలు, బరిణలు చంప చుట్టూ పడి ఉండటం చూచాడు. అతని రాకను ఆమె గమనించినట్లే లేదు.

తలవంచుకొని ఆమె పెట్టెలోని సుగంధ ద్రవ్యాల బరిణలన్నీ తీసి క్రింద పెట్టసాగింది. కొద్ది క్షణాలవరకు మౌనముగా నిలబడి ఇదంతా చూచి "ఏమిటిదంతా ? గలిదుమారము రావటానికి సూచనలా" అని అడిగాడు మధురఘోషు

చంప జవాబు చెప్పకుండా తన పని తాను చేసుకోసాగింది.

"ఇప్పుడు అర్థమయింది. ఏమిః. అపరాధం చేశానని ఈ శిక్ష విధిస్తున్నావు ?" అని అడిగాడు.

అప్పటికీ చంప జవాబు చెప్పలేదు. తాను వెతుకుతున్న బరిణ దొరికినట్లు నటిస్తూ మళ్ళీ బయటకు తీసిన వాటిని పెట్టెలో సర్దసాగింది. పెట్టెనుమూసి లేచి బయటకు వెళ్ళబోయింది.

మధురఘోషు ఆమె చేతిని పట్టుకొని బయటకువెళ్ళనివ్వకుండా ఆపి "ప్రియా, అలా వీల్లేదు. ఇక్కడ కూడా ఈ

ముసుగు దేనికి ?" అంటూ ఆమె ముఖం మీాది ముసుగును తొలగించాడు.

విసుగుతో అతనివైపుచూస్తూ "నాపనికి అడ్డువస్తా రెందుకు?"అని అంది చంప.

"ఏమిటో చెప్పు, నేనేం చేశానని నామీాద అలుగు తున్నావు ?"

"అబ్బ-నన్ను వదలండి !"

నిజంగా వెళ్లాలనే అభిప్రాయమే ఉంటే చంప తప్ప కుండా వెళ్ళగలిగేదే. మధురఘోషు ఆమె చేతిని ప్రేమతో మామూలుగా పట్టుకున్నాడే కాని ఆమె విడిపించుకొని వెళ్ళలేనంత గట్టిగా పట్టుకోలేదు. ఆమె ఈసారికూడా తన చేతిని విడిపించుకోటానికి ఎలాంటి ప్రయత్నం చేయకుండానే "నాచెయ్యి వదలండి, అవతల నాకు పనుంది" అని బ్రతి మాలుతున్నట్లు అంది.

"సుందరీ, నీకు పనివున్నదా? ఏమిటాపని?" అంటూ మధురఘోషు నవ్వుతూ అడిగాడు.

"నేను తాంబూలం వేసుకోవాలి" అని అంది కోపంగా ముఖం పెట్టి.

"ఇక్కడే వేసుకో, ఆ చేత్తోనే నాకుకూడా ఇవ్వు"

"అబ్బా, నన్ను వదలండి. నేను వెళ్లాలి."

"ఏం జరిగిందో చెప్పు. నా వల్ల జరిగిన అపరాధం ఏమిటి? ఏమిటో చెపితే వెంటనే ప్రాయశ్చిత్తం చేసుకుంటాను."

"మీవల్ల అపరాధమా—మీవల్ల అపరాధం ఏమి జరుగుతుంది!—అయినా మీ అపరాధానికి సంజాయిషీ అడగటానికి నే నెవర్ని? మీ యిష్టం వచ్చిన పని మీరు చేస్తారు—దానిని అపరాధమని ఎవరంటారు—వొకవేళ జరిగినా నా లెక్కేమిటి!"

"అద్భుతం ! మొత్తానికి యిది చాలా భయంకర మైన కోపమే. ప్రాణేశ్వరీ, నేను చేయవలసి అసాధ్యమగు ఆ కార్యమేదో చెప్పు—వెంటనే చేస్తాను."

"నేనేమీ చెప్పను. మీరు ప్రేమించే భార్యవద్దకే వెళ్ళండి. మీరు చేయవలసిన పాపకార్య మేమిటో ఆమే చెపుతుంది—అదే చేయండి. నేనేదో గతిలేక ఒకమూల పడివుండటం తప్ప మీ ఐశ్వర్యాన్ని అనుభవిస్తుందిమాత్రం ఏముంది!—అయినా మీరు నా మాట వినవలసిన అవసరం ఏముంది? ఎక్కడెక్కడి వాళ్ళయినా వచ్చి ఇక్కడ ఆశ్రయం పొందవచ్చును"

విషయమేమిటో మధురఘోషుకు అర్థమయింది— "ఆ విషయమా? అది నీతో చెప్పాలనే అనుకున్నాను— తారా చెప్పటంవల్ల ఆ అనాథ స్త్రీకి ఆశ్రయ మిచ్చాననే నీకు కోపమా!"

"మీ ఇల్లు, మీ ఇష్టం వచ్చినవారికి ఆశ్రయమిస్తారు. యింకా తన కోపం తగ్గలేదన్నట్లుగా చంప జవాబు చెప్పింది. తన కోపానికి కారణం ఏమిటో భర్త అర్థం చేసుకున్నందుకు ఆమె లోలోపల సంతోషించింది.

"కానీ నేను స్త్రీ సహజమగు నీ కోపాన్ని అవతల పెట్టి ఈ అనాథ స్త్రీకి ఆశ్రయ మిచ్చినందువల్ల నీకు అభ్యాంతరం ఏమిటో చెప్పు."

"అనాథ స్త్రీయా! ఆమె ఏదో తప్పు చేయటంవల్లనే గదా ఇంటిలోనుండి వెళ్ళగొట్టారు!"

"కాని ఆమె తప్పు చేసింది అని నీకెలా తెలిసింది ?"

"ఎలా తెలిసే దేమిటి, ఏమీ తప్పు లేకుండానే ఆమెను వెళ్ళ గొట్టారా? అనవసరంగా ఎవరూ తన భార్యను యింటినుంచి తరిమేయరు !"

"సరే, ఆమె తప్పు చేసిందనే అనుకుందాం, భర్త మాత్రం మితిమీరి వ్యవహరించకూడదని ఏమిటి ? ఏది ఏమయినప్పటికీ ఆమెకు ఆశ్రయమివ్వటంలో తప్పేమీ లేదు."

"అందుకే మీ ఇష్టం వచ్చినట్లే చేయండి. మధ్యలో నా అభిప్రాయం ఎందుకు ?"

"ఛీ ! మళ్లీ అదేమాటా ? ఇలాంటి విషయాలలో స్త్రీలు మరింత దయచూపించాలి."

"దయకు అర్హులయిన వారెని ఎవరైనా దయ తలుస్తారు. మంచీ చెడు విచక్షణ లేకుండా అందరినీ దయ తలుస్తారా ?"

"ఆమెకు నిజంగా ఏమీ కష్టాలు లేవని నీతో ఎవరు చెప్పారు. ఆమె చాలా మంచిదనే అందరూ అనుకుంటారు !"

"అనుకుంటారు !" అంటూ చంప తన అందమైన ముక్కుపుటాలనుఒకసారి ఎగరవేసింది–"సుఖియాతల్లిఏదేదో వాగితే అదంతా మీకు నిజమే కావచ్చు. ఆమె చెప్పిన అబద్ధాలు విని అందరూ అనుకుంటున్నారని మీరు నమ్ముతున్నారు."

మధురఘోషు ఆశ్చర్య పడుతూ "ఆమెను గురించి మంచిగాక చెడ్డవిషయా లేమైనా నీకు తెలిశాయా ?" అని అడిగాడు.

"స్త్రీల విషయాలు పురుషులకంటె స్త్రీలకే ఎక్కువ తెలుస్తాయి."

"అయితే, నువ్వు విన్నదేమిటి ?"

"స్త్రీల రహస్యాలు మీకెందుకు ? అది పెద్దమనిషి లక్షణం కాదు."

మధురఘోషు విసుక్కున్నాడు. ఏ ఉద్దేశ్యమైనా కావచ్చు. మాతంగినికి ఆశ్రయమివ్వాలనే అతని నిశ్చితాభి

ప్రాయం. తన ఇష్టప్రకారం ఒక పని చేస్తున్నప్పుడు తలవని తలంపుగా భార్య అందుకు వ్యతిరేకంగా వ్యవహరిస్తే ఎవరికైనా నిజంగానే కోపం వస్తుంది.

కొద్ది క్షణాలు ఆలోచించి అతడు ఇలా అన్నాడు— "బంధువర్గానికి చెందిన ఒక స్త్రీని ఇంటినుంచి పంపివేయటం చూచేవారికి ఎంత చెడుగా కన్పిస్తుందో నీకు తెలియని విషయం కాదు. ఆమె మన బంధువర్గంలోనిదని నీకు తెలుసు. ఆ దృష్టితో చూచినా కొద్దిరోజులు ఉండనివ్వటానికి అభ్యంతరమేముంది ?"

"మనకంటె దగ్గర బంధువులే ఉన్నారు కదా! తన చెల్లెలి ఇంటికి ఎందుకు వెళ్ళలేదు ? స్వంత చెల్లెలు కంటె మనం ఎక్కువా ? ఆమెను గురించి వాళ్ళకు తెలుసు, అందుకే అక్కడకు వెళ్ళి ఉండదు."

"నీ స్వభావం అతినీచమైనది. నిరాశ్రయుల మీద కూడా నీకు కోపమే. ఒక మనిషికి ఇంత తిండి పెట్టలేవూ?"

చంప అలిగింది. ఆఖరు ఆయుధాన్ని ప్రయోగించింది. "వీల్లేదు. ఆమె ఇక్కడే ఉంటే నేను ఒక క్షణం కూడా ఈ యింట్లో ఉండను. నన్ను మా పుట్టింటికి పంపండి. ఇలాంటి స్త్రీలు ఉన్న ఇంటిలో తన కుమార్తె ఉండటానికి మా నాన్నగారు అంగీకరించే మనిషి కాదు."

"ఏమిటీ వాగుడు ?" మధురఘోషు కొంచెం తీవ్రంగానే అన్నాడు.

"నన్ను మా పుట్టింటికి పంపివేయండి."

చంప మళ్ళీ అదే జవాబు చెప్పేసరికి ఈసారి మధుర ఘోషు కొంచెం మెత్తబడ్డాడు– "నిన్ను చూడకుండా నేను ఉండలేనని నీకు తెలుసు గదా! మరీ చిన్నపిల్లవలె మాట్లాడకు."

"అయితే, ఆమెను పంపివేయండి. ఆమెతో మీకేమిటి సంబంధం, ఆమెను పంపివేయటానికి మీకు ఇంతసంకోచము ఎందుకు ?"

"సరే. ఆలోచించి ఆలాగే చేద్దాం" అని చెప్పి మధుర ఘోషు గదిలోనుంచి బయటకు వెళ్ళిపోయాడు. తన భార్య మనస్సు మార్చుకునేవరకు ఏదోవిధంగా ఆమెకు నచ్చచెపుతూ ఉండవచ్చుననే అతడు నిశ్చయించుకున్నాడు."

ఆ రోజు సాయంత్రం మధురఘోషు మళ్ళీ ఆ గది లోకి వచ్చినప్పుడు అతడు అక్కడ ఒక విచిత్రమైనదృశ్యాన్ని చూచాడు. గదిలో ఒక మూల అతని మంచానికి దూరముగా మరొక మంచం వేసి ఉంది.

"ఈ మంచం ఎవరికి ?" అని దానిని చూడగానే మధురఘోషు ప్రశ్నించాడు. కాని చంప సమాధానం చెప్పకుండా దానిమీద పడుకొని నిద్రపోసాగింది.

మధురఘోషుకు ఆ రాత్రి ఎలా గడిచి ఉంటుందో పాఠకులు వూహించుకోగలరు. మర్నాడు ఉదయం అతడు నిద్ర మేల్కొని కచేరీలోకి వచ్చేసరికి అప్పటికే ఒక మనిషి

వచ్చి అతనికోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు. తాను రాజ మోహనఘోష్ ననిఅతడుతనను పరిచయం చేసుకొని తాను వచ్చిన పనిని గురించి తెలియజేశాడు. తన భార్య మధుర ఘోషు ఇంటివద్ద ఉన్నదని అతనికి తెలిసింది. మనస్పర్థల వలన తన భార్య ఇల్లు వదలి వచ్చిందనీ, ఆమెను తిరిగి పంపించవలసిందనీ కోరాడు. స్వయంగా ఆమె భర్త వచ్చి అడిగితే కాదనటం ఎలాగా ? అదీగాక ఈమెను గురించి చంపతో తగాదా వచ్చింది. పంపివేస్తే చంపకు కూడా సంతోషంగా ఉంటుంది. ఎన్ని విధాల ఆలోచించినా ఇది తప్ప అతనికి మరో మార్గమేదీ కన్పించలేదు.

తాను భర్తవద్దకు వెళ్ళాలనే వార్త మాతంగినికి తెలిసినప్పుడు తనకు ముందు జరగబోయే దేమిటో ఆలోచించి ఆమె నిలువునా కుంగిపోయింది. జీవచ్ఛవమువలె ఆమె సుఖియాతల్లి వెనుక బయలుదేరింది. ఆమె ఇంటివరకు పంపి వచ్చుటకు ఆ వృద్ధురాలిని పంపారు.

తార ద్వారం వరకు వచ్చి సాగనంపింది. సాధ్యమైతే మరికొంత దూరం కూడా వెళ్ళేది. ఆమె దుస్థితికి దుఃఖము ప్రకటిస్తూ భార్యాభర్తల మధ్య వచ్చిన వైమనస్యము మరచిపోయి సుఖశాంతులతో జీవితమును గడుపుకో వలసిందిగా మరీ మరీ చెప్పి తార సెలవు తీసుకుంది.

# 15

మధుమతినదికి ఇరువైపుల అనేక గ్రామాలు ఉన్నాయి. కానీ కొంత అరణ్య ప్రాంతము కూడా లేక పోలేదు. నదీ తీరాన, గ్రామాలకు చేరువలో ఉన్న ఆ మనోహర అరణ్యప్రాంతములో జన సంచారము తక్కువేనని చెప్పాలి. రాధాగంజ్‌కు దక్షిణంగా ఉండే ఈ విచిత్ర నిర్జన ప్రాంతము చాలా భయంకరంగా ఉంటుంది. వెదురు పొదలతోనూ ఇతర వృక్షములతోనూ ఎత్తుగా పెరిగిన గడ్డి దుబ్బులతోనూ దట్టముగా ఉంది. నదీతీరానికి చాలా దూరం వరకు అరణ్య ప్రదేశమే. దట్టమైన అడవిలో ఎక్కడా ఖాళీ ప్రదేశమనేదే కన్పించదు. విష సర్పాలకు నిలయమగు ఆ ప్రదేశములో కూడా మానవుని అడుగుల చప్పుడు విన్పిస్తుందనటానికి, నిదర్శనంగా ఒక సన్నని కాలిబాటవుంది. ఎత్తుగా పెరిగిన గడ్డిమధ్యవున్న ఆ చీకటిబాట, దానిని గురించి తెల్సినవారికి తప్ప యితరులకు కన్పించదు. మెలికలు తిరుగుతూ వెళ్ళే ఆ కాలిబాట అడవిమధ్యకు వెళ్ళి ఆగుతుంది. అక్కడ కొద్ది ఖాళీస్థలము. చిన్న కుటీరము కన్పిస్తవి. అక్కడవున్న ఆ కుటీరము చుట్టూవున్న పొదలకంటే ఎత్తుగా కన్పించదు. దానిలో నివసించువారికి తప్ప ఇతరులకు ఎంత జాగ్రత్తగా పరిశీలించినను అది కుటీరమనే సంగతే తెలియదు_అదికూడా ఒక పొదవలెనే కన్పిస్తుంది.

ఆ కుటీరములోనికి అడుగు పెట్టగానే ఒకవిధమగు వ్యాకుల భావము కలుగుతుంది. చుట్టూ గోడకు బదులు తడికలు పెట్టారు. క్రింద నేల నెమ్మగా వుంటుంది. ఒకచోట రెండు మూడు తడికలు పరిచి వున్నాయి. ఒకమూల నల్లగా పొగ బారిన, నాల్గు, ఐదు వంటపాత్రలు పడివున్నాయి. ఎప్పుడో గాని వాటిని వుపయోగించరని చూడగానే తెలుస్తుంది.

అప్పుడే ఉదయించిన బాలభానుని కిరణాలు చెట్ల కొమ్మలమీద పడుతున్నాయి.

ఆకుటీరంలో ఇద్దరు వ్యక్తులు మాత్రమే నివసిస్తున్నారు. ఇద్దరూ నల్లగా, కండలు మెలితిరిగి చాలా బలంగా వుంటారు. నడుముకు చిన్న చిన్న ముతక గుడ్డలు తప్ప, నల్ల త్రాచులవంటి మిగిలిన శరీర భాగాలు నగ్నంగానేవున్నాయి. కుటీరంలో అటు నిటు పడివున్న కత్తులు, లాటీలను చూడగానే వాళ్ళు ప్రశాంత జీవితము గడపటం లేదని అర్థమువుతుంది. ఘాటైన గంజాయి పొగతో కుటీరమంతా నిండి పోయింది. ఒకరి తరువాత ఒకరు యిద్దరూ గంజాయిదమ్ము పీలుస్తున్నారు నిర్జనమగు అడవి ప్రదేశములోకూడా వారు అతి జాగ్రత్తగా చాలా నెమ్మదిగా మాట్లాడు తున్నారు.

"అదెందుకు, దానివల్ల మనకు లాభమేమిటి ?" అని వారిలో ఒకరు ప్రశ్న వేశారు. ఆ కంఠస్వరము ఇంతకు ముందు పాఠకులకు పరిచయమైనదే. అతడు మరెవరో కాదు. దొంగల సర్దారువెంట రాజమోహనుని ఇంటికి వచ్చిన భీఖూయే.

రెండో వ్యక్తి దొంగల సర్దారు. భీఖూ అడిగిన దానికి అతను ఇలా జవాబు చెప్పాడు— "చాలా పెద్ద మొత్తం వస్తుంది. మొత్త 5000 ల రూపాయలు. ఒక రాత్రి కష్టానికి అదేమంత తక్కువ కాదుగదా! ఏమంటావు? భాగము పంచుకునేవారు కూడా ఎవరూ లేరు."

భీఖూ తన సంతోషాన్ని దాచుకోలేక పోయేడు—" "భలే భలే!" బంతులలాంటి అతని గుండ్రని కళ్లు మెరిశాయి— "అయితే, ఆ వకీలును దారిలోనే పట్టుకొని చంపి పారేసి దస్తావేజులు తీసుకుంటే మన పని పూర్తిఅయినట్లే. అది అతని దగ్గరే ఉంటుంది గదా. దానికంటే తేలికైన మార్గం ఏముంటుంది."

"కాని ఆ స్త్రీ – రాజమోహనుని భార్య లేదూ— ఆమె మన ప్లాను నంతా పాడుచేసింది. రాజమోహనునితో మనము మాట్లాడిన విషయాలన్ని ఆ పాడుముండ విన్నది– మనము ఆ దస్తావేజును దొంగిలించటానికి చూస్తున్నామని మాధవ ఘోషుకు తెల్సిపోయింది. ఇప్పుడతను సైనికబందోబస్తు లేకుండా దస్తావేజును పంపడు గదా. ఇటు మనము ఇద్దరం మాత్రమే ఉన్నాము. యేంరా, ఆ దస్తావేజు కోసం మనము మరోమార్గం ఎందుకు ఆలోచిస్తున్నామో ఇప్పటికయినా నీకు అర్థమైందా?"

"సర్దార్, అది మాత్రం ఎలా సాధ్యపడుతుంది. ఇద్దరు కలిసి మీాఇంటిమీాదికి దండెత్తి వెళ్ళినంత మాత్రాన జరుగుతుందంటారా?"

"మూర్ఖుడా, ఆ పని నేను చేస్తాను. దేహబలం అక్కరకు రానిచోట బుద్ధిని ఉపయోగించి పనిని చేయాలి."

"భీఖూ గంజాయి దమ్ము లాగి పొగ చక్రాలు తిరుగుతూ పైకి పోతూవుంటే దానివైపే చూడసాగాడు.

కాసేపు మెదలకుండా వూరుకున్న తరువాత నెమ్మదిగా తల ఆడిస్తూ భీఖూ ఇలా అన్నాడు—"లేదు సర్దార్, మీ రీ పనిని ఏ విధంగా చేయగలుగుతారో నేనేమీ ఆలోచించలేక పోతున్నాను. మరొక సంగతి, మనం ఎవరికోసరమైతే ఈ పని చేస్తున్నామో అతడు ముందుగా ఒక వేయి రూపాయలు ఈయలేడా. డబ్బు చేతికి వస్తే కొంతవరకు పని జరిగిన తరువాత మనం ఇక్కడనుంచి మాయమైనా మనల్ని ఎవరూ పట్టుకోలేరు."

సర్దారు గంభీరంగా యిలా అన్నాడు—"మిత్రమా, అతడు మనకంటే తక్కువ వాడేమీ కాదు. అతనికీ నాకూ జరిగిన ఒడంబడిక ఏమంటే—దస్తావేజు మనచేతికి రాగానే వేయి రూపాయ లిస్తాడు అతనికి అప్పగించి నప్పుడు మరొక రెండు వేలు ఇస్తాడు. అంటే మొత్తం మనకు మూడు వేలు చేతికి వస్తాయి. తరువాత అతడు దావాలో నెగ్గితే మిగిలిన రెండు వేలుకూడా యిస్తాడు. కానీ వీలునామాను నాశనం చేసివేస్తే అతడే జయిస్తాడనడంలో ఏమీ సందేహము లేదు."

"మరి ఉపాయము ఏమిటి—మీ సంకల్పము ఏమిటి?"

"వద్దు వద్దు, ముందుగా నీతో చెప్పే అన్నీ చెడతాయి. దుర్మార్గుడు రాజమోహనుడు ఏవో నాల్గు కబుర్లుచెప్పి, నీద్వారా అన్నీ తెల్సుకుంటాడు—అప్పుడు అన్నిటికీ తిలోదకాలు ఒదులుకోవల్సిందే. నువ్వు నా నీడగా నాకు తోడుగా వుండి, నేను చెప్పినది చేస్తూ వుండు—అన్నీ జయిస్తాము."

ఆ మాటలువిని భీఖూ ఉద్రేకపడుతూ "రాజమోహనునితో చెప్పటానికి నేనంత తెలివితక్కువ వాడనా?" అని మరుక్షణములోనే గొంతు తగ్గించి "మాట్లాడకండి, ఏదో అడుగులు చప్పుడు విన్పిస్తుంది" అన్నాడు.

దూరాన అడవిలో గుడ్లగూబ అరిచినట్లు ఒక మనిషి కంఠస్వరము విన్పించింది. సర్దారు అలాంటి అరుపుతోనే జబాబు చెప్పాడు. రాజమోహనుడు వస్తున్నాడని, ఇద్దరూ గ్రహించారు.

కాసేపట్లో రాజమోహనుడు కుటీరంలోనికి వచ్చాడు. సర్దారు అతనిని ఆహ్వానిస్తూ "రా రాజమోహన్, విశేషాలేమిటి?" అని ప్రశ్నించాడు.

"సర్దార్ చాలామంచి వార్త, నా భార్య తిరిగి వచ్చింది."

సర్దారు చాలా సంతోష పడుతూ "అలాగా ఎక్కడ దొరికింది ? ఎక్కడకు వెళ్ళింది ?" అని అడిగాడు.

"అది మరీ విచిత్రమైన సంగతి. ఆమె తన చెల్లెలు

యింటికి వెళ్ళలేదు మరెక్కడికి వెళ్ళి వుంటుందో మీరే మైనా ఆలోచించగలరా ?"

యిద్దరు దొంగలూ కుతూహలముగా "ఎక్కడికి ! ఎక్కడికి వెళ్ళింది ?" అని ఒకేసారి ప్రశ్నించారు.

"నేను ఊహించినట్లే జరిగినది. ఆమె మధురఘోషు యింటికి వెళ్ళింది !"

"అలాగా ! తిరిగి వచ్చిన తరువాత ఏమి అంటుంది?"

"ఏమంటుంది ? యింతవరకూ ఒక్క మాటకూడా చెప్పించలేక పోయేను. యింట్లో అందరూ అడిగి చూచారు. ఎవరికి ఏమీ చెప్పినట్లులేదు.

"ఏది ఏమైనప్పటికి దానిని బ్రతకనివ్వను." సర్దారు ఈమాట చాలా నెమ్మదిగా అన్నప్పటికీ, అతని క్రోధారుణ నేత్రాలనుండి నిప్పులు కురుస్తున్నాయి. అందుకని తన మనో భావాన్ని, దాచుకొనుటకు అతడు తలవంచుకొన్నాడు.

"సర్దార్, మరొకసారి ఆలోచించండి. ఆపని చేయ టం అవసరమేనంటారా ?" అన్నాడు రాజమోహనుడు.

"నేను మొదటనే చెప్పానుగదా, నువ్వు-"

"సర్దార్, అన్నీ విన్నాను, ఆ దుర్మార్గురాల్ని, నీకంటే కూడా ఎక్కువగానే ద్వేషిస్తున్నాను. ఆరోజు ఉద

యమే ఆమె నాచేతికి దొరికివుంటే, ఆమెమీద నాకువున్న ప్రేమ ఏమిటో మీరే చూచేవారు ఇప్పుడు నాలో ఆక్రోశం తగ్గిపోయిందిఆ వుద్రేకమూ లేదు. అదీకాక మనము భయ పడినట్లుగా ఆమె ఆపని చేయలేదు. నిన్నరాత్రి ఆమె మాధవ ఘోషు ఇంటికీ వెళ్ళలేదు ఆమెఎవరితోనూ ఏమీ చెప్పనూ లేదు. యివాళ ఆమె అలాంటిదేమీ చేయనప్పుడూ, రేపు చేయబోతుందేమో అని ఎందుకు అనుకోవాలి ?"

సర్దారు కొంచము ఆలోచించాడు తరువాత అతడు యిలా అన్నాడు—"సరే, నేను ఒక ప్రదేశాన్ని గురించి చెపుతాను ఆమెను అక్కడికి పంపుదాము. అందుకు నీకు గాని నాకుగాని ఎవరికి ఎలాంటి అభ్యంతరమూ వుండదు. ఆమెవల్ల మనకు ప్రమాదము కల్గుతుందని భయముకూడా వుండదు.

"ఎక్కడికి ?" అని ప్రశ్నించాడు రాజమోహనుడు.

"సామానులు వగైరా సర్దుకొని, నీ అందమైన భార్యను వెంటబెట్టుకొని బయలుదేరిరా. మాతో కల్సి ఈ కుటీరములోనే వుండవచ్చును,"

"నేనుకూడా దొంగవలె జీవించాలా ?"

"ఇప్పుడు నీవు దొంగవు కాదా ?"

"పనినిబట్టి అంతేకావచ్చు, కానీ దొంగ అని పిలి పించుకోవడము నాకు యిష్టము లేదు. అది అసంభవము."

"అయితే నువ్వు రానంటావా ?"

"నా యింటిలో ఉన్నది ఆ దుర్మార్గురాలు ఒక్కతే కాదు. ఇంకా చాలామంది వున్నారు. వాళ్ళందరినీ తీసుకొని నన్ను దొంగలతో చేరిపొమ్మని ఉద్దేశ్యమా ?"

"అంటే మాకు యిల్లూ సంసారమూ లేదా ?"

"వున్నది. కానీ నేను ఏ విధంగా జీవిస్తున్నానో మా యింటిలో తెలియ నివ్వను."

సర్దారు అధికార పూర్వకంగా అతనిని మాట్లాడ వద్దని హెచ్చరించాడు—"నువ్వు మాతో కలిసి ఉండదలచి నట్లయితే నీ చెల్లెలిని భర్త వద్దకు పంపు. అతడుపేదవాడో, ధనికుడో ఆలోచించవలసిన అవసరము నీ కేమిటి ? లేకపోతే మీ మేనత్త సంగతంటావా— ఆమె చాలామందికి మేనత్తే అవుతుంది; ఆమె దారేదో ఆమె చూచుకుంటుంది."

అప్పటికీ రాజమోహనుని సందేహము తీరలేదు. చాలాసేపు తర్జన భర్జనలు జరిగాయి. చివరికి సర్దార్ బెదిరింపు వల్లనూ మాధవ ఘోషు నౌకరీని వదలి వెళ్ళాలనే అభిలాష వల్లనూ అతడు చెప్పినదానికి అంగీకరించాడు.

అప్పుడే మధ్యాహ్నమైంది. రాజమోహనుడు స్నానం చేసి, భోజనానికి ఇంటికి చేరుకున్నాడు ముందుగా అతనికి చెల్లెలు కిశోరి ఎదురైంది.

"కిశోరీ, ఆ దుర్మార్గురాలిని నా వద్దకు రమ్మనిచెప్పు.

ఇల్లు వదలి ఎలా పారిపోవాలో నేర్పుతాను వెళ్ళి తీసుకురా" అని చెప్పాడు రాజమోహనుడు చెల్లెలితో.

కిశోరి ఆశ్చర్యపడుతూ "అన్నయ్యా, నువ్వు మాట్లాడేది ఎవర్ని గురించి" అని అడిగింది.

కిశోరి ప్రశ్నను విని అతనికి కోపం వచ్చింది— "ఎవర్ని గురించి మాట్లాడతాను ? మీ వదిన విషయం చెపుతున్నాను. నీకు మతి లేనట్లుంది."

"వదిన ఇంట్లో లేదు."

రాజమోహనుడు త్రుళ్ళిపడి "ఇంట్లో లేదా ?" అని అడిగాడు.

"మధుర ఘోషుగారి భవనానికి వెళ్ళి ఆమెను ఇంటికి పంపి వెళతానని నువ్వు చెప్పావు; నువ్వు ఆమెను పంపావా?" అని అడిగింది కిశోరి.

విసుగుతోనూ విస్మయంతోనూ రాజమోహనుడు కాస్సేపటి వరకు నిశ్చేష్టుడై చూస్తూ నిలబడ్డాడు— "అంతా మోసం, సుఖీ తల్లి వెంట బయలుదేరింది. ఇంటికే వస్తుంది గదా అని అనుకున్నాను."

"ఇది మరీ ఆశ్చర్యంగా ఉంది. అయితే మరెక్కడికి వెళుతుంది ! ఎవరైనా చూచారేమో అడిగి చూడు."

రాజమోహనుడు సింహము వలె బయటకు దూకి

చుట్టుపట్ల వెతికాడు; కానీ మాతంగిని ఎక్కడా కన్పించ లేదు.

అతడు బయటనుండే కిశోరిని పిలిచి బిగ్గరగా ఇలా చెప్పాడు—"కిశోరీ, త్వరగా వెళ్ళి చూచిరా. ఆ దుర్మార్గురాలు తన చెల్లెలి ఇంటికే వెళ్ళి ఉంటుంది ఆగు, కనకమయి ఇంటో చూచిరమ్మని అత్తతో చెప్పి వెళ్ళు అక్కడికి కూడా వెళ్ళవచ్చు. త్వరగా రావాలి. నేను ఇక్కడే చూస్తూ ఉంటాను.

కిశోరి, మేనత్త ఇద్దరూ చెరొకవైపుకూ పరుగెత్తారు. కానీ ఇద్దరూ నిరాశతోనే తిరిగి వచ్చారు. క్రోధము విస్మయము విసుగుతో రాజమోహనుడు గుర్రుపెడు తున్నాడు. మధ్యాహ్నపు ఎండలోనే అతడు కిశోరిని మాధవఘోషు ఇంటికి పంపాడు. కిశోరి అంతదూరం ఎండలో వెళ్ళలేక పోయినప్పటికీ అన్నగారి యందుండే గౌరవంతో కాదనలేక బయలుదేరింది. కానీ అక్కడకూడా ఆమెకు వదిన జాడ తెలియదు.

# 16

ఇది జరిగి మూడురోజులు గడచిపోయింది. అది కృష్ణ పక్షపు రాత్రి–నలువైపుల అంధకారం వ్యాపించింది. మాధవుని గదిలో వెలిగే దీపకాంతి చాలా దూరానికి

కన్పిస్తూవుంది. మాధవుడు తనగదిలో ఒంటరిగా మెత్తని సోఫాలో కూర్చొని ఉన్నాడు. సోఫాలో రెండు మూడు యింగ్లీషు పుస్తకాలు ఉన్నాయి, వాటిలో ఒకటి మాధవుని చేతిలోవుంది. కానీ అతడు దానిని చదువుతున్నట్లులేదు. ఎదురుగా తెరిచివున్న కిటికీలోనుంచి ఆకాశములోని నక్షత్రాలను చూస్తూ కూర్చున్నాడు. అతని మనసు చాలా వ్యాకులంగావుంది–మనసులో ఏవేవో విషయాలు మెదులుతున్నాయి. దావాలో జయాపజయాలను గురించి అతని మనసులో అనేక అనుమానాలు కలుగుతున్నాయి. విరోధులు అతనికి వ్యతిరేకంగా అనేక కుట్రలు పన్నుతున్నారు. అంతకంటె కూడా దుర్మార్గుల సహాయాన్ని పొందుతున్నారు; అలాంటి వ్యక్తులు ఎంతటి ఘోరానికైనా వెనుదీయరు. ఆపదలలో మాధవుడు వారిని ఎదిరించలేడు. శత్రువుల కుట్రలు ఫలిస్తే మాధవుని భవిష్యత్తు ఏమవుతుందో, ఎలా వుంటుందో అతనికే తెలియదు. మాతంగిని జీవితంలో సుఖశాంతులనేవి లేవని తేలిపోయింది. మధురఘోషు యింటికి వెళ్ళటమూ, అక్కడినుండి బయలుదేరి అకస్మాత్తుగామాయమవటమూ మొదలగు సంగతులుకూడా అతనికి తెలిశాయి. ఆమె ఒక అపరిచితుని యింటికివెళ్ళి ఆశ్రయం పొందుటకుగల కారణం ఏమిటో మాధవునికి అర్థంకాలేదు. ఏవేవో అపవాదులు విన్నాడు. కానీ మాతంగిని స్వభావం అతనికి పూర్తిగా తెలుసు, ఆమె చాలా సాహసవంతురాలు–ఏదో సామాన్యమైన కారణమయితే ఆమె యిలాంటి పని చేయదని అతనికి నమ్మకం వుంది. సాధారణస్త్రీలవలె అంతంత

మాత్రపు దుఃఖములకు అధైర్యపడి మాతంగిని అకస్మాత్తుగా యిలాంటి సాహసం చేయదని కూడా అతనికి తెలుసు. ఆశ్రయంగానీ సహాయంగానీ పొందగలిగికూడా ఆమె తన చెల్లెలివద్దకు ఎందుకురాలేదో మాధవునికి అర్థమయింది. అందుకు ఆమెను తన మనసులోనే అభినందించాడు. కాని ఆమె యిల్లువదలి వెళ్ళటానికి కారణం ఏమిటో ఎంత ఆలోచించినా అతనికేమీ అర్థం కాలేదు, అకస్మాత్తుగా ఆమె విచిత్రంగా మాయమయిందనేవార్త అతనికి చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. అతని ఆస్తినంతా దోచుకోవాలనే ఉద్దేశ్యంతో దొంగలు పన్నిన కుట్రను గురించి మాతంగిని ముందుగా చెప్పటం వలన దొంగల ఆశలు ఫలించలేదు – మాతంగిని భవిష్యత్తు ఏమికానున్నది–అతడు వీటిని గురించే రకరకాలుగా ఆలోచించ సాగాడు. మాతంగిని నడవడి అతనికి తెలుసు, మరే కారణమైనా కావచ్చునేమోగాని కళంకితురాలుగా మాత్రం ఆమె భర్త గృహాన్ని త్యజించి వుండదని అతని విశ్వాసము. ఆమె ఏదో ఆపదలో చిక్కుకొని వుంటుంది – దీనిని గురించి అతనికలాంటి సందేహమూ లేదు – ఆ కారణం వలన అతడు దుర్భర మనోవేదన ననుభవిస్తున్నాడు. మాతంగినిని గురించి అతని మనసులో మెదిలే గంభీర మధుర భావాలను అతడు అణచుకొనుటకు ఎంతో ప్రయత్నం చేయసాగాడు, దానివల్ల హృదయంలో మరింత అగ్ని రగులుతూ ఉంది. ఆమె తన వద్ద శెలవు తీసుకొని వెళ్ళిన హృదయ విదారక దృశ్యము అతని మనసులో స్పష్టంగా మెదులుతూ ఉంది. అప్పుడు ఆమె

మాట్లాడిన మాటలు అతని చెవుల్లో ప్రతిధ్వనించ సాగాయి

అతడు చాలా సేపటివరకు కన్నీరు కారుస్తూ అలాగే మౌనంగా కూర్చున్నాడు. గదిలో ఒంటరితనాన్ని భరించ లేక బయట చల్లగాలిలో కాస్సేపు తిరిగి వద్దామని వసారా లోకి వచ్చి నిలబడ్డాడు.

అక్కడికి వెళ్ళినా విషాదము అతనిని వెన్నంటే వచ్చింది. అక్కడ నిలబడి నక్షత్రాలతో నిండిన ఆకాశం వైపు, దూరంగా ఉన్న దేవదారు వృక్షముల వైపు చూడ సాగాడు. అంతలోనే మళ్ళీ రకరకాల ఆలోచనలో మునిగి పోయాడు.

రెప్ప వేయకుండా చూస్తున్న అతని దృష్టిని ఏదో అద్భుత వస్తువు ఆకర్షించింది. దూరాన దేవదారు వృక్షపు కొమ్మమీద నల్లని నీడలాంటి వస్తువేదో కన్పించి అకస్మాత్తుగా మాయమయింది

విషాద భరితమగు ఆలోచనలలో మునిగివున్నప్పుడు మానవుని మనస్సును అతి సామాన్య విషయం కూడా అప్పు డప్పుడూ ఆకర్షిస్తూ వుంటుంది. చెట్టు మొదలును అంటి పెట్టుకొనివున్న ఆనీడ వున్నట్లుండి మాయమవటం మాధ వునికి ఆశ్చర్యాన్ని కలిగించింది. అతడు భ్రమపడలేదనేది మాత్రం నిశ్చయమే, అది మరొక చెట్టు మొదలుకావచ్చు లేదా చెట్టుకొమ్మ కావచ్చు అది తన స్థానం నుంచి కదిలింది. కాని మాధవుడు దానిని గురించి ఆలోచించలేదు. తన ఆలో

చనలలో మునిగిపోయాడు. మరికొన్ని క్షణాల అనంతరం మాధవుడు మళ్లీ అటువైపు చూచాడు. యింతకుముందు అదృశ్యమైన నల్లని నీడ తిరిగి అదే స్థానంలో కన్పించింది. ఈసారి అతనికి కొంత కుతూహలం కలిగింది. కొంచెం పరిశీలనగా అటే చూడసాగాడు. మళ్లీ వున్నట్లుండి ఆ నీడ మాయమయింది. ఆ వస్తువు కదలిక కలిగినదని ఇప్పుడు అతనికి స్పష్టంగా అర్థమయింది. ఆవస్తువు ఏమిటా అనే అతడు ఆలోచించ సాగాడు నీడ మళ్లీ కన్పించింది. అది అతనికి మనిషి తలవలె కన్పించ సాగింది. ఈసారి చెట్టుచాటునుండి మెడ భాగము కూడా కన్పించింది. మాటిమాటికి ఆ నీడ కన్పించి మాయమవటంలో మాధవుని కుతూహలం కూడా హెచ్చింది. దగ్గరగా వెళ్ళి అదేమిటో చూడాలనే కోర్కె కలిగింది.

మాధవుడు మనసులో ఏదైనా అనుకుంటే చాలు వెంటనే ఆరంభిస్తాడు. అదేమిటో తెలుసుకోవాలనే కోర్కె కలగగానే తానే వెళ్ళి ఆ చెట్టు చాటున ఉన్నది ఎవరో ఏమిటో చూడాలని నిశ్చయించుకున్నాడు. క్రిందికి దిగివచ్చి చిన్న కత్తిని తీసుకొని బయలుదేరాడు. కాని అక్కడికి వచ్చి చూస్తే అతనికి ఏమీ కన్పించలేదు. చుట్టూ వెతికాడు. ఎక్కడా ఏమీ కన్పించలేదు. చివరికి అతడు చెట్టు క్రిందికి వెళ్లాడు. అకస్మాత్తుగా గుడ్లగూబ కూతలాంటిదేదో విన్పించి మాధవుడు త్రుళ్ళిపడ్డాడు. అంతలోనే కత్తి ఉన్న అతని చేతిమీద బలమైనదెబ్బ తగిలింది.

ఆ మనిషి ఎవరో అతడు వెనుతిరిగి చూచేలోపుగా ఎవరివో బలమైన చేతులు నోటిని మూసివేశాయి; అదే సమయంలో మరొక వ్యక్తి చెట్టుమీదినుంచి క్రిందికి దూకాడు.

"కాళ్ళు, చేతులు బంధించు. వెతకబోయిన తీగ కాళ్ళకు తగిలినట్లయింది. ముందు నోటిలో గుడ్డలు కూరు" అని చెట్టుమీదినుంచి దూకిన వ్యక్తి నెమ్మదిగా ఆజ్ఞాపించాడు.

మాధవుని నోటిలో ఒక తువాలును కుక్కారు, కాళ్లు చేతులు బంధించివేశారు. ఎదురు తిరిగినా తాను వాళ్ళను ఏమీ చేయలేనని గ్రహించాడు మాధవుడు.

అతనిని భుజం మీదికి ఎత్తుకోమని ఆ వ్యక్తి మళ్ళీ ఆజ్ఞాపించాడు.

కాళ్ళు చేతులు బంధించిన వ్యక్తి దురదృష్టవంతుడగు ఆ యువకుణ్ణి తన బలమైన చేతులతో భుజం మీదికి ఎత్తుకున్నాడు. రెండో వ్యక్తి అతని వెనుక బయలుదేరాడు. వాళ్ళ పని సునాయాసంగాచాలా నిశ్శబ్దంగా జరిగిపోయింది. ఇంటిలోని వారికి ఎవరికీ ఈ విషయమే తెలియలేదు.

# 17

మన నవలలోని కథానాయకుడు మాధవఘోషు ఇలాంటి ఆపదలో చిక్కుకున్న సమయంలో మధురఘోషు విశ్రాంతి సుఖము ననుభవిస్తున్నాడు. మరింత స్పష్టంగా చెప్పాలంటే తార గదిలో విశ్రాంతి తీసుకొనుటకు ప్రయత్ని స్తున్నాడు.అతడు తలక్రింద చేయి పెట్టుకొని పడుకున్నాడు. తార అతని ప్రక్కనే కూర్చుని వట్టివేళ్ళ విసనకర్రతో విసురుతూ భర్తను నిద్రబుచ్చటానికి ప్రయత్నిస్తూఉంది. కానీ ఆమె ప్రయత్నము ఫలించటంలేదు. మధురఘోషు మొదలకుండా కన్నుమూసుకొని పడుకున్నప్పటికీ మధ్య మధ్య అతని హృదయాన్ని భేదించుకొని నిట్టూర్పులు వెలువడుతున్నాయి. దానివల్ల అతడు మనసులో ఏదో బాధపడుతున్నట్లు అర్థమవుతుంది. భర్తయొక్క వ్యాకులతకు కారణం ఏమిటో తారకు ఏమీ తెలియదు. నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ ఆమే మొదట మాట్లాడింది.

"మీరు నిద్రపోవటం లేదెందుకని?"

"నిద్ర రావటంలేదు. అదీగాక యింకా నేను నిద్ర పోయే సమయం కాలేదు."

"అయితే నిద్రపోవాలని యెందుకు వచ్చారు? నన్ను క్షమిస్తానంటే ఒక విషయం అడుగుతాను."

"ఏమిటో చెప్పు"

"మీ రెండుకో మనసులో బాధపడుతున్నారు. మిమ్మల్ని హృదయపూర్వకంగా ప్రేమించే నాతో చెప్ప టానికి మీకు సందేహం ఎందుకు?"

మధురబాబు తుళ్ళిపడ్డాడు. కానీ మరుక్షణంలోనే నిగ్రహించుకొని నవ్వుతూ మాట్లాడసాగాడు. తన సంతృప్తి కోసం భర్త నవ్వు తెచ్చిపెట్టుకొని మాట్లాడుతున్నారని తార గ్రహించింది.

"నువ్వు పిచ్చిదానివి ! మరీ విచిత్రంగా మాట్లాడు తున్నావు. నాకు దేనిని గురించి దుఃఖం కలుగుతుంది ?" అన్నాడు మధుర బాబు.

"నాథా! నన్ను సంతోషపర్చటానికి ప్రయత్నించ కండి. మీరు నన్నూ, నా ప్రేమనూ నిర్లక్ష్యం చేస్తున్న సంగతి నాకు తెలుసు. మా స్త్రీలకు భర్త అంటే ఏమిటో మీరు అర్థం చేసుకోలేరు. మాకు సర్వమూ భర్తే. మీరు అందరినీ మోసం చేయవచ్చు, నన్ను మాత్రం మోసం చేయలేరు."

"నీకు నిజంగానే పిచ్చిలేకపోతే నన్ను గురించి యిలాంటి విషయాలు ఆలోచించవు. ఇంతకూ నువ్వు అలా ఎందుకు ఆలోచిస్తున్నావో చెప్పు !" మధురఘోషు మాట లలోనే అతను అబద్ధం చెపుతున్నాడని ధ్వనిస్తోంది.

"అలా ఆలోచించటానికి కారణం మీరే. అనేక విషయాలలో ఆలోచనతో మీరు వ్యాకులపడతారు. జమిం దారీ వ్యవహారాలు, దావాలు, శిస్తులు, ఇలాంటి విష

యాలు, నౌకర్లను గురించి–ఇలాంటి వెన్నో మీరు ఆలోచిస్తూవుంటారు. నేను ఆలోచించ వలసిందేమిటి ? నా భర్తను గురించి, నా సమాత్రెను గురించి ఆలోచిస్తాను. మూడురోజులనుంచి నేను మిమ్మల్ని చూస్తున్నాను. మీలో పూర్వపు తీవి లేదు, ఆ చురుకుతనం లేదు – నాకు ఆశ్చర్యం కలుగదంటారా ? మీ కన్నుల్లో ఏదో నిరాశ వ్యక్తమవుతూ వుంది–మధ్య మధ్య చాలా విచిత్రంగా ఉరిమి చూస్తున్నారు. ఎప్పటివలె మీరు ఎక్కువగా మాట్లాడటంలేదు; మీ నవ్వు హృదయంలోనుంచి వచ్చే నవ్వుకాదు. తండ్రి తనబిడ్డను ఎంత ప్రేమగా చూస్తున్నాడు అని తల్లి ఎప్పుడూ గమనిస్తూనే వుంటుంది. గత మూడు రోజులనుంచి నేను చూస్తూనే వున్నాను–బిందు వచ్చి అడుగుతున్నా మీ చేతిని పట్టుకున్నా మీరు ఒక్క మాటకూడా మాట్లాడటంలేదు. చంపతో కూడా మీరు మాట్లాడటం నేను చూడలేదు"

తన సవతిని గురించి మాట్లాడినప్పుడు మాత్రం తార మనో భావంలో కొద్దిగా మార్పు కన్పించింది – ఒకకొంటె చిరునవ్వు ఆమె ముఖంలో క్షణకాలం కన్పించింది–"చంప కూడా చాలా రోజులనుంచి విచారంగా కన్పిస్తూవుంది. మీరు ఆమె మాటను కూడా సానుభూతితో విన్నట్లు నేను చూడలేదు. మాటి మాటికి అలా నిట్టూరుస్తారెందుకని ? ఇప్పటికైనా మీరు నిజం అంగీకరిస్తారా, లేక ఏమీ లేదనే అంటారా ?"

మధురబాబు ఏమీ జవాబు చెప్పలేదు.

భర్త మాట్లాడకుండా వూరుకోవటం చూచి తార

మళ్ళీ ఇలా అంది— "మీ దుఃఖంలో భాగం పంచుకునే అర్హత నాకు లేదంటారా ? మీరు నన్ను ప్రేమించటం లేదనే సంగతి నాకు తెలుసు."

భర్త ఏదైనా జవాబు చెపుతాడేమోనని తార కొద్ది క్షణాల వరకు ఎదురు చూచింది. అప్పటికీ అతడేమీ మాట్లాడలేదు. ప్రేమమూర్తి యగు భార్య పవిత్ర ముఖాన్ని అతడు రెప్ప వేయకుండా చూస్తూ కూర్చున్నాడు.

ఇప్పుడిక తార నిగ్రహించుకోలేకపోయింది. కన్నీరు ఆగలేదు. దుఃఖమువల్ల గొంతు పూడిపోయింది—"మీరుమనసులో ఏదో బాధపడుతున్నారు. నా వద్ద ఏమీ రేనీ దాచవద్దు— నన్ను మరిపించటానికి ప్రయత్నించకండి—మీరు మీ మనస్సులోని బాధను దాచకుండా నాతో చెప్పండి. మీ సుఖం కోసం నా జీవితాన్నైనా అర్పిస్తాను—" తరువాత పెల్లుబికి వస్తున్న దుఃఖము వలన ఆమె మాట్లాడలేకపోయింది.

అప్పటికీ మథురబాబు ఏమీ మాట్లాడలేదు. ఎగతాళి చేయటం, తర్కించటం, కాదని నిరాకరించటం మొదలగు అలవాట్లు అతనికి లేవు కఠోర గాంభీర్యం మూర్తీభవించినట్లు కూర్చున్నాడు. ఇంతకుముందు భార్య సంతృప్తి కోసం నవ్వటానికి ప్రయత్నించాడు — సంతోషంగా ఉన్నట్లే నటించాడు. కానీ ఇప్పుడు నిజంగానే అతని ముఖంలో వ్యాకులత స్పష్టంగా కన్పిస్తూ ఉంది. తార ఏడుస్తూనే తన భర్త ముఖంలో వచ్చే మార్పుల్ని గమనిస్తూ ఉంది.

"నా జన్మ నిరర్థకమే. భర్త సుఖంకోసం ఉపయోగ పడని జన్మ యెందుకు? భర్త సుఖంలో పాలుపంచుకోని భార్య బ్రతికి ఏం ప్రయోజనం? అయ్యో, నే నెంత నిర్భాగ్యురాలను" అంటూ తార దుఃఖపడసాగింది.

భార్య దుఃఖము మధురఘోషు హృదయాన్ని కదిలించింది. తన అపరాధాన్ని అంగీకరించే ధోరణిలో చివరికి అతను ఇలా అన్నాడు—"నా విచారానికి కారణాన్ని నీకు చెప్పకుండా దాచినందువల్ల లాభం యేమీ లేదు తారా! కానీ నీతో కూడా మనస్సు విప్పి చెప్పటానికి సాహసించలేకపోతున్నాను— దానిని గురించి నువ్వేమీ దుఃఖించవద్దు. అదీగాక అది నువ్వు వినతగిన విషయంకూడాకాదు."

భర్త మాటలు విని విషాదభరితమగు ఆమె ముఖములో ఒక క్షణకాలం తీవ్రమగు ఆవేదనా చిహ్నాలు కన్పించాయి. కానీ మరుక్షణంలోనే ఆమె సహజ శాంత స్వభావంతో లేచి నిలబడుతూ "నాదొక చిన్న కోర్కె చెల్లిస్తానని మాట ఇవ్వండి" అని అడిగింది.

ఇంతలోనే గుడ్లగూబకూతలాంటి వికటు కర్కశస్వరం విన్పించింది. ఆ శబ్దాన్ని విని మధురబాబు తటాలున లేచి నిలబడ్డాడు.

"ఏమండీ, మీరు త్రుళ్ళిపడ్డారెందుకు? ఆ కూత విని నాకూ భయం వేసింది; గుడ్లగూబ అరిచింది" అని అన్నది తార.

ఆ శబ్దము మరింతకర్కశంగా భయంకరంగా విన్పిం

చింది. తార ఏదో చెప్పబోతూ వుండగా అది విన్పించుకో కుండానే మధురబాబు గబగబ గదిలోనుండి బయటకు వెళ్ళిపోయాడు.

తార విస్మయంతో చూస్తూ ఉండిపోయింది. ఆ శబ్దము గుడ్లగూబ కూత అనటంలో సందేహమేమీ లేదు. ఏదో రాబోయే కీడును శంకించి ఆమె భయపడింది. ఇలాంటి అమంగళ ధ్వని ప్రజలు రోజూవింటూ భరిస్తూనే వుంటారు. ఆ అరుపు గుడ్లగూబ కూతవలె వుండే మరేదైనా నిశా చర పక్షి దేమో అనికూడా ఆమె ఒకసారి అనుకుంది. కుతూహల వశమున ఆమెకూడా గదిలోనుండి బయటకు వచ్చి వసారాలో నిలబడి చూడసాగింది. భర్త మెట్లుదిగి క్రిందికి వెళ్ళటం చూచి ఆమె మెట్లెక్కి పైకి వెళ్ళింది. అక్కడినుండి మరింత స్పష్టంగా చూడవచ్చునని ఆమె ఉద్దేశ్యం. కానీ ఆ శబ్దము విన్పించిన దిక్కుగా ఆమెకు ఏమీ కన్పించలేదు ఆ పక్షి ఈ చుట్టుపట్ల ఏ చెట్టుమీదనో వుంటుంది. ఈ వంకతో భర్తగదిలో నుండి బయటకు వెళ్ళి పోయాడు. అతడు బాధ పడటానికిగల రహస్యం ఏమిటో చెప్పబోతూ వుండగా ఇది జరగింది. తార ఇవన్నీ ఆలో చిస్తూ క్రిందికి దిగివచ్చే సమయంలో వెనుక ద్వారంలో నుంచి ఎవరోమనిషిబయటకు వెళుతూ ఉండటం చూచింది. భవనంలోని స్త్రీ లెవరూ కాదు_అతడెవరో పురుషుడే.

పరిశీలించి చూచింది. అతడు తన భర్తేనని గుర్తిం చింది__మధురబాబు ద్వారం దాటి గబ గబ అడవిలోనికి వెళ్ళిపోయాడు. తార విస్మయంతో నిశ్చేష్టురాలై అలాగే

నిలబడి పోయింది. ఆమె దేహంలో వణుకు పుట్టింది. తెలివి తప్పి పడిపోతానేమో నని ఆమె భయపడసాగింది. రకరకాల సందేహాలు గాలిదుమారమువలె ఆమె మనసును గందరగోళ పర్చాయి. భర్త అయోగ్యుడయినప్పటికి ఆమె అతనిని ప్రేమిస్తుంది—కానీ తన భర్త పైశాచిక పాపకార్యమేదైనా చేయగలడనిగానీ, చేసాడనిగానీ ఆలోచించలేక పోయింది. కానీ రాబోయే ఏదో కీడును శంకించి ఆమె మనసు విషాద భరితమయింది.

ఆమె అక్కడే నిలబడి తన భర్తనే చూడసాగింది. అకస్మాత్తుగా మధురబాబు మాయమై పోయాడు. అయినా ఆమె అటే చూస్తూ ఉంది—అంధకారంలో దీర్ఘకాయుడగు మధురబాబు చిహ్నలేమీ కన్పించనే లేదు. ఆమె చుట్టూ చూచింది—మరెంత భయపడసాగింది. ఆ విశాల భవనపు శిరోభాగాన చలనంలేని చలువరాతి విగ్రహంవలె తార చాలాసేపు నిలబడి అడవివైపు చూచింది. చివరకు నిరాశ చెంది ఆమె క్రిందికి వెళదామని అనుకున్న సమయంలో భర్త కనిపించాడు. ఇంతకు ముందు గిడ్డంగి భవనమని మనం చెప్పుకున్న ప్రాంతంలో పూర్తిగా శిథిలమై పాడుబడిన చోట ఒక చిన్న ఇనప తలుపు ఉంది. మధుర బాబు అటునుంచే లోనికి వచ్చాడు.

భర్త ఆమ భవనంలోనే ఏదో ఒకచోట ఉన్నందుకు ఆమెకు కొంత నిశ్చింత కలిగింది. అప్పటికీ ఆమె భయం పూర్తిగా

తీరలేదు. అర్థరాత్రి భర్త అడవిలోనికి వెళ్ళటం, రాత్రులు ఎవరూ వెళ్ళని ఆ శిథిల ప్రాంతంలోనుంచి భర్త బయటకు రావటం, అమంగళకరమగు ఆ పక్షికూత–ఇవన్నీ కలిసి ఏదో ఆపదను సూచిస్తున్నట్లు తార భయపడ సాగింది. అరగంటసేపు అక్కడే నిలబడి భర్త రాక కోసం ఎదురు చూచింది. కానీ ఆమె భర్త ఆ రహస్య ద్వారంనుంచి తిరిగి రాలేదు. ఎక్కువసేపు నిలబడలేక, తమ భవనంలో భర్తకు వచ్చే ఆపద ఏమీ లేదనుకొని తన గదిలోకి తిరిగివచ్చింది.

ఏమీ అర్థం కాకుండా ఉన్న ఆమెకు ఏదో వెలుగు రేఖ కన్పించింది. ఈ ఘటనకూ తన భర్త రహస్య విషయాలకూ ఏమీ సంబంధం లేదా? తార తన కర్తవ్యాన్ని నిశ్చయించుకుంది.

కొద్దిక్షణాల అనంతరం మధురబాబు తిరిగి ఆ గది లోకి వచ్చాడు. ఇప్పుడు అతడు మరింత అస్థిరంగానూ, వ్యాకులపడుతున్నట్లూ కన్పించాడు. కానీ అతని కన్నుల్లో వాక మూల విజయ గర్వము తొంగి చూస్తోంది. తార తాను చూచిన సంగతులేవీ అతనితో చెప్పలేదు.

# 18

ఇప్పుడు మనం వొక కొత్తప్రదేశంలోకి వెళదాము ఆ గది చూస్తేనే భయం వేస్తుంది. ఆ గది కప్పు అంత ఎత్తుగా లేదు. చిన్న దీపం ఒకటి మినుకు మినుకు మంటూ వెలుగుతూంది. అస్పష్టమైన వెలుగులో గదిగోడలు మరింత భయంకరంగా కన్పిస్తున్నాయి. ఎత్తుతక్కువగా ఉన్న గది కప్పు, వైశాల్యములో చాలా చిన్నదిగా ఉన్న ఆ గదిని చూస్తేనే అది మనుష్యులు నివసించటానికి నిర్మించలేదనీ, అపరాధులు మొదలగు వారిని బంధించటానికి నిర్మించారనీ అర్థమవుతుంది. ఆ గదికి ఒకే ఒక చిన్న ఇనపద్వారంఉంది. ద్వారంతో పోల్చిచూస్తే దాని గడియ చాలా పెద్దదిగా కన్పిస్తుంది.మినుకు మినుకు మనే ఆ దీపపు కాంతిలో భయంకరంగా కన్పించే ఆ ఇనప ద్వారము మనిషిని సజీవంగా పాతిపెట్టుటకు గుడ్లురిమి ఎదురు చూస్తున్నట్లుగా ఉంది.గదిలో మరొకమూల చిన్న ద్వారం ఒకటిఉంది. చిన్న పిల్లవాడు వంగి వెళ్ళటానికి సరిపడునంత ద్వారం అది. ఆ గదిలో సామాగ్రి ఏమీలేదు. గదిలో ఒకే ఒక మనిషి అంగలు వేస్తూ పచార్లు చేస్తున్నాడు. అతడు మరెవరో కాదు-మనకు చిరపరిచితుడగు మాధవుడే !

మాధవఘోషును తీసుకువచ్చిన యిద్దరు వ్యక్తులు అతనిని ఇక్కడే బంధించారు. కానీ వారిద్దరిలో యిక్కడ

ఎవరూ లేరు. తలుపులకు బయటనుండి గడియ తగిలించి తాళం వేశారు. ప్రస్తుతము మాధవఘోషు సజీవసమాధిలో ఉన్నట్లే. అయినప్పటికీ అతడు అధైర్య పడలేదు. నిర్జనంగా వున్న ఆ గదిలో అటు నిటు తిరుగుతూ తనను బంధించిన ఆ దుర్మార్గులు పెట్టే బాధల్ని తాను లెక్క-చేయకూడదని సంకల్పించుకున్నాడు.

ఇంతలో బయట తాళం తీస్తున్న చప్పుడు వినిపించింది, తరువాత గడియ తెరిచారు. కిరకిర శబ్దము చేస్తూ తలుపు తెరుచుకుంది. మాధవఘోషును బంధించి తెచ్చిన దొంగలు యిద్దరూ గదిలోనికి వచ్చి మళ్ళీ జాగ్రత్తగా తలుపు మూశారు.

మాధవుడు అత్యంత ద్వేషభావంతో వారిని చూచి కూడా చూడనట్లే నటించి గదిలో పచార్లు చేయసాగాడు. సర్దారు భీఖూ ఇద్దరూ దీపానికి దగ్గరగా కూర్చున్నారు భీఖూ చిన్న సంచీలోనుంచి గంజాయి, చిలుము తీసి గంజాయి బాగా నలిపి చిలుములో నింపాడు. సర్దారు దీపం వత్తిని ఎక్కిస్తూ వ్యంగ్యంగా "బాబుగారు యివాళ రాత్రి చాలా నిర్మలంగా కన్పిస్తున్నారు" అని అన్నాడు.

పచార్లు చేస్తున్న మాధవుడు ఒక క్షణకాలం ఆగి అటు చూచాడు; మాధవుడు అతనికి ఏదో జవాబు చెపుతాడేమో అనిపించింది. కానీ అంతలోనే. అటు తిరిగి మళ్ళీ పచార్లు చేయసాగాడు. చిలుములో నిప్పువేసి దొంగలిద్దరూ గంజాయి పీల్చసాగారు. మాధవుడు మౌనంగా తమను ద్వేషించటం వాళ్ళకు దుర్భరంగా ఉంది. అతడు తిరుగుతూ

మాట్లాడినా వాళ్ళకు కష్టం కలిగేది కాదు. సామాన్యంగా ప్రజలందరిచేత గౌరవించబడే వ్యక్తిని అత్యంత నీచులు మంచి చెడ్డల విచక్షణ లేని దుర్మార్గులుకూడా దూరంనుంచే గౌరవభావంతో చూస్తారు— ఎందుకనో వాళ్ళంటే భయపడతారు, గౌరవిస్తారు. అలాగే మాధవుడు సగర్వంగా గంభీరంగా తిరుగుతున్నప్పటికీ సర్దారు ఎగతాళి చేస్తూ మాట్లాడలేకపోయాడు. కానీ గంజాయి దమ్ము తలకెక్కేసరికి అతని భావం మారిపోయింది.

మాధవుని వంక చూచి ఎగతాళిగా నవ్వుతూ "ఒకటి రెండు పట్టులు పీల్చి చూస్తారా ? ఇవాళ గంజాయి చాలా అద్భుతంగా తయారయింది. ఇలాంటి గంజాయిని లక్షాధికారులు పీల్చినా తప్పులేదు."

అప్పటికీ మాధవుడు ఏమీ మాట్లాడలేదు. సర్దారుకు చాలా నిరుత్సాహం కలిగింది. గబగబ గంజాయి పీలుస్తూ ఛీఖూతో ఏవేవో బూతులు మాట్లాడసాగాడు.

చివరికి మాధవుడు వారివైపు చూచి "మీ యజమాని నన్నేమి చేయదలచాడో చెప్పగలరా?" అని ప్రశ్నించాడు.

"మాకు యజమాని ఎవరూ లేరు" అని గొణుగుతూ సర్దారు మళ్ళీ గంజాయి పీల్చి బూతు సంభాషణలో మునిగిపోయాడు.

"యజమాని లేకపోవచ్చు; ఈ పని చేయటానికి మిమ్మల్ని కూలికి పిలిచిన వ్యక్తి ఉంటాడు గదా !"—

మాధవుని మాట పూర్తవకముందే సర్దారు కఠోర

స్వరంతో "మమ్మల్ని ఎవరూ కూలికి కూడా నియమించ లేదు" అని చెప్పి మళ్లీ గంజాయి దమ్ము పీల్చాడు.

"ఎవరు చెపితే మీరీ పని చేశారు ?"

"మాకు ఎవరూ చెప్పలేదు."

"ఎవరూ చెప్పలేదా ? మరి నాతో ఆటలాడటానికి నన్ను బంధించి తీసుకు వచ్చారా ?"

"ఆటలాడటానికి కాదు. మాకు డబ్బుఅవసరం. డబ్బు కావాలి."

డబ్బుగలవాళ్లు తనను చూస్తేనే భయపడతారని సర్దారు విశ్వసించేవాడు. కానీ మాధవుడు నిర్భయంగా నిశ్చలంగా మాట్లాడటం చూచి సర్దారుకు కోపం వచ్చింది.

"మీకు డబ్బు ఎవరిస్తారు ?" అని మాధవుడు ప్రశ్నించాడు.

"మీరే ఆలోచించండి."

"అది ఆలోచించవలసిన అవసరం నాకేమిటి ?"

దీర్ఘంగా నిట్టూర్చిన శబ్దము విని సంభాషిస్తున్న వ్యక్తులు ముగ్గురూ ఉలిక్కిపడ్డారు.

"ఏమిటది ?" భీఖూ విస్మయంతో అరిచాడు.

సర్దారుకు కూడా ఆశ్చర్యంగానేవుంది – "నిజమే. ఏమిటది ?"

కాస్సేపటివరకు ముగ్గురిలో ఎవరూ మాట్లాడలేదు.

"ఈ గదిలో మరెవరైనా ఉన్నారా ఏమిటి ? చూద్దాం" అంటూ సర్దారు లేచాడు.

గదిలో ఎంత వెతికినా ఏమీ కన్పించలేదు. మళ్ళీ దొంగబిడ్డహూ దీపం దగ్గరకు వచ్చి కూర్చున్నారు. "చాలా విచిత్రంగావుంది! యిక ఆ సంగతి వదిలేద్దాం. బాబుగారూ, మా యజమానిని గురించి అడిగారు కదూ! వారెవరైనదీ బాబుగారికి తెలుసా?" అని అన్నాడు సర్దారు.

"తెలుసు. మధురఘోషు. నన్ను బంధించటంలో వారి అభిప్రాయమేమిటో చెప్పగలవా?"

భీఖూకు చాలా ఆశ్చర్యం కలిగింది—"సర్దార్, ఇతనికి అన్ని సంగతులు ఎలా తెలిశాయి?" అని సర్దారు చెవిలో అడిగాడు.

సర్దారు కూడా నెమ్మదిగా అతనితో ఇలా అన్నాడు "మూర్ఖుడా, యిందులో ఆశ్చర్య పడాల్సిందేముంది! రాధాగంజ్‌లో యినపబోనుల వంటి యిలాంటి గదులు మరెవరికున్నాయి?"

కానీ సర్దారు మాధవుని ప్రశ్నకు ఏమీ జవాబు చెప్పలేదు. భీఖూకు కూడా గంజాయి నిషా బాగా తల కెక్కసాగింది. మామూలు సమయాల్లో అతడు చాలా తక్కువ మాట్లాడతాడు; కానీ గంజాయి నిషాలో అంతకు రెట్టింపు మాట్లాడతాడు — "నువ్వు నాకెందుకయ్యా బాబూ, మాకు డబ్బుకావాలి."

"మనిషిని మాత్రం తినకూడదా ఏమిటి?" అని సర్దారు నవ్వాడు. అతని నవ్వు ఆగక ముందే భయంతో

అలాగే నోరు తెరచి చూస్తూ వుండిపోయాడు. మళ్ళీ ఎవరో మూల్గుతున్న శబ్దము విన్పించింది.

"మళ్ళీ విన్పించింది !" అన్నాడు సర్దారు భయపడుతూ.

భయంతో భీఖూ నోటివెంట మాటరాలేదు. అతనికి భూతప్రేతాలు గుర్తొచ్చాయి.

భీఖూ సర్దారుతో గుస గుస లాడాడు – "చాలా కాలంగా ఈ గదులన్నీ కాళీగా వుంటున్నాయి. అందుకని భూతప్రేతాలు నివాసం ఏర్పరచుకున్నాయేమో !"

అంతకంటె సాహసంగల సర్దారుకు కూడా భూతప్రేతాలంటే భయమే, కానీ అప్పుడు అతడు దానినేమీ లెక్క చేయలేదు. ఈ దొంగల వృత్తే అలాంటిది – వాళ్ళు యిలాంటి నిర్జన ప్రదేశాలలోనూ భయంకర ప్రదేశాలలోనూ తిరుగుతూనే వుంటారు. సామాన్య ప్రజలు భూతప్రేతాలుంటాయని భయపడే ప్రదేశాలకు కూడా వీళ్ళు వెళ్ళవలసి వస్తుంది. అంతమాత్రాన వాళ్ళకు భయం లేదని కాదు, దానికి కూడా వాళ్ళు అలవాటు పడిపోతారు.

"భీఖూ, నువ్వు బాబుగారిని చూస్తూవుండు. చుట్టుపట్ల ఎవరైనా దాగివున్నారేమో చూచివస్తాను" అని సర్దారు లేచాడు. ఒక గుడ్డపీలిక ఉంచి వత్తిగా తయారుచేసి నూనెలో ముంచి వెలిగించాడు. దానిని పట్టుకొని సర్దారు తలుపు తెరుచుకొని బయటకు వెళ్ళాడు

బయట వసారాలో నలుమూలల వెతికి చూచాడు. ఆ గదికి అటూ ఇటూ ఉన్న గదులలో కూడా వెతికాడు. గది ముందున్న ఖాళీ స్థలంలో కూడా ఎవరూ కన్పించలేదు. చివరికి నిరాశచెంది సందేహిస్తూ గదిలోకివచ్చాడు. సర్దారు వచ్చే లోపల భీఖూ చాలా భయపడుతున్నాడు. త్వరగా పని ముగించికొని వెళదామని అతడు మో చేతితో పొడుస్తూ సర్దారుకు సైగ చేశాడు.

సర్దారు అతని భావాన్ని గ్రహించి మాధవునితో ఇలా అన్నాడు— "మాధవ బాబూ, మాకు ఆలస్యమవు తుంది. ఇది మేము నిద్రపోయే ప్రదేశం కాదు. మేముచెప్పే షరతుకు మీరు అంగీకరించినట్లయితే ఇప్పుడే మిమ్మల్ని వదలి వేస్తాము."

"ఏమిటా షరతు ?"

"మీ పినతండ్రిగారు వ్రాసిన వీలునామాను నాకివ్వండి."

"అది నా వద్ద లేదు గదా!" అని మాధవుడు గదిలో పచారు చేయసాగాడు.

"అయితే, ఇక్కడే మీరు కృశించిపోతారు. మేము బయట తాళం వేసి వెళ్ళిపోతాము" అని చెప్పాడు సర్దారు.

"ఒకవేళ నేను నీకు ఆ వీలునామాను ఇవ్వాలనుకున్నా ఇక్కడ ఉండి ఎలా ఇవ్వగలుగుతాను ?"

"ఆ ఏర్పాటుకూడా మీరే ఆలోచించాలి. మీస్థితిలో నేనే గనుక ఉంటే బంధించిన వారి చేతికి ఉత్తరం వ్రాసి ఇచ్చి వీలునామాను తెప్పించేవాడిని."

"నేను ఎక్కడినుండిఉత్తరాన్ని పంపానని మాఇంట్లో అడిగితే ఏం చెపుతారు ?"

మళ్ళీ అదే భౌతిక శబ్దం విన్పించింది. ఒక మూలుగు కానీ మనిషి అలాంటి శబ్దం చేయలేడేమో ! ఈసారి ఆ శబ్దము గది పైభాగంనుండి వస్తున్నట్లుంది.

దొంగ లిద్దరూ భయంతో అలాగే నిలబడిపోయారు. మాధవుడు కూడా కొంచెం చలించాడు.

"రెండో అంతస్తులో, దీనిమీద మరొక గది ఉన్నదా?" అని ప్రశ్నించాడు మాధవుడు.

"లేదు, లేదు" అని దొంగలిద్దరూ ఒకేసారి జవాబు చెప్పారు.

"ఆగండి. నేను పైకివెళ్ళి చూచి వస్తాను" అని అన్నాడు సర్దారు.

సర్దారువంటి గజదొంగకు ఎత్తు తక్కువగావున్న ఆ గదిమీదికి ఎక్కటం కష్టమైన పనేమీ కాదు. ఎగిరి ప్రక్కనే వున్న గోడమీదికి ఎక్కి దానిమీదుగా గదిపైకి వెళ్లాడు. అక్కడ ఏమీ లేదు. అక్కడినుండి గది వెనుక వైపుకు కూడా తొంగి చూచాడు. ఏమీ కన్పించలేదు. క్రిందికి దిగి సర్దారు గదిలోకి వచ్చాడు.

"ఈ గదికి అటూ యిటూ మరి రెండు గదులు ఉన్నాయి కదూ?" అని అడిగాడు మాధవుడు.

"అవును, ఉన్నాయి."

"ఆ గదులలో కూడా మరెవరినైనా బంధించారా?"

"ఎవరినీ బంధించలేదు."

"మరెవరైనా బంధించి తీసుకువచ్చారేమో! వాళ్ళు పెట్టే బాధలు భరించలేక ఎవరో నిర్భాగ్యుడు మూలుగుతున్నాడు" అని మాధవుడు తనలో తానే అనుకున్నట్లు గొణిగాడు.

"అవునవును. అది నిజమే కావచ్చు వెళ్ళి చూచి వస్తాను" అని సర్దారు గుడ్డతో మరొక వత్తి తయారు చేసి వెలిగించుకొని వెళ్లాడు. కానీ ఆ గదులలోనూ ఎవరూ లేరని సర్దారు వచ్చి చెప్పాడు.

మాధవునికి కూడా ఈసారి నిజంగానే ఆశ్చర్యం కలిగింది. మనుష్యులు తిరగ గలిగే ప్రదేశాలన్నీ వెతికి చూచారు దొంగల సర్దారుకు అక్కడ నిజంగానే భూత ప్రేతాలు ఉన్నాయని నమ్మకం కలిగింది.

"ఇక మేము ఇక్కడ ఒక్క క్షణం కూడా వుండము. భూత ప్రేతాల సంగతి ఆ భూత ప్రేతాలకే తెలియాలి. మీరేదైనా చెప్పదలిస్తే చెప్పండి, లేదా మిమ్మల్ని ఇక్కడ బంధించి మేము వెళ్ళిపోతాము" అని చెప్పాడు సర్దారు మాధవునితో.

వాళ్ళ షరతుకు అంగీకరించటం తప్ప మరొక మార్గమేదీ లేదని మాధవుడు ఆలోచించాడు. తలుపులు మూసి వెళ్ళిపోతే మళ్ళీవస్తారో లేదో కూడా తెలియదు. వాళ్ళ షరతుకు అంగీకరించి ఉత్తరము వ్రాసిపంపితే బంధువులలో ఎవరైనా తనను వెతుకుతూ రావచ్చు. అయినా మరొక ప్రయత్నం చేసి చూద్దామని అతడు సర్దారుతో యిలా అన్నాడు:

మీకు డబ్బుకావాలి. వీలునామా మీచేతికి చిక్కితే దానికి బదులు మీకు డబ్బు వస్తుంది. దానికి మీకు ఎంత డబ్బు లభిస్తుందో చెపితే నేను అంతకు రెట్టింపు డబ్బు మీకిస్తాను-వీలునామాకు బదులు డబ్బుతీసుకొని నన్ను వదలి వేయరాదా ?"

"వీల్లేదు, మాకు మీ డబ్బువద్దు. మిమ్మల్ని నమ్మి వదలి వేయటానికి మేము మూర్ఖులం కాదు. ఒకసారి మీరు తప్పించుకు వెళ్ళగలిగితే మీరు మాకు డబ్బు యిస్తారా ? మోసం చేస్తారు. ఉత్తరము వ్రాసి ఇవ్వండి, లేదా మేము వెళ్ళిపోతాం"

గదిలోపలే ఎక్కడో దుస్తులు రెపరెప లాడిన చప్పుడు విన్పించింది దొంగలు ఒకరి ముఖాలు ఒకరు చూచుకో సాగారు. ఇక యిక్కడినుంచి ఎంత త్వరగా పారి పోగలిగితే అంతమంచిదని ఆలోచించ సాగారు. మాధవుడు వారి మనోభావాన్ని గ్రహించాడు. కలము కాగితము

తీసుకు రమ్మని చెప్పాడు. అవి దొంగల వద్ద సిద్ధముగానే ఉన్నాయి. మాధవుడు కూర్చుని తన గుమాస్తాపేర ఉత్తరం వ్రాయసాగాడు.

"నేను చెప్పినట్లే వ్రాయండి. మోసంచేసి మమ్మల్ని పట్టించటానికి మాత్రం ప్రయత్నించకండి. నేనూ ఒకప్పుడు మీవలెనే వ్రాయగలవాడినని గుర్తుంచుకోండి" అన్నాడు సర్దారు.

మాధవుడు ఆశ్చర్యంగా సర్దారు వైపు చూచాడు. అతడు చెప్పిన ప్రకారంగానే ఉత్తరం వ్రాయసాగాడు.

ఇంతలో సంకెళ్లు గం గల లాడిన గంభీర శబ్దము, తప తప అడుగుల చప్పుడు గదిలోని వారికి ప్రచండ మేఘ గర్జనతోపాటు పిడుగు పడినట్లే విన్పించింది. మరుక్షణంలోనే ఆ అలౌకిక ఆర్తస్వరం భీషణంగానూ, కర్కశంగానూ విన్పించింది. భీఖూ ఒక్క గంతులో వసారాలోకి వెళ్ళి భయపడి అరుస్తూ బయటకు పరుగెత్తాడు. సర్దారుకూడా భయపడి వసారాలోకి వచ్చాడు. అక్కడ అతడు ఏదో దృశ్యము చూచి భయంతో నిలబడలేక తాళం వేయటం కూడా మరచిపోయి వెనక్కి తిరిగి చూడకుండా పారిపోయాడు. ఇప్పుడు మాధవుడు పూర్తిగా విముక్తి చెందాడు.

ఈ అలౌకిక శబ్దాలవల్లనూ, తలవని తలంపుగా దొంగలుపారిపోయినందువల్లనూ మాధవుడుకింక ఆర్తవ్యతా విమూ

ధుడై తన పరిస్థితిని గురించి కూడా శాంతచిత్తుడై ఆలో చించ లేకపోయాడు. కొద్ది క్షణాల వరకు అతడు అలాగే నిలబడి ఉండిపోయాడు. ఏమి చేయాలో కూడా నిశ్చయించు కోలేక పోయాడు. కానీ మరుక్షణంలోనే సిగ్గుపడి భయాన్ని త్యజించి వసారాలోకి వచ్చాడు. మొదట ఏమీ కన్పించ లేదు. కాస్సేపు ఎదురు చూచే సరికి వసారాలోవున్న ఒక గదిలోనుంచి సన్నని వెలుగు కన్పించింది. మాధవుడు అటు పరుగెత్తాడు. తలుపు తెరిచేవుంది—ఆ నిర్జన ప్రదేశంలో ఒక స్త్రీ నిలబడివుంది. ఒక చిన్న లాంతరు క్రింద పెట్టివుంది. లాంతరు వెలుగులో ఆమె ఎవరో పరిశీలించి చూడాలని అతడు అనుకున్నాడు. అంతలోనే అతడు అమితాశ్చర్య ముతో "తారా!" అని అన్నాడు.

తారకూడా ఆశ్చర్య పడుతూ "మాధవ్?" అని మాత్రమే అనగలిగింది.

అప్పుడు కూడా పైనుండి ఆ మూలుగు విన్పిస్తూనే వుంది.

# 19

శైశవం నుంచే తార, మాధవుడు పరిచితులు. తార తండ్రిగారు మాధవుని తాతగారు ఒకే గ్రామవాసులు. చిన్నతనంలో మాధవుడు తరచు తాతగారింటికి వెళుతూ ఉండేవాడు. అక్కడ ఆటలలో తార అతని స్నేహితురాలు. దూరపు చుట్టరికం కూడా ఉన్నందువల్ల చిన్నతనంలో ఇద్దరూ సన్నిహితంగా ఆటలాడుకొంటూ ఉండేవారు. తార మాధవునికంటె వయస్సులో రెండుమూడేండ్లు పెద్దది, అయినా అతడు ఆమెను 'తారా!' అనే పిలిచేవాడు. మధురబాబుతో ఆమెకు వివాహం జరిగిన తరువాత కూడా వాళ్ళిద్దరి మనోభావాలలో ఏమీ మార్పు రాలేదు. చిన్నతనంలోని సన్నిహిత స్నేహంవల్ల ఒకరంటే ఒకరికి చాలా ప్రేమ. కానీ వాళ్ళ హృదయాలు మాత్రం అత్యంత పవిత్రంగానే ఉన్నాయి పిన్నితో వచ్చిన దావా విషయంలో మధురబాబు చాటుగా ఆమెకు సహాయం చేస్తున్న సంగతి మాధవునికి తెలుసు. అప్పటినుంచే అన్నదమ్ముల స్నేహానికి కొంత అంతరాయం కలిగింది. మాధవుడు అప్పుడప్పుడు మధురబాబు ఇంటికి వచ్చి పోతూ ఉండేవాడు. ఇప్పుడు అది కూడా ఆగిపోయింది. మధురబాబుకంటె వయస్సులో మాధవుడు చాలా చిన్నవాడు. అందువల్లకూడా మాధవుడు చనువుగా తారతో మాట్లాడుతూ ఉండేవాడు. వదిన – మరిదుల సంబంధాన్ని ఉపయోగించుకొని మాధవుడు అక్కడికి వెళితే

ఆమెతో మాట్లాడకుండా వచ్చేవాడు కాదు. ఈ విధంగా ఒకరి నొకరు గౌరవించుకుంటూ ఎంతో ఆప్యాయంగా మాట్లాడుకునేవారు. శైశవంలోని స్నేహము అభివృద్ధి చెంది పరస్పర ఆదరభావంతో వారిద్దరి మధ్య నిష్కల్మషమగు అక్కా తమ్ముల స్నేహసంబంధం ఏర్పడింది.

ఆ స్థితిలో కూడా గిడ్డంగి భవనంలో ఇంత రాత్రివేళ ఇద్దరూ కలుసుకున్నప్పుడు ఇద్దరిలోనూ ఒకవిధమగు వ్యాకుల భావము కలిగింది. కాస్సేపటివరకు ఎవరూ మాట్లాడలేక పోయారు చివరికి తార "మాధవ్, ఇదేమిటి? ఇక్కడికెలా వచ్చావు ?" అని అడిగింది.

మాధవుడు తారను కూడా అదే ప్రశ్న అడగలేక పోయాడు. ఏమి జవాబు చెప్పాలో కూడా తెలియక మెదల కుండా వూరుకున్నాడు. యిలాంటి పరిస్థితుల్లో పురుషుల కంటె స్త్రీలే చురుకుగా వ్యవహరిస్తారు. నిగ్రహశక్తి కూడా స్త్రీలలోనే అధికంగా ఉంటుంది. తన నడవడిని గురించి ఆమెకు చాలా నమ్మకంవుంది. మరొకరు సందేహిస్తారనే భయం కూడా లేదు. మాధవునికి తనయందు ఎంత గౌరవ భావమున్నదో కూడా ఆమెకు తెలుసు. అందుకని ఆమె స్థిమిత పడి యిలా అడిగింది—"మరదిగారూ, యింతకు ముందు యమదూతలవంటి వాళ్ళిద్దరు పారిపోయింది, వాళ్ళెవరు ? అలాంటి మనుష్యులతో కలిసి మీరు మా యింటికి వచ్చిన పనేమిటి ? ఎంత ఆలోచించినా నాకేమీ అర్థం కాలేదు.

నేను వసారాలో నిలబడి ఉన్నప్పుడు వారిలో ఒకడు మిరి మిరి నావైపు చూచాడు. బహుశా నేను దెయ్యాన్నను కొని పారిపోయాడు."

"తలుపులు తెరిచి గొలుసులు గలగల లాడించింది నువ్వేనా ?"

"అవును, నేనే. తలుపు తెరుచుకొని గదిలోనికి వెళదామనుకుంటూ ఉండగా నువ్వు వచ్చిన గదిలోనుంచి వచ్చిన యిద్దరు యమదూతల్ని చూచి భయపడి తిరిగి వెళ్ళి పోతున్నాను"

"కాని ఆ శబ్దం ఎక్కడినుంచి వస్తోంది?"

"ఏ శబ్దం?"

"నువ్వు విచిత్రమైన శబ్దమేదీ వినలేదా?"

"విన్నాను, బాధతో మూల్గుతున్న శబ్దము. అది మీ గదిలోనుంచే విన్పిస్తుందని నే ననుకున్నాను."

"కాదు"

"కాదా? నువ్వు నన్ను భయపెడుతున్నావు. అలా అయితే నేను వెంటనే వెళ్ళిపోతాను."

"నేను ఇక్కడికి ఎందుకు వచ్చానో తెలుసుకో కుండానే వెళ్ళిపోతావా?"

"లేదు, లేదు. నువ్వు ఇక్కడికి యెందుకు వచ్చావో చెప్పు. నేను వచ్చిన కారణం కూడా నీతో చెపుతాను. త్వరగా చెప్పు."

'సంతోషంగా చెపుతాను. ముందు ఒకసారి బయట చూసి వస్తాను. నేనీ మాట ఎందుకు చెపుతున్నానో తరువాత నీకే అర్థమవుతుంది.'

మాధవుడు ఒకసారి బయటకు వెళ్లి చూచివచ్చాడు. తరువాత గిడ్డంగి భవనంలోనుంచి బయటకు వెళ్ళే తలుపు తెరిచాడు. తారను తనవెంట రమ్మని చెప్పి ఇంతకుముందు తనను బంధించిన గదిలోనికి వెళ్లాడు. యిద్దరూ అక్కడ కూర్చున్నారు. ఒక్క అక్షరం కూడా దాచకుండా ఏమీ కల్పించకుండా తనను బంధించినది మొదలు ఇప్పటివరకు జరిగిన విషయాలన్నీ తారతో చెప్పాడు. తారకు భర్త యందు యెంతప్రేమ ఉన్నప్పటికీ ఆమె హృదయంలోని పవిత్రత మధురబాబు చేసే యిలాంటి అసహ్యకరమగు పనుల్ని సమర్థించదని మాధవునికి విశ్వాసం ఉంది. ఇదంతా విని తార హృదయం విల విల లాడింది.

"అంటే నేను వెతుకుతూ వచ్చినది నువ్వు కాదనే గదా! నువ్వు యివాళ సాయంత్రమే వచ్చావు, నేను సందేహించి వచ్చిన పని రెండు రోజుల క్రితమే జరిగిఉంటుంది" అని అంది తార.

తార యిక్కడికి ఎందుకు వచ్చిందో మాధవునితో చెప్పింది. భర్త వ్యాకుల పడుతూ ఏదో దిగులుగా వుండటం చూచి రక రకాల ఆలోచనలతో ఆమె బాధపడేది. భర్త విచారానికి కారణం ఏమిటో తెలుసుకోలేక పోయింది. భర్తను అడిగినా అతడేమీ జవాబు చెప్పలేదు. ఒకనాడు భర్త రహస్యంగా యిటురావటం చూచి అతని విచారానికి కారణం యిక్కడే వున్నదని గ్రహించింది. ఏదో విధంగా యిక్కడికి వచ్చి ఆమె ఆ కారణం తెలుసుకోవాలని నిశ్చ యించుకొని భర్త నిద్రపోతున్న సమయంలో తలగడక్రింద వున్న తాళం చెవుల్ని దొంగిలించి యిక్కడికి వచ్చింది.

"నిన్ను యిక్కడ చూడగానే ముందు నువ్వే నాభర్త విచారానికి కారణమని అనుకున్నాను. కానీ నువ్వు ఇవాళ సాయంత్రమే వచ్చానని చెప్పావు; కనుక అందుకు మరేదో కారణం వుండి వుంటుంది" అని తాను వచ్చిన పని నెరవేర లేదన్న నిరాశను వ్యక్తం చేసింది తార.

"నువ్వు నిరాశ చెందనవసరం లేదు-ఆ శబ్దం-నువ్వు వినలేదా ? దాని రహస్యం ఏమిటో ఇంతవరకు తెలియ లేదు."

ఆమాటవిని తార భయపడ సాగింది.

"భయపడకు. భయపడాల్సిందేమీ లేదు. నేను విన్నది, చూచినది చెపుతాను. భయపడనని మాట ఇవ్వు— అలా అయితేనే చెపుతాను."

తార నెమ్మదిగా భయపడనని చెప్పింది. దొంగలతో తాను మాట్లాడుతున్న సమయంలో వినిపించిన శబ్దాలను గురించి తారతో చెప్పాడు. భూతప్రేతా లనుకొని తార భయపడకూడదనే ఉద్దేశ్యంతోనే అతడు చెప్పాడు.

స్త్రీలు సహజంగానే భూతాలంటే భయపడుతూ ఉంటారు. తార మనస్సులో భయమూ కుతూహలమూ రెండూ ఉన్నాయి భర్త విచారానికి కారణం తెలుసుకోవా లని వచ్చిన తనకు ఇలాంటి భయంకర పరిస్థితిని ఎదుర్కొనవలసి వస్తుందని ఆమె వూహించనైనా లేదు. ఇక్కడికి వచ్చినం దుకు ఆమె ఇప్పుడు పశ్చాత్తాప పడుతూఉంది. తనను లోపలి వరకు పంపమని ఆమె మాధవుణ్ణి వత్తిడి చేసింది.

మాధవుడు ఉద్రేకపడుతూ ఆమెను నచ్చచెప్పాలని ప్రయత్నించాడు—"ఇంతమాత్రానికే అధైర్యపడుతున్నావా ! ఇందులో భయపడాల్సిన పనేమీ లేదని ప్రమాణం చేసి చెపుతున్నాను గదా !"

క్షణక్షణానికి మాధవునికి మరింత కుతూహలం కలు గుతూ ఉంది. రాత్రి సమయంలో ఏకాంతంగా తారతో తాను కలిసి ఉండటం ఎవరైనా చూచినట్లయితే అనవసర నిందలు వస్తాయని కూడా అతడు భయపడడంలేదు——అతడు భయాన్నే మర్చిపోయాడు.

దొంగలు ఆ ప్రదేశమంతా వెతికారు. కానీ అక్కడ ఎదురుగా ఒక గదిలో వాళ్లు చూడలేదు. ఆ గదికి తాళం

వేసి ఉంది. మాధవుడు తారకు ఆ గదిని చూపించి ఆ రహస్యానికి కారణం ఆ గదిలో ఉండవచ్చునని చెప్పాడు.

అదే సమయంలో మళ్ళీ అలాగే మూల్గటం వినిపించింది. అతి సమీపంనుంచే ఆ శబ్దం వినిపిస్తున్నట్లుంది. అది విని యిద్దరూ త్రుళ్ళిపడ్డారు. వేదనాభరితమగు ఆ ర్తస్వరము ఇద్దరికీ బాధ కలిగించింది.

తన తలలో ఎవరో కొరడాతో మోదినట్లు మాధవుడు విలవిల లాడిపోయాడు. తార చేతిలోనుంచి వెంటనే తాళం చెవుల్ని లాక్కొని అతడు గదిముందుకు పరుగెత్తాడు. ఒకటి – రెండు – మూడు తాళం చెవుల్ని వుపయోగించి చూచాడు. లాభం లేకపోయింది. మరొక తాళం చెవిని ఉపయోగించాడు – గాలిలోకి ఎగిరిపోయినట్లు విచిత్రంగా తలుపు పైకి వెళ్ళిపోయింది.

ఆవేశంలో మాధవుడు ఏమీ ఆలోచించలేక పోతున్నాడు. అతడు గబగబ గదిలోనికి వెళ్ళి "తారా, తారా! త్వరగా రా! ఆలస్యం చేయకు" అంటూ కేకలు పెట్టాడు. ఆ తొందరలో అతని శరీరం అనేక చోట్ల గీరుకు పోయింది.

తారకు కూడా ఆదుర్దాగానేవుంది. దీపాన్ని చేత్తో పట్టుకొని ఆమె కూడా అతని వెనుక గదిలోనికి వెళ్ళింది. గదిలో ఒక ప్రక్కన పైకి వెళ్ళటానికి యిరుకైన చిన్న చిన్న మెట్లు కన్పించాయి. ఆనంద విస్మయాలతో మాధవుడు మాట్లాడకుండా మెట్లెక్కాడు. తార కూడా అమితాశ్చర్యముతో అతని వెనుకనే పైకి వెళ్ళింది.

మెట్లగుండా పైకి వెళ్ళిన తరువాత అక్కడ మరొక ద్వారం వుంది. అంతమాత్రాన అది రెండో అంతస్తు మాత్రం కాదు. బయటకు ఇది ఒకే గదిగా కన్పిస్తుంది. నేర్పుగా ఒకే గదిలో యితరులకు తెలియకుండా మరొక గదిని నిర్మించారు. పై గదికి కిటికీలు లేవు.

మాధవుని శరీరం కంపిస్తూవుంది. అతడు అమితావేశంలో ఆ ద్వారానికి వున్న తాళాన్ని తెరవటానికి ప్రయత్నించాడు. వ్రేళ్ళుగాయపడి రక్తంతో తడిసి పోయాయి. చివరికి ఎలాగైతేనేం; తాళం తెరిచి లోనికి ప్రవేశించాడు. తార కూడా అతని వెనకే వుంది. గదిలో వార్నిషు వేసిన ఒకటేకు మంచంవుంది_పైనుంచి దోమతెర వ్రేలాడుతూ వుంది. మంచం మీద ఎవరో స్త్రీవుంది. తార, మాధవుడు యిద్దరూ గబగబ మంచం వద్దకు వెళ్ళి చూచారు. మినుకు మినుకు మంటున్న కాంతిలో కూడా వాళ్ళిద్దరూ మాతంగినిని గుర్తించారు_కృశించి నీరసించి మంచం మీద పడి వుంది. కానీ ఆమె అలౌకిక సౌందర్య రూపము మాత్రం తగ్గలేదు.

# 20

తార, మాధవుడు ఇద్దరూ కలిసి నిర్జీవంగా పడిఉన్న మాతంగిని దేహాన్ని మరొక గదిలోకి చేర్చారు. అకస్మాత్తుగా ఇతరులెవరైనా అక్కడికి వస్తారనే భయం లేదు. అసామాన్యమగు తారసేవల వల్లను, చల్లని గాలి తగలటంవల్లను తూర్పుదిక్కు అరుణారుణం కాకముందే మాతంగినిలో ప్రాణ సంచారం కలిగింది. ఆమెకు మళ్ళీ నూత్న జీవితం లభించింది. ఆమెకు భోజనం పెట్టారు. మాతంగిని కొద్దిగా భోజనం చేసింది. అయినా ఆమెకు తగినంత శక్తి చేకూరింది. తార కిటికీలో కూర్చుని తూర్పు ఆకాశంలోకి చూస్తూ మాతంగిని దుఃఖ గాథను వింటూ ఉంది.

మధురఘోషు, సుఖీ తల్లివెంట మాతంగినిని భర్త ఇంటికి పంపినప్పుడు ఆమె ఎలాంటి రాక్షసుని చేతిలోచిక్కుకున్నదో వూహించలేనైనా లేదు. సుఖీ తల్లికి అన్నీ నేర్పి పంపారు. వెళుతూ వెళుతూ ఆ వృద్ధురాలు దారిలో మాతంగినిని "భర్త వద్దకు వెళ్ళటానికి భయంగా ఉందా ?" అని అడిగింది.

"ప్రపంచంలో నాకు మరెక్కడ ఆశ్రయం లభించినా నేను అక్కడికి తిరిగి వెళ్లాలని కోరుకోను" అని మాతంగిని జవాబు చెప్పింది.

"అయితే, నేను నీకు సహాయం చేయగలను. నిన్ను ఎవరికీ కన్పించకుండా ఒకచోట దాచివేస్తాను" అని చెప్పింది ఆ ముసలి రాక్షసి.

పెద్దమ్మగారి నడిగి డబ్బు తీసుకొని మాతంగినిని పుట్టినింటికి పంపుతానని చెప్పి అంతవరకు తాను చెప్పిన చోట ఉండమని సుఖి తల్లి మాతంగినిని ఆగదిలోకి తీసుకువెళ్ళింది. గదిలోకి మాతంగిని వెళ్ళి వెనక్కి తిరిగేలోపల సుఖితల్లి బయట నుండి తలుపు వేసి వెళ్ళిపోయింది. తానొక భయంకరమైన వలలో చిక్కుకున్నట్లు మాతంగినికి అప్పుడు అర్థమయింది ఈ పరిస్థితిలో తానేమి చేయాలో కూడా ఆమె వెంటనే నిశ్చయించుకుంది.

సాయంత్రం కాగానే మధురఘోషు అక్కడికివచ్చి ఆమె పాదాలపై బడ్డాడు. మాతంగిని అతనిని అసహ్యించుకుంది. అతని కోర్కెను నిరాకరించింది. ఏ విధంగానైనసరే తన కోర్కె చెల్లించుకోవాలని మధురఘోషు ప్రతిజ్ఞ చేశాడు. అతడు వెళుతూ వెళుతూ పైశాచిక దృష్టితో మాతంగినివైపు చూచి "ప్రాణేశ్వరీ, నువ్వు నా ఎదుటనే ప్రాణాలు వదలాలి" అని అన్నాడు.

మాతంగిని కన్నులనుంచి నిప్పులు కురుస్తున్నాయి. ఆమె మధురఘోషు ఎదుటకువెళ్ళి నిలబడి — "నా వంక చూడు, నేను స్త్రీ నయినప్పటికీ యువతిని. నీ కంటె నాలో తక్కువ బలం లేదు. నీ కోర్కె నెరవేరుతుందని మాత్రం ఆశించకు" అని హెచ్చరించింది.

బల పరీక్షకు వచ్చిన ఈ విచిత్ర ఆహ్వానానికి మధుర ఘోషు నిశ్చేష్టుడై అలాగే చూస్తూ ఉండిపోయాడు.

"నీ జఠరాగ్ని నాకు సహాయం చేస్తుంది. అంతకు మించి నీమీద మరే ఆయుధాన్నీ ప్రయోగించను" అని చెప్పి మధురబాబు ఆ నాటినుంచి ఆమెకు భోజనం పెట్టటం మానేశాడు. ఆ విధంగా ఆమెను లొంగతీసుకోవచ్చునని అతని ఆశ. నిరాహారంగా ప్రాణాలు త్యజించాలని మాతంగిని నిశ్చయించుకుంది.

ఇద్దరూ తమ తమ ప్రతిజ్ఞలు పాలించారు. మధురబాబు రోజూ వచ్చి తన మందు ఎంతవరకు పనిచేసిందో చూచి వెళ్ళేవాడు. చావటానికి సిద్ధంగాఉన్న సమయంలోనే మాధవుడు ఆమెను కాపాడాడు.

పై కథ యావత్తు మాతంగిని సవిస్తరంగా చెప్పింది. తార మెదలకుండా వింటూ కూర్చుంది.

తెల్లవారకముందే మాధవుడు వెళ్ళిపోయాడు. బల హీనత వల్ల మాతంగిని అప్పుడే వెళ్ళలేక పోయింది. సాయంత్రము వరకు ఆమెను యిక్కడే ఉంచితే సాయంత్రం కరుణ వచ్చి తీసుకు వస్తుందని తార, మాధవుడు నిశ్చయించుకున్నారు.

మాధవుణ్ని బయటవరకు సాగనంపి తార మాతంగిని వద్దకు తిరిగివచ్చింది. "యిప్పుడిక నిన్ను బంధించటం

నావంతు" అని నవ్వుతూ చెప్పి తార తలుపులు మూసి బయట తాళం వేసింది. నెమ్మదిగా తన గదిలోకి వచ్చింది. భర్త యింకా నిద్రపోతూనే ఉన్నాడు. తాళం చెవుల్ని యథాస్థానంలోఉంచి తన మంచం మీద పడుకుంది. పడుకోగానే తార నిద్రపోయిందా? లేదు. ఆమె భర్త రహస్యాలు తెలుసుకుంది. భర్తమీద ప్రేమతో ఆమె దుర్భర దుఃఖాన్ని కొనితెచ్చుకుంది. భర్తయొక్క రహస్య కార్య కలాపాలు తలచుకొని ఆమె భయంతో కంపించింది.

మాతంగిని రోజంతా ఆ నిర్జనమైన గదిలోనే గడిపింది. ముందుగా నిశ్చయించుకున్న ప్రకారము కరుణవచ్చి ఆమెను తీసుకు వెళ్ళింది. ఎన్నోరోజులనుండి అనేకకష్టాలు, బాధలు అనుభవించిన తరువాత మాతంగిని యివాళ కొంగలించుకుంది.

కలుసుకోగలిగినందుకు అక్కచెల్లెండ్రిద్దరూ మహదానందం పొందారు. తరువాత హేమాంగిని అక్కతో "దీదీ, నన్ను వదలి మరెప్పుడూ వెళ్ళనని వాగ్దానంచెయ్యి" అని అంది.

మాతంగిని నిట్టూర్చింది. ఆమె నేత్రాలు అశ్రుపూరితాలయ్యాయి.

"దీదీ, మమ్మల్ని వదలి వెళ్ళిపోతావా? జవాబు చెప్పవేం?" అని అడిగింది హేమాంగిని వ్యాకుల పడుతూ.

"నాన్నగారి వద్దకు వెళతాను"అని జవాబు చెప్పింది మాతంగిని.

# 21

ఆ రోజు సాయంత్రం గాలీ, వానా ప్రారంభ మయింది. నల్దిశలా అంధకారం ఆవరించింది. రొదచేస్తూ వీచేగాలీ, ఎడతెగకుండా కుండపోతగా కురిసే వర్షమూ— మేఘ గర్జనలతో ఆకాశం కంపిస్తూ ఉంది. మధుర ఘోషు ఒక్కడే కూర్చుని ఉన్నాడు. ఆ గాలివాన రొదలో అతనికి రెండుసార్లు శంఖము వూదిన శబ్దం విన్పించింది. తనకు అన వసరకష్టాలు,తన జీవితానికి కళంకం తెచ్చిన ఆ దుర్మార్గుల సంకేత ధ్వనుల్ని తాను లెక్కచేయకూడదనే మొదట అతడు నిశ్చయించుకున్నాడు. కానీ ఆ సంకేత ధ్వని ప్రతి సారి మరింత బిగ్గరగా విన్పించసాగింది. చివరికి అతడు లేచి వర్షంలో తడుస్తూ తమ నిర్దిష్ట ప్రదేశానికి చేరుకున్నాడు. అక్కడ వాక చెట్టుక్రింద దొంగల సర్దారు నిలబడి వున్నాడు.

ఎగతాళిచేస్తూ మధురబాబు "ఏమిటి సంగతి?ఇప్పటి వరకు జరిగినంత వరకు చాలు. ఇక నన్ను వదలిపెట్టండి. యింతవరకు వచ్చిన చెడ్డపేరు చాలు—మీరు నన్ను చాలా మోసం చేశారు" అని అన్నాడు.

సర్దారు శాంతంగా ఇలా అన్నాడు — "మేము మోసం చేయాలని ఏమీ చేయలేదు. శక్తివంచన లేకుండా

మీకు సహాయం చేయటానికే ప్రయత్నించాము. మాతో స్నేహం చేసిన తరువాత చివరి వరకు శిక్షను అనుభవించక తప్పదు.''

మధురబాబుకు చాలా కోపం వచ్చింది—"యిక మీతో నా కెలాంటి సంబంధమూ లేదని నీకు తెలుసు. ఈ గాలీవానలో రాత్రివేళ నన్ను పిలవటానికి కారణం ఏమిటి?"

"ఎందుకా ? ఈ సమయంలో తప్ప మనము మరెప్పుడూ బయటకు రాలేము. పోలీసులు మనకోసం వెతుకుతున్నారని వినే ఉంటారు."

"రాధాగంజ్ వదలి పారిపోలేదేం ?"

సర్దారు ముఖంలో వ్యంగ్యంతో కూడిన చిరునవ్వు కన్పించింది_"బాబూ, ఇంతకుముందు మీరెప్పుడూ ఇలా మాట్లాడలేదు. ఇప్పుడు చెడురోజులు వచ్చాయంటారా. మీ ఇష్టం వచ్చినట్లే ఆలోచించుకోవచ్చును. మేము ఎవరి పని చేస్తూఉంటామో వారియందు సదభిప్రాయంతోనే ఉంటామని చెపితే నమ్ముతారా ?"

"అంటే ?"

"ఇంతకాలం నా నీడగా తోడుగా ఉంటూ వచ్చిన మనిషి ఇవాళ నా వెంట లేడు."

"అవును, అతడు ఎక్కడికి వెళ్లాడు ? అతని పేరేమిటి ? భీఖూ గదూ ?"

"అతడు పోలీసులకు దొరికిపోయాడు"

మధురబాబు ఆ మాట విని అదరిపోయాడు—"అంతకు మించి మరేమీ జరగలేదు గదా?" మధురబాబు కంపించిపోతున్నాడు.

"అదీ జరిగిపోయింది. భీఖూ చేసినవన్నీ ఒప్పుకున్నాడు" సర్దారు కంఠస్వరంలో నిరాశ ధ్వనించింది.

"ఏమి ఒప్పుకున్నాడు?" మధురబాబు ఆవేశపడుతూ ప్రశ్నించాడు

"అన్నీ ఒప్పుకున్నాడు. మీకూ నాకూ ద్వీపాంతరవాస శిక్ష వేయటానికి ఇప్పటికి అతడు చెప్పినవి చాలు. నేను వాళ్ళకు చిక్కటంలేదు. ఇవాళే నేను రాధాగంజ్ వదలి వెళ్ళిపోతున్నాను. మీరు మాకు మేలు చేయాలనున్నారు. మేము మీకేమీ మేలు చేయలేదని అనుకోకుండా ఈ సంగతి చెప్పి హెచ్చరించి వెళదామని వచ్చాను."

సమాధానానికి కూడా ఎదురు చూడకుండా దొంగల సర్దారు పొదచాటున మాయమయ్యాడు.

మధురఘోషు యింటికి తిరిగివచ్చి రెండు గంటలసేపు ఆలోచిస్తూ కూర్చున్నాడు. అతని మానసిక శక్తి చాలా ప్రబలమైనది. అందువల్ల కొంత నిగ్రహించుకోగలిగాడు. ధైర్యం తెచ్చుకొని ముందు కర్తవ్యాన్ని గురించి ఆలోచించసాగాడు. పోలీసులు డబ్బుకు ఆశపడతారని అతనికి తెలుసు పోలీసు జాతిని నమ్మటానికి వీల్లేదు. తనవద్ద

ధనం వుంది. లంచం యిచ్చి వాళ్ళను ఆకట్టుకోవచ్చునని ఆలోచించాడు. కానీ మరొక సందేహం బాధిస్తూఉంది. ప్రస్తుతం మేజిస్ట్రేటుగావున్న ఐరిష్ దేశీయుడు ప్రతి విషయంలోనూ జోక్యం కలిగించుకొనే దురలవాటుగల మనిషి. ప్రతి విషయంలోనూ జాగ్రత్తగా వ్యవహరించే ధూర్తుడు. అతడు పోలీసులు చేసే అనేక పాపాలకు ప్రాయశ్చిత్తం చేయాలని ప్రయాసపడుతున్నాడు. ఏవిధంగానైనా సరే భీఖూ అంగీకరించన విషయాలను ఆ మేజిస్ట్రేటు ద్వారానే మార్పించాలని నిశ్చయించుకున్నాడు.

యింతలో ఒకమనిషి వర్షంలో తడుస్తూ లోనికి పరుగెత్తుకుంటూ వచ్చాడు. అతని శరీరమంతా బురద కొట్టుకొని వుంది. మధురబాబు జిల్లా కోర్టులో తన తరఫున నియమించిన నమ్మకస్తుడగు గుమాస్తా అతడు.

"బాబుగారూ పారిపోండి. ఒక క్షణం కూడా అలస్యం చేయవద్దు; పారిపోండి" అంటూ ఆ మనిషి బిగ్గరగా అరిచి చెప్పాడు.

"అసలు విషయం ఏమిటి?" అని అడిగాడు మధురబాబు.

"ఇవాళ మధ్యాహ్నం పన్నెండు గంటలకు భీఖూ అనే దొంగ జిల్లా కోర్టులో మేజిస్ట్రేటుగారి ఎదుట అనేక దొంగతనాలు, దోపిడీలు మీరు చెప్పినందు వల్లనే చేసినట్లు ఒప్పుకున్నాడు."

"ఏమిటీ? అతడు మేజిస్ట్రేటు ముందే ఒప్పుకున్నాడా?" అతని ముఖం ప్రేతకళ పడిపోయింది.

"అది వ్రాసి అతనిచేత సంతకం పెట్టించిన తరువాతనే నేను బయలుదేరి వచ్చాను. ఈ రాత్రికే పోలీసులు యిక్కడికి వస్తారని నా అనుమానం."

"యిక్కడికి వస్తారా? - ఈ రాత్రికే వస్తారా?" మధురబాబు మాటలు తడబడ్డాయి.

"బాబుగారూ, త్వరగా పారిపోండి."

"పారిపోతాను, తప్పకుండా పారిపోతాను."

అనునిషి వెళ్ళిపోయాడు.

మర్నాడు ఉదయ మయ్యేసరికి పోలీసుల్ని వెంట బెట్టుకొని మేజిస్ట్రేటు స్వయంగా రాధాగంజ్ వచ్చాడు. మధురఘోషు భవనంలోని గదులన్నీ వెతికారు, ఎక్కడా కన్పించలేదు.

చివరికి మధురఘోషు దొరికాడు. గిడ్డంగి భవనంలో మాధవుడు మొదలగువారిని బంధించిన గదిలో గృహయజమాని మృతదేహం కన్పించింది. మధురబాబు ఉరివేసుకొని ఆత్మహత్య చేసుకున్నాడు.

# 22

కథ ముగింపుకు వచ్చింది. కథలోని మిగిలినవ్యక్తులు ఏమయ్యారో తెలుసుకొని కథను ముగిద్దాం.

సర్దారు పోలీసులకు చిక్కకుండా పారిపోగలిగాడు — రాజమోహానుడు తప్పించుకోలేక పోయాడు. భీఖూ, రాజమోహనుడు తమ తమ నేరాలను అంగీకరించినప్పటికి అనేక విషయాలను చెప్పకుండా దాచినందుకు ద్వీపాంతరవాస శిక్ష విధించారు.

మాతంగిని మాధవుని ఇంటివద్ద ఉండలేకపోయింది. అందుకు కారణం వాళ్ళిద్దరికీ తెలిసినదే. అందుకని ఆమె తండ్రికి కబురు పంపి ఆమెను పుట్టింటికి పంపివేశాడు. వృద్ధునికి ప్రతి నెలా హెచ్చుగా సహాయము చేయసాగాడు. ఆమె జీవితం ఎలా గడిచింది, ఎలా మరణించింది అనే విషయాలు తెలియవు కాని ఎక్కువ కాలం జీవించలేదని మాత్రం తెలిసింది.

అయోగ్యుడగు తన భర్త భయంకర జీవితాంతమును తార ఎప్పుడూ తలచుకుంటూనే ఉండేది. ఆమె వితంతువుగా చాలకాలం జీవించింది— ఆమె జీవితం ప్రశాంతంగా గడచిపోయింది.

మాధవుడు, చంప మొదలగు వారిలో కూడా కొందరు మరణించారు. మిగిలినవారు కూడా మరణిస్తారు.





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA115B197 |
| పుస్తకం పేరు | మాతంగివి |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 185 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |